శ్రీ మాలోల గ్రంథమాల

పదమూడవ
పుష్పము



శ్రీమద్వేదాంత దేశిక ప్రణీత

# పాదుకా సహస్రమ్



శ్రీ కె. వి. రాఘవాచార్య విరచిత
రమణీయాంధ్ర టీకా తాత్పర్య వ్యాఖ్యా సహితము

సంపుటము - 5

VOLUME - 5

శ్రీ లక్ష్మీ నృసింహస్వామి వారి మరియు శ్రీ అహోబిల మఠం
ఆచార్యుల దివ్య మంగళాశాసనములచె



భగవత్ భాగవతా చరణ సేవాభిలాషి

తుర్లపాటి వెంకట సూర్య సత్యనారాయణ వరప్రసాద్
మరియు కుటుంబ సభ్యులు

రామంతాపూర్, హైదరాబాదు.

శ్రియై నమః



శ్రీ వేదాంత దేశిక ప్రణీత

శ్రీ రంగనాథ

# పాదుకా సహస్రమ్

**శ్రీ కె.వి. రాఘవాచార్య విరచిత**

రమణీయాంధ్ర టీకా తాత్పర్య వ్యాఖ్యా సహితము

## ఐదవ సంపుటము

ప్రచురణ

శ్రీ మాలోల గ్రంథమాల

శ్రీ అహోబిలమఠం, హైదరాబాదు.

శ్రీ వేదాంత దేశిక ప్రణీత
శ్రీరంగనాథ

# పాదుకా సహస్రమ్

**శ్రీ.కె.వి. రాఘవాచార్య విరచిత**

రమణీయాంధ్ర టీకా తాత్పర్య వ్యాఖ్యా సహితము
(తెలుగు మరియు నాగరలిపిలో మూలము)

**ఐదవ సంపుటము**

ప్రథమ ముద్రణము 2004

ప్రతులు : 1000

ప్రచురణకర్తలు

**శ్రీమాలోల గ్రంథమాల**
**శ్రీ అహోబిల మఠం, హైదరబాదు**

© సర్వస్వామ్యములు ప్రచురణకర్తలవి

వెల : రు. 100/-

ప్రాప్తిస్థానము
**శ్రీమాలోల గ్రంథమాల**
**శ్రీ అహోబిల మఠం**
దుర్గాబాయి దేశముఖ్ కాలనీ,
హైదరాబాదు - 500 013.
ఫోను : 27423043

అక్షర కూర్పు
**వివేక్ గ్రాఫిక్స్**
నల్లకుంట, హైదరాబాదు.

ముద్రణ
**వాగ్దేవి ప్రింటర్స్**
నల్లకుంట, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 30912541

**Sri Vedanta Desika's**
**Sri Ranganatha**

# PAADUKA SAHASRAM

**with**
**Telugu Commentary**
**by**
**Sri K.V. Ragahavacharia**
(with Text in Telugu and
Devenagari Scripts)

**Vol. 5**

**First Edition 2004**

1000 Copies

Published by
**Sri Malola Granthamala**
**Sri Ahobila Muth,** Hyderabad

**© Publishers**

**Price** : Rs. 100/-

Copies available at
**SRI MALOLA GRANTHAMALA**
Sri Ahobila Muth
Durgabai Desmukh Colony
Hyderabad - 500 013.
Tel : 27423043

Laser Composing by
**Vivek Graphics**
Nallakunta,
Hyderabad - 500 044.

Printed by
**Vakdevi Printers**
Nallakunta, Hyderabad - 500 044.
Ph : 30912541



SRIMATH ADIVAN SATHAKOPA YATEENDRA MAHA DESIKAN
FOUDER JEER OF SRI AHOBILA MUTH



**SRIVAN SHATAKOPA SRI VEDANTHA DESIKA YATEENDRA MAHA DESIKAN**
H.H. The 44th Jear of Sri Ahobila Muth



**SRI LAKSHMI NRISIMHA DIVYA PADUKA SEVAKA SRIVAN SHATAKOPA SRI NARAYANA YATEENDRA MAHA DESIKAN**

H.H. The 45th Jear of Sri Ahobila Muth

## ఈ ఐదవ సంపుటములో...





॥ श्रीः ॥

श्रीमते श्रीलक्ष्मी नृसिंह परब्रह्मणे नमः

श्रीमते रामानुजाय नमः

श्रीमते वेदान्त गुरवे नमः

श्रीमते श्रीवण्शठकोप श्री वेदान्त देशिक यतीन्द्र महादेशिकाय नमः

**श्रीमदहोबिलमठे पंचचत्वारिंश पट्टे मूर्धाभिषित्तानां श्रीमत्परम हंसेत्यदि अन्वर्थ बिरुदावलि मण्डितानां श्रीमतां श्रीलक्ष्मी नृसिंह दिव्यपादुका सेवक श्रीवण् शठकोप श्री नारायण यतीन्द्र महा देशिकानां श्रीमुखपत्रम् ॥**

सर्वलोकोज्ज़ीवनार्थमवतीर्णैः श्रीमन्निगमान्त महादेशिकैः अनुगृहीतेषु बहुषु ग्रन्थेषु एकस्मिन्नुषसि श्रीरंगनाथ दिव्याज्ञया कृतावतारः पादुकासहस्र नामा ग्रन्थमणिः। सोयंग्रन्थतल्लजः बहुभिः बह्वीषु भाषासु व्याख्यांतः लोकानामनुत्तमं उपकारमातनोति।

परन्तु आन्ध्रभाषायां व्याख्यानं इयत स्समयानस्य नाभूदिति निर्विण्णाः आन्ध्रदेशवास्तव्याः आस्तिकाः समुचितं अधिकारिणं अन्विष्य लब्ध्वा तद्द्वारा अतिसरलया अतिरुचिरया च आन्ध्रभाषायां व्याख्यां कारयित्वा हैद्राबाद, अहोबिलमठे श्रीमालोलग्रन्थमालया ग्रन्थस्यास्य चत्वारोभागाः एकोनत्रिंश पद्धत्यन्ताः प्रकटीकृताः। इदानीं पंचमो भागः सान्तः प्रकाशयितुं विराजते।

व्याख्याता श्री. उ.वे. के.वि. राघवाचार्याः इति प्रसिद्धाः श्रीसन्निधि शिष्याः प्राज्ञाः प्राज्ञ सम्पतश्चे त्येतदेवालम् एतत्प्रणीतायाः व्याख्यायाः सामीचीन्ये।

श्री मालोल ग्रन्थमालातः प्रकटीक्रियमानोऽयं ग्रन्थः एधतां शरदांशतम् ।

व्याख्याताच ईदृशेषु कर्मसु लब्धावकाशाः विराजन्तु। एतत् ग्रन्थपारायणेन सर्वे सर्वमङ्गल भागिनो भवन्तु इति आशास्महे।

HIS HOLINESS
45th JEER OF SRI AHOBILA MUTT

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీ నిగమాంత దేశికాయ నమః

# ప్రకాశకుల మనవి

భగవన్నామములు, గుణములు, రూపముల మహాత్మ్యమును వర్ణింప, కీర్తింప దేవతలకే అసాధ్యమైనపుడు మానవ మాత్రులకెట్లు సాధ్యపడును? కేవలం లక్ష్మీహయవదనుల అనుగ్రహం వల్లనే అది సాధ్యమవుతుంది.

**విశేష విత్పారిషదేషు నాథ**
**విదగ్ధగోష్ఠీ సమరాంగణేషు**
**జిగీషతోమే కవితార్కికేంద్రాన్**
**జిహ్వాగ్రసింహాసన మభ్యుపేయాః  హ.స్తో.28**

శ్రీ హయగ్రీవుని తన నాలుకపై వసించి తాండవం చేయుమని, సభలో కవులను, తార్కికులను జయింపతగిన శక్తియుక్తులను ప్రసాదింపమని శ్రీ నిగమాంత మహాదేశికులు శ్రీ హయగ్రీవులను ప్రార్థించినందువలన శ్రీనిగమాంత దేశికులు పాదుకా సహస్రమును రచింపగలిగిరి. అందువలన పాదుకాసహస్రమునకు రమణీయ వ్యాఖ్యను అనుగ్రహించు శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులవారు శ్రీ హయగ్రీవ ప్రసాదలబ్ధులే అని మనం గ్రహింపవలసి యున్నది. భగవంతుని పూర్ణరూపమును ఇంతకు పూర్వము ఎందరెందరో వర్ణించియుండిరి. కాని కేవలం స్వామి పాదుకలను గూర్చి మాత్రమే సహస్ర శ్లోకపరిమిత గ్రంథమును రచించుట అనితర సాధ్య విషయము. ఆ అదృష్టము శ్రీ వేదాంత దేశికులకు మాత్రమే దక్కుట మన పూర్వ పుణ్యవిశేషము.

**నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే**
**సహస్రపాదాక్షి శిరోరుబాహవే**
**సహస్రనామ్నే పురుషాయశాశ్వతే**
**సహస్రకోటి యుగధారిణేనమః**

భగవానుని మూర్తులు, పాదములు, అక్షులు, శీర్షములు, ఊరువులు, బాహువులు, నామములు అన్నియు సహస్రసంఖ్యాపరిమితములే. భగవానుడు ఏ సంఖ్యకునూ పరిమితుడు గానపుడు సహస్ర సంఖ్యకు మాత్రము ఎట్లు లోబడునన్నది ఇచ్చట విచారణీయాంశము. భగవానుడు అనంతుడు కావున అతని నామ, గుణ, విభూతులు అన్నియు అనంతములే. పాదములు గూడ అట్లే అనంతములే. అనంతములైన పాదములను వర్ణించుటకు చిన్న చిన్న సంఖ్యలు సరిపోవు కావున సహస్ర సంఖ్యను గ్రహింప వలసి వచ్చినది. ఇచ్చట సహస్రమనగా పాదద్వయముగాదు. అవి అసంఖ్యాకములని అభిప్రాయము. బలిచక్రవర్తిని వశుని చేసికొను సందర్భమున భగవానుని పాదద్వయము, త్రయముగా మారి లోకములన్నింటిని ఆవరించి స్పృశించినవి. వామనరూపము త్రివిక్రమరూపమును దాల్చినది. అపుడు లోకములన్నియు తరించినవి. దేశికులు గూడ మొదట వామన భావమును ఆ తర్వాత త్రివిక్రమ భావాన్ని పొంది పెరిగినాడని మనం ఈ సందర్భంలో భావించాలి. భగవాన్ యామునులు స్తోత్రరత్నమునందు భగవత్ చరణారవింద ద్వయమును తన శీర్షమును అలంకరింపుమని స్తోత్రరత్నమున ప్రార్థించుట ఇచ్చట మననీయము.

"కదాపునశ్శంఖ రథాంగ కల్పక-ధ్వజారవిందాంకుశ వజ్రాలాంఛనం, త్రివిక్రమ త్వచ్చరణాంబుజద్వయం, మదీయమూర్ధానమలం కరిష్యసి" అనగా భగవచ్చరణారవింద ద్వయములు శంఖము, చక్రము, ధ్వజము, అంకుశము, వజ్రము ఇత్యాది శుభ చిహ్నములు గలవి. అట్టి దివ్యచరణాలను తన శీర్షమును అలంకరింపుమని యామునులు ప్రార్థించినారు. మందిరములలో అర్చనానంతర సమయమున అందరి శీర్షములందు శఠారిని ఉంచుట ఒక ఆచారంగా వచ్చినది. అనగా చరణములను తన తలపై

ఉంచుట యామునమునుల ఆదేశమని అర్థము.

పాదుకా సహస్రము, భగవద్దివ్య పాదారవిందములను గూర్చిన ఒక దీర్ఘ స్తోత్ర కావ్యము - ఈ కావ్యమునందు కేవలం సహస్ర అర్థములనే గాక, అసంఖ్యాకమగు అర్థములునూ నిబిడీకృతమై యున్నవి. "సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష సహస్రపాత్ అని వైదిక సూక్తి. భగవానుని అంగములన్నియు అనంత సంఖ్యకు చెందినవే అని భావము. ఇంతటి గంభీర అర్థములుగల భగవచ్చరణ ద్వంద్వాన్ని శ్రీనిగమాంత దేశికులు తప్ప మరెవరు వర్ణించుటకు సాహసింపగలరు?

శ్రీ నిగమాంత దేశికులు తిరుమలలోని శ్రీనివాసుని ఆలయమందలి ఘంటావతారులు. శ్రీశ్రీనివాసుడే శ్రీనిగమాంత దేశికులుగా అవతరించిరని పెద్దల అభిమతము. శ్రీశ్రీనివాస పెరుమాళ్ల జన్మతిథియే శ్రీ నిగమాంత దేశికుల జన్మతిథిగావటం గమనార్హం. ఒక సామాన్యుడగు కవితో పోటీపడి "ఒక్క రాత్రిసమయంలోనే పాదుకా సహస్రగ్రంథమును రచించి శ్రీరంగని చరణములకడ సమర్పించుట, ప్రత్యర్థిని ఓడించుట భగవత్ కృపగల వానికే సాధ్యము, పాదుకా సహస్రమును రచించి పామరులగు మనందరిని అనుగ్రహించుట దేశికుల దయాగుణములకు నిదర్శనమైతే, దానిని ఆస్వాదించుట మనందరి భాగ్యవిశేషము.

లోకంబులు, లోకేశులు, లోకస్థులను రక్షింప సమర్థములైనవి పాదములైతే వాటిని రక్షించునవి కవచములు పాదుకలు. రక్షించువారిని రక్షించుట సామాన్య విషయముగాదు. పాదుకా సహస్రమునందు పాదుకల విశ్వరూప ప్రదర్శనంను చేయుట ఇతివృత్తం. చూచుటకు పాదుకలు రెండే అయినా అవిగూడ అసంఖ్యాక గుణ భూషణములు-మనందరకు ఆశ్రయ స్థానములు. "అణోరణీయాన్ మహతోమహీయాన్" అన్నట్లుగా చిన్న ఆకారంలోగల పాదుకలు అణురూపమైతే వాటి వర్ణన మహతో మహీయాన్ అన్న లక్షణాన్ని పొందినది.

"వితస్తి మాత్రే దారుఖండే సహస్రం వివరాణి రచితవాన్, వేంకటనాథ గురురేవ కవిః, అన్యేతు కపయ ఏవ" అనగా జిట్టెడు కట్టెముక్క మీద వేయిఛిద్రాలను కల్పించిన వేంకటనాథుడే గురువు. అన్యులు కపులు మాత్రమే. మందో భవిష్యన్నియతం హింబో, వాచాంనిధేవంచిత భాగధేయః భగవచ్చరణముల నాశ్రయించు మందభాగ్యుడు గూడ బ్రహ్మవంటివాడవుతాడని హయగ్రీవస్తోత్రం ప్రకటిస్తుంది. విలుప్త మూర్ధన్య లిపిక్రమాణాం, సురేంద్ర చూడా పదలాలితానాం' అని హయగ్రీవస్తోత్రము. బ్రహ్మరాతనుదుట లేనివాడైనా, సురేంద్ర మస్తకమైనా హయగ్రీవుని దయతో కోరిన కోరికలు అవి తీరును గదా !

శ్రీరాముని దివ్యపాదుకలను శ్రీరాముడు భరతునకు ప్రసాదించెను. అనగా అవి భరతుని స్వాధీనమున నుండెను. భరతుడే తొలుదొల్త పాదుకల దివ్యమగు భవ్యత్వాన్ని అనుభవించినాడు. శ్రీదేశికులు ఈ రహస్యాన్ని గమనించి "భరతాయ ప్రథమోదాహరణాయ అని మొట్టమొదటే భరతుని కీర్తించినారు-పదునాలుగేండులల కాలము పాదుకలకు భరతుడు సేవను సమర్పించినాడు-భరతునికి గూడ రామానుజుడనియె నామం - రామానుజుడు విశిష్టాద్వైత స్థాపకుడు-అందువలన పాదుకా సహస్రమందలి శ్లోకాలు పాదుకల పర్యాయంగా, నమ్మాళ్వార్ పర్యాయంగా, రామానుజుల పర్యాయంగా వివిధములైన అర్థాలను, రహస్యాలను వెల్లడించ గల్గునని పూర్వాచార్యవర్యుల అభిమతము.

శ్రీ వేదాంత దేశికులు సమయ సహస్రమని మరొక అద్భుత గ్రంథం రచించినాడని ప్రతీతి, మన దౌర్భాగ్యవశమున అది మనకు నేడు లభించుటలేదు. దేశికులు షోడశోత్తర శతగ్రంథములను రచించియున్నారని పరిశోధకుల అభిప్రాయము కాని వాటిలో చాలావరకు ఎన్నో కాలగర్భములో కలిసిపోయినవి. ఈ గ్రంథమునకు ఎందరో మహానుభావులు తొలుదొల్త తమిళంలో, ఆంగ్లంలో వ్యాఖ్యలను ప్రసాదించిరని పెద్దల వచనం. తెలుగులో మాత్రం అది ఇదివరకు జరుగలేదు. శ్రీ కె.వి. రాఘవాచార్య స్వామివారు భువిపై అవతరించు వరకు ఈ స్తోత్రము వేచియుండవలసి వచ్చినది. ఇపుడు పాదుకా రహస్య రమణీయత ఏదో శ్రీరాఘవాచార్యులవారి వ్యాఖ్య వలన మనకు తేటతెల్లము అవుతూ ఉంది. అందులకు మనమందరము భాగ్యవంతులం.

వరద గురువులు శ్రీ దేశికులు చిన్నగానున్నపుడే "ప్రతిష్ఠాపిత వేదాంతః ప్రతిక్షిప్త బహిర్మతః - భూయాస్త్రైవిద్యమాన్యత్వం - భూరికల్యాణ భాజనం" అని ఆశీర్వదించాడట. ఇతరమత సిద్ధాంతములను ఖండించి వేదశాస్త్ర సిద్ధాంత జ్ఞానమును స్థిరంగా స్థాపించి, వేదమూర్తులచే సన్మానితుడవై సకల శుభములను పొందుదువుగాత అని వరద గురువులు నిగమాంత దేశికులను ఆశీర్వదించిరనునది ఇతిహ్యాము-

**వేదేసంజాత ఖేదేమునిజన వచనే ప్రాప్త నిత్యావమానే**
**సంకీర్ణే సర్వవర్ణే సతి తదనుగుణౌ, నిష్ప్రమాణే పురాణే**
**మాయావాదే సమోదే కలికలుష వశాత్ శూన్యవాదేవివాదే**
**ధర్మత్రాణాయ యోభూత్ సజయతు భగవాన్ విష్ణుఘంటావతారః.**

కలికాలవశాత్ వేదాలకు అపార్థములను కల్పించడం, పెద్దలమాటలను మన్నింపకపోవడం, వర్ణసాంకర్యం ఏర్పడడం, సంఘం విచ్ఛిత్తికి గురిగావడం జరిగినపుడు వైదిక ధర్మ రక్షణ కోసం శ్రీశ్రీనివాసుడే శ్రీవేదాంత దేశికుడుగా అవతరించిరి అనునది ఈ శ్లోకార్థము. అట్టి శ్రీ దేశికులకు జయమగుగాత! అని మహాకవి డిండిముడు వర్ణించెను.

దేశికుల రచనల సంఖ్య షోడశోత్తర శతం. వాటిలో ఎన్నో మనకు ఈనాడు లభించుటలేదు. అట్టి కాలంలో శ్రీపాదుకా సహస్రమునకు వ్యాఖ్యను రమణీయంగా మనందరికి అందజేయుట మన అదృష్టం.

దేశికుల రచనలు నారికేళ పాకంవంటివి, వాటినే రెండవసారి, మూడవసారి చదివితే అవన్నియు ద్రాక్షాపాకంగా మారునని పూర్వాచార్యుల అభిప్రాయం.

పాదుకాసహస్రము ద్వాత్రింశ పద్ధతుల కమనీయ స్తోత్ర కావ్యం. 32 అక్షరములు అనుష్టుప్ఛందస్సుకు లక్షణం. శ్రీ అన్నమాచార్యులు 32 వేల కీర్తనలను రచించినారట. ఉపనిషత్ విద్యల సంఖ్య గూడ 32 మాత్రమే. 32 సంఖ్యకు శ్రీ లక్ష్మీనృసింహులకు, శ్రీశ్రీనివాసునకు ఏదో ఒక గొప్ప సంబంధమున్నది. నృసింహుని మంత్రరాజ స్తోత్రములోని శ్లోకాలలో గల అక్షరాల సంఖ్య గూడ 32 మాత్రమే. ఆ సంబంధం వల్లనే దేశికులు 32 పద్ధతులను గ్రహించినాడని తోచుచున్నది. పాదుకాసహస్రము ఒక విధంగా సంస్కృత సాహిత్య ఛందశ్శాస్త్రమునకు విజ్ఞాన కోశమువంటిదని తెల్పవచ్చు.

కేవలం ఒకనాటి రాత్రి సమయంలోనే సహస్రపరిమితమగు పాదుకాసహస్రమును రచింపగలుగుట ఊహింపలేని విషయము. - సాక్షాత్ శ్రీరంగడే దేశికులను రచింపుమని ప్రోత్సహించుట వల్లనే ఈ అసాధ్య కార్యం సులభసాధ్యమైనది. యోగులకు నిద్రబోవు రాత్రి సమయం జాగరూకత సమయమని భగవద్గీత తెల్పుతుంది. ఇట్లు ఒక విధంగా పాదుకాసహస్రం యోగ దర్శన కావ్యం అని అంటే అతిశయోక్తి కాదు.

శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు సిద్ధాంత విషయంగా, కవిత్వ రచనలో, అనుభవంలో అందెవేసిన చేయి. ఇందులకు వారు రచించిన గ్రంథములే ప్రమాణము. వారు ఇంతకు పూర్వం 10 గ్రంథాలకు వ్యాఖ్యలను ప్రసాదించినారు. మొదట శ్రీ గోదాదేవి స్తోత్రాన్ని వ్యాఖ్యానించి శ్రీ ఆండాళ్ అనుగ్రహానికి పాత్రులైనారు. ఆ తర్వాత భగవద్ధ్యాన సోపానాన్ని వ్యాఖ్యానించి, మరింతగా ఈ రంగంలో ఉన్నత స్థితిని అందుకున్నారు. గరుడ దండకాన్ని వ్యాఖ్యానించి ఆకాశంలో విహరించినారు. ఇపుడు పాదుకా సహస్రాన్ని రచించి శ్రీరాముడు, భరతుడు, శ్రీరంగడు, గరుడుడు మున్నగు వారి అనుగ్రహానికి పాత్రులైనారు. మున్ముందు యతిరాజసప్తతి షోడశాయుధ స్తోత్రం, సుదర్శనాష్టకాన్ని గూడ వ్యాఖ్యానించి మనను మరింత భాగ్యవంతులుగా చేయ సమకట్టినారు. కావున మనం వారిని ఎంతగా స్తుతించినా తక్కువే. పాదమనగా పేయాన్ని అందించేది అని భావం. పాదుకా సహస్రం పఠించువారందరకు త్రివిక్రముని పాదములు త్రిలోకాలకు గంగను కూర్చినట్లే, మనకు అమృత పేయాన్ని సమకూరుస్తాయని అంతరార్థము.

రమణీయ వ్యాఖ్య ఉభయ వేదాంతములు మేలు కలయిక. సంస్కృత, ద్రావిడ వేద వేదాంతాలలోనుండి ఆయా సంబంధిత రహస్యాలను వ్యాఖ్యలో రాఘవాచార్యులవారు మనకందించారు. తమిళంతో పరిచయం లేని భక్తవరులందరకు రమణీయం వరంలాంటిది.

అనువాదం అందరికీ చేతనయ్యే పనికాదు. మూలగ్రంథము దాని భాష మరియు ఏ భాషలోనికి అనువదింపబడాలో ఆభాష (ఈ రెండు భాషలపై) సమానమైన అధికారముండాలి. భాషా నిర్మాణము, నుడికారాలు బాగా తెలియాలి. గహనమైన విషయాన్ని తేటతెల్లంగా మృదుమధురంగా మార్చి వ్రాయగల్గాలి. కొందరికి మాట్లాడుట పై చక్కని ప్రవేశము నైపుణ్యాలు ఉంటాయి.

వ్రాయడం వారికి చేతగానిపని. మరికొందరికి వ్రాయుట అన్ని నల్లేరుపై నడక. కాని వారికి మాట్లాడుట చేతగాదు. ఈ రెండింటియందు సమానమైన నైపుణ్యంగల రాఘవాచార్యులవంటివారు చాలా తక్కువ.

రెండు భాషలపై అధికారంతోపాటు విషయము పరిచితమై యుండాలి. పాఠకుల మనోవిజ్ఞానమును తెలిసి ఏవిధంగా విషయాన్ని అనువదిస్తే ఆకర్షణీయంగా ఉంటుందో, సులభగ్రాహ్యంగా ఉంటుందో తెలిసి యుండాలి. శ్రీ కె.వి. రాఘవాచార్యులు వస్తుతః అధ్యాపకుడు, అతని అధ్యాపన కళ ఈ సందర్భంలో అతనికి బాగా ఉపకరించింది. సంస్కృత, ఆంధ్ర, ద్రావిడ భాషలందు చక్కని ప్రవేశ పాండిత్యాలు వారికి ఉన్నాయి. వ్యాఖ్యానం చేయగల చతురత, విస్తృతమైన పాండిత్యము, భావుకత వారిలో నిబిడీకృతమైయున్నాయి. ఇంతకుముందు అనువాదాలను, వ్యాఖ్యాలను చేసిన అనుభవం గూడ ఉంది. శ్రీ వేదాంతదేశికుల హృదయాన్ని గూడ బాగా తెలిసినవారు గావటం స్వర్ణానికి సౌరభం లభించినట్లయినది – వారు మనకు లభింపజేసిన పాదుకాసహస్ర వ్యాఖ్యానము పండితులకేకాదు. పామరులకు గూడ అవగాహనం కాగలుగునన్న ఊహ, విశ్వాసము మనకు నేడు కలిగింది.

శ్రీ మాలోల గ్రంథమాల హైదరాబాదు అహోబిల మఠమునకు చెందిన ప్రచురణ శాఖ కీ.శే. శ్రీ వి.పి. రాఘవాచార్యులుగారు దీనిని అహోబిల మఠాధిపుల ఆశీర్వాద, ఆమోద బలాలతో స్థాపించినారు. ఇంతవరకు మాలోల గ్రంథమాల కొన్ని పుస్తక సుమాలను ప్రచురించింది. మాలోల ప్రచురణలు అన్నియు బాగా పేరు గాంచినవే. అదేవిధంగా కీ.శే. వి.పి. రాఘవాచార్యుల వారి కోరికపై పాదుకాసహస్ర వ్యాఖ్యాన యజ్ఞం గూడ ప్రారంభింపబడి నేటికి పూర్తియైనది. శ్రీ మాలోల నృసింహుని దివ్యకటాక్షము మరియు శ్రీ అహోబిల మఠం 45వ పీఠాధిపతులుగా వేంచేసియున్న శ్రీ లక్ష్మీనృసింహ దివ్యపాదుకాసేవక శ్రీవణ్ శఠకోప శ్రీనారాయణ యతీన్ద్ర మహాదేశికులవారి దివ్యానుగ్రహంతో శ్రీమాలోల గ్రంథమాల మరింత ప్రగతిని సాధించి మూడుపూవులారుకాయలుగా వర్ధిల్లాలని, భక్తకోటికి ఈ గ్రంథాలు ఆనందాన్ని, శాంతిని ప్రసాదించాలని కోరుతున్నాం.

ఈ సంపుటి ముద్రణకు తమ విరాళములు అందించిన **శ్రీ ఈ.ఆర్.ఎస్. రెడ్డి** మరియు **శ్రీ సత్యసాయి చరణ్**లకు కృతజ్ఞతలు.

పాదుకాసహస్ర వ్యాఖ్యాతయగు శ్రీమాన్ శ్రీ కె.వి. రాఘవాచార్యులగారు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో గ్రంథమాలకు, వైష్ణవ లోకానికి, భక్త ప్రపంచానికి తమవంతైన వాచాకైంకర్య లేఖా కైంకర్యమును భూరిభూరిగా సమర్పింపగలిగిన దివ్య అమోఘ శక్తి సామర్థ్యములను మరింతగా పొందాలని, పాఠకులందరు పాదుకా సహస్రాన్ని నిత్య పఠనీయ గ్రంథంగా సేవిస్తూ తరించగలగాలని మా సవినయ ఆకాంక్ష.

ఇట్లు
**శ్రీ కె. దేవనాథన్**
అధ్యక్షులు
శ్రీ మాలోల గ్రంథమాల,
శ్రీ అహోబిలమఠం, హైదరాబాద్.

# విజ్ఞప్తి

శ్రీ అహోబిల మఠం 44వ పట్టమున వేంచేసి యుండిన శ్రీ శ్రీవణ్ శఠకోప శ్రీవేదాన్త దేశిక యతీంద్ర మహాదేశికులవారి మంగళాశాసనముచే హైద్రాబాదులో అహోబిల మఠం స్థాపింపబడినది. తదనుబంధంగా శ్రీ మాలోల గ్రంధమాల ఆ స్వామి అనుగ్రహముచేతనే ప్రారంభింపబడినది.

లౌకికముగాని పారలౌకికముగాని ఏకార్యమునైన నిర్వహించినచో, అది దైవ నిర్ణయమను అధ్యవసాయము కలవారైన, ఆయా వ్యక్తుల అంతరంగమున నున్న ప్రతిభను బహిర్గతమగునట్లు చేసిన, ప్రగతిశీలురై విశేషకీర్తి కాయులైన శ్రీమాన్ వి.పి. రాఘవాచార్య స్వామివారు ప్రాతఃస్మరణీయులు.

దాసుడు 'సత్పథాచారము' అను శీర్షికతో "శ్రీరంగనాథ పాదుకా సహస్ర" స్తోత్రకావ్య వైభవమును వ్యాసరూపముగ వ్రాసి 'బరోడా' నుంచి పంపగా, అవ్యాజ కృపతో దానిని ఆమోదించి "శ్రీనృసింహప్రియ"లో ప్రచురించి ఆమాస పత్రికను 'బరోడా'కు పంపిన మహోదయులు శ్రీ వి.పి. రాఘవాచార్య స్వామివారు హైదరాబాద్‌కు రాగానే 'శ్రీపాదుకాసహస్ర' వ్యాఖ్యానమును వ్రాయుచున్న దాసుని గుడిశెకు వారువేంచేసి, ఆవ్రాత ప్రతిని చూచి, వారి భవనమునకు దాసుని తీసికొనిపోయి, వారి మామగారైన శ్రీమాన్ వింజమూరి రామాచార్యుల వారు అడిగిన రెండు శ్లోకముల వ్యాఖ్యానమును వినిపింపజేసిన మహాశయులు వారు. మరునాటి ఉదయమున శ్రీమాన్ వి.ఎస్. రాఘవాచార్యులతో సహా వచ్చి "అహోబిల మఠములో 'తిరుప్పావై' కాలక్షేపమును మీరే చేయవలె"నని ఆజ్ఞాపించి, దాసుని కృతార్థుని చేసిన మాన్యనియామకులు శ్రీ వి.పి. రాఘవాచార్యస్వామి వారు.

ఇట్లు భగవద్భాగవతాచార్యానుగ్రహ పటిమచేత దాసుడు, 1992లో ఆరంభించిన శ్రీపాదుకా సహస్ర వ్యాఖ్యాన రచన 2002లో పూర్తియైనది. ఈ వ్యాఖ్యాన రచనకు అవసరమైన కాలము ఒక్క దశాబ్దియగు(ను)ట దాసుని అల్పజ్ఞతనే నిరూపించును కదా!

1999లో మూడవ సంపుట మావిష్కరింపబడిన సమయమున శ్రీ వి.పి. రాఘవాచార్య స్వామివారు నిజహస్తపద్మములచే దాసునికి జరీ శాలువను కప్పి, పదివేల రూప్యములనిచ్చి సత్కరించి 'ఇక నాలుగవ సంపుటమును చూడలేను' అని వక్కాణించిన వాచంయములు శ్రీ వి.పి. రాఘవాచార్యస్వామివారు. ప్రస్తుతం శ్రీ అహోబిల మఠం 45వ పట్టమున వేంచేసియున్న శ్రీశ్రీవణ్ శఠకోప శ్రీ నారాయణ యతీంద్ర మహాదేశికుల వారి కరకమలములచేత ప్రథమ (1996లో) ద్వితీయ (98) చతుర్థ (2001) సంపుటములు ఆవిష్కరింపబడినవి. అనేక సత్కార్య నిర్వాహకులైన శ్రీమాన్ వి.పి. రాఘవాచార్య స్వామివారు లేనిలోపమును పూరింపనెవరి తరముకాదు' అని కాలము నిరూపించుచునే యున్నది.

వారి అధ్యక్షతలో సుశిక్షితులైన కార్యవర్గ సభ్యులందరు అహోబిలమఠ విధినియమాలను శ్రద్ధాళువులై నిర్వహించుచున్నందువలననే ఈ పంచమ సంపుటము కూడ వెలివడుచున్నది.

అన్నిటికి వలె ఈ సంపుటమునకును మంగళాశాసనమును కృపజేసిన శ్రీశ్రీ అళగియ శింగర్ గారికి అనేక సాష్టాంగ ప్రణామములు.

ఈ సంపుటమును సమగ్రంగా పరిశీలించి, అమూల్యములైన తమ అభిప్రాయములను అందించి, మంగళాశాసనములను అనుగ్రహించినవారు ఉ.వేదాంత ప్రవర్తకులు విఖ్యాత వ్యాఖ్యాతలు శ్రీమాన్. డా॥ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారు, తిరుపతి. మహామహోపాధ్యాయులు, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత శాఖా విశ్రాంత ప్రాచార్యులు, బ్ర.శ్రీ. డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు, హైదరాబాదు బహుభాషా గ్రంథ విమర్శకులు, కాకతీయ యూనివర్సిటీ ప్రొఫెసర్ ఆఫ్ ఇంగ్లీషు, శ్రీమాన్ డా॥ శ్రీ పెరుంబూదూరు శ్రీ లక్ష్మణమూర్తిగారు, వరంగల్లు. ఈ సంపుటమునకు కూడ తమ 'రివ్యూ'ను ప్రకటించుటకనుమతించిన వారు శ్రీమతి డా॥ ప్రేమానందకుమార్‌గారు, శ్రీరంగం.

ఈ అవ్యాజ కృపామూర్తుల సన్నిధిలో కార్తజ్ఞ్య పూర్వక సప్రశ్రయ ప్రణామములు.

ఈ నా రచనలకు ఎట్టి ఆటంకం కలుగకుండా తోడ్పడుచున్న అనుజులకు – శ్రీమాన్ పార్థసారధి, నరసింహాచార్య, డా॥ తిరుమల శ్రీనివాసాచార్య, డా॥ టి. వెంకటరమణాచార్య స్వాములకు, తనుజులైన చిరంజీవులు కె.వి. రమణాచారికి, కె. మనోహరాచారికి అనేక మంగళాశాసనములు. శ్రీ దేశికుల గ్రంథ రచనలకు ప్రోత్సహించుచు, ఈ పంచమ సంపుటమును ప్రచురించి అనుగ్రహించిన శ్రీమాన్ వి. రాఘవన్‌గారు, కె. దేవనాథన్‌గారు, యం.వి. సౌందరరాజన్ గారు, పి. శ్రీనివాసాచార్యులు మొదలగు 'శ్రీమాలోల గ్రంథమాలా' నిర్వాహకులకు నమస్సుమనస్సులు.

ఈ గ్రంథముద్రణకు విరాళములనిచ్చి సహకరించిన దాతలను శ్రీమాలోలస్వామి ఆయురారోగ్యైశ్వరాభివర్ధకముగ అనుగ్రహించుగాక యని ప్రార్థన.

ఈ సంపుటమునకు ముఖచిత్రమును సమకూర్చిన చిత్రకారులకు, ఈ సంపుటమును అందముగా అచ్చువేసి ఇచ్చిన 'వాగ్దేవి ప్రింటర్స్' (నల్లకుంట) వారికి అనేక ధన్యవాదములు.

అనుసంధించిన మాత్రమున మోక్షమును ప్రసాదించు 'శ్రీ రంగనాథ పాదుకా సహస్రము'ను శ్రద్ధతో పఠించు భక్తులందరికి అభినందన చందనములు.

కర్త, కారయిత, ప్రేరక, అనుమోదకులందరిని శ్రీమాలోలస్వామి నిరంతరం కటాక్షించుచు అనుగ్రహింపవలెనను మహావిశ్వాసముతో విజ్ఞప్తి చేయుచున్న

భాగవతచరణరేణువు

**కె.వి. రాఘవాచార్యులు**

నివాసము :
C/o K.V. Ramana Chari
B.H 3/6, IAS Officers' Qts.
Road No.10,
Banjara Hills, Hyderabad-34.
Ph : 23350258

Dt. 10-12-2003

# శ్రీ వేదాన్త దేశికుల సంగ్రహ జీవిత చరిత్ర

**గురుభ్యస్తద్గురుభ్యశ్చ నమోవాక మధీమహే ।**
**వృణీ మహే చ తత్రాద్యౌ దమ్పతీ జగతాంపతీ ॥**

శ్రియఃపతి, ఉభయ విభూతినాయకుడైన శ్రీమన్నారాయణుడు హంస, మత్స్య, హయగ్రీవ, నరనారాయణాద్యనే కావతారాలెత్తి సంసార ప్రవాహంలో పడికొట్టుమిట్టాడుతున్న జీవులు తనను ఉపాసించి తరించడంకోసం వేదమార్గాన్ని నెలకొల్పాడు. భగవత్తత్త్వాన్ని తెలిపే శాస్త్రాలను ప్రవర్తింపజేశాడు. అజ్ఞానులైన చేతనులు ఆ సౌలభ్యాన్ని గమనించకపోవడమే కాక "అవజానంతి మాం మూఢాః" అని ఆయన ఆవేదన పడేరీతిగా ప్రవర్తించారు. భగవానుడు పరమదయాళువు కాబట్టి మరొక ఉపాయాన్ని పన్నినాడు. క్రూరమృగాలను పట్టుకొనే వ్యక్తి మరొక మృగాన్ని ఎరగా చూపి వాటిని పంజరంలో పడేలాగా చేసుకొంటాడు కదా! అలాగే సర్వేశ్వరుడు తన పారిషదులలో కొందరిని ఈ జీవులతో సమానంగా లోకంలో అవతరింపజేస్తే, వారి ఉపదేశానుష్ఠానాలవల్ల జనులు జ్ఞానులవుతారని ఆశించి, క్రమంగా ఆళ్వారులనూ, ఆచార్యులనూ అవతరింపజేశాడు.

ప్రాచీనమైన విశిష్టాద్వైత సంప్రదాయాన్ని ఆళ్వారులు భగవద్భక్తి పరీవాహరూపాలైన తమ దివ్యప్రబంధాల ద్వారా ప్రపంచానికి వెల్లడించారు. తర్వాత 11వ శతాబ్దిలో శేషాంశ సంభూతులైన భగవద్రామానుజాచార్యులు బాగా చెదరిపోయిన వైదిక పద్ధతిని చక్కదిద్ది, శ్రీ భాష్యాది సంస్కృత గ్రంథాలద్వారా ఆ విశిష్టాద్వైత సిద్ధాంతాన్నే స్థిరీకరించి జగదుపకారులైనారు.

కొంత కాలానికి ఉభయవేదాంత సంప్రదాయ ప్రవిష్టులలోనూ ఆచార ధర్మాలను పాటించడంపట్ల ఔచిత్యానౌచిత్యాలను గమనింపలేనట్టి లోపాలు ఏర్పడినాయి. అందువల్ల జ్ఞానానుష్ఠానాల మూలంగానూ, ప్రబంధరచనల చేతనూ శ్రీభాష్యాన్ని బలపరుస్తూ, రామానుజ సిద్ధాంతానికి మంచి పూనికనిచ్చే మరొక అవతారం అత్యవసరమయింది. ఆ అవతార విశేషమే శ్రీ వేదాన్త దేశికులు.

శ్రీమద్రామానుజాచార్యులవారి అంతేవాసులలో సుప్రసిద్ధులైన శ్రీకూరేశులు, దాశరధి, ప్రణతార్తిహరాచార్యులు మొదలైన గొప్ప విద్వాంసులెందరో ఉండిరి. వీరిలో ప్రణతార్తి హరాచార్యులు సంస్కృతవేదాన్త శాస్త్రంలో ఉద్దండపండితులు. వీరికి 'కిడంబి ఆచ్చాన్' అని ప్రసిద్ధమైన పేరు. రామానుజుల వారే వీరికి 'వేదాంతోదయనుడు' అని బిరుదునిచ్చి శ్లాఘించారు.

శ్రీరంగనాథ దేవాలయంలోని అర్చకస్వాములకు రామానుజులవారు విధించిన పడికట్లను పాటించడం కష్టమనిపించింది. యత్యాశ్రమ నియమానుసారంగా రామానుజులవారు గృహస్థులైన స్వాముల యిండ్లకు ఎప్పటి వలె భిక్షకు పోగా, ఒక గృహస్థుడు అన్నంలో విషం కలిపి భిక్షను పెట్టాడు. అంతేవాసులు వన్నెమారిన భిక్షాన్నాన్ని నిషేధింపగా దాన్ని ఒక కుక్క తిని మరణించింది. అప్పటినుంచి రామానుజులవారు ఉపవాస దీక్షకు పూనుకొన్నారు. వీరిని పరామర్శించడానికి వీరి ఆచార్యులైన మహా పూర్ణులు వస్తుండగా రామానుజులవారు ఎదురేగి సాష్టాంగ ప్రణామం చేశారు. వీరు లెమ్మనలేదు. వారు లేవలేదు. కావేరిలో పట్టపగలు కాలుతున్న ఇసుకలో కమిలిపోతున్న సుకుమార శరీరాన్ని చూచి సహించలేక ప్రణతార్తి హరాచార్యులు రామానుజులవారిని ఆవేశంతో భుజాలపైన

ఎత్తుకొనిపోయి మఠంలో శైత్యోపచారం చేస్తుండగా, మహాపూర్ణులక్కడికి వచ్చారు.

'మీకు ప్రాణసమానులైన ఈ అంతరంగ శిష్యునితోనే మఠంలో వంటచేయించుకొని ప్రసాదాన్ని స్వీకరించు' మని మహాపూర్ణులు రామానుజుల వారిని ఆదేశించారు. ఈ ప్రణతార్తిహరాచార్యులే రామానుజమఠంలో ఆచార్యులవారికి మాహానసికులుగా నియమితులైనారు.

వేదాన్తోదయనా (ప్రణతార్తిహరా)చార్యుల పుత్రుడు రామానుజాచార్యులు. వీరి పుత్రుడు పద్మనాభనామాంతరులైన రంగరాజాచార్యులు. వీరికి 'ఆత్రేయ రామానుజాచార్యులు' అనే పుత్రుడు 'తోతార్ద్యంబ' అనే పుత్రిక కలిగారు. 'కిడాంబి అప్పుళ్ళార్' అనీ 'వాదిహంసాంబువాహులు' అనీ ప్రసిద్ధనామధేయులైన ఈ ఆత్రేయరామానుజులు, శ్రీ భాష్యానికి శ్రుతప్రకాశికావ్యాఖ్యానకర్తలైన శ్రీ సుదర్శన భట్టర్ (వీరిద్దరు) 'నడాదూర్ అమ్మాళ్' అనే సుప్రసిద్ధులూ, శ్రీభాష్యసింహాసనాధీశులూ అయిన 'వాత్స్యవరదాచార్యుల వారికి శిష్యులు. (దేశికుల వంశవృక్షమున్న పుట దర్శనీయమ్)

భగవద్రామానుజులవారు నియమించిన చతుస్సప్తతి (74) సింహాసనాధిపతులలో ఒకరైన 'శ్రీ అనంతసోమయాజి' కాంచీనగరం వద్ద 'తూప్పుల్' అనే అగ్రహారంలో దీపప్రకాశాఖ్య దేవాలయ సమీపంలో నివసించారు. వీరి పుత్రుడు 'పుండరీకాక్షసోమయాజి'. వీరి పుత్రుడైన 'అనంతసూరి'కి ఆత్రేయ రామానుజుల సోదరియైన 'తోతార్ద్యంబ' ధర్మపత్ని అయింది.

ఈ దంపతులు తిరుమలకు వెళ్ళి శ్రీ వేంకటేశ్వరస్వామికి అర్చనచేసి ప్రార్థించారు. నాటిరాత్రి తోతార్ద్యంబ గర్భమందు శ్రీ వేంకటేశ్వరస్వామి ఘంటప్రవేశించినట్లు దంపతులు కలగన్నారు. అనతి కాలంలో వీరికి సుపుత్రుడు ఆవిర్భవించాడు. అది విభవ నామ సంవత్సరం 1268 ఎ.డి. (పురటాశి) కన్యామాసం. ఆశ్వీజశుక్ల ఏకాదశి శ్రవణ నక్షత్రం. శ్రీవేంకటేశ్వరస్వామికి (బ్రహ్మోత్సవంలో) చక్రతీర్థోత్సవం జరుగుతున్న శుభదినం.

విశ్వామిత్రగోత్రానికి చెందిన మహానుభావుడు 'అనంతసూరి' శ్రీ వేంకటేశ్వరస్వామి జన్మనక్షత్రాన అవతరించిన ఆ శిశువుకు వేంకటనాథుడని నామకరణం చేశారు.

"ఉత్ప్రేక్ష్యతే బుధజనైరుపపత్తి భూమ్నా ఘంటాహరేస్సమజనిష్టయదాత్మనేతి" (సం.సూ) వీరిజీవితకాలంలో లోకులు వీరిని ఆ 'వేంకటేశుని ఘటావతారు'లని వ్యవహరించారన్న వీరిమాటచే స్పష్టీకృతం.

'అప్పుళ్ళార్' ఆ బాలునికి ఐదవయేట అక్షరాభ్యాసంచేసి, రామాయణ, భారత, భాగవతకథలను బోధించాడు. ఆ సంవత్సరమే కంచి వరదరాజు దేవాలయంలో శిష్యులకు శ్రీ భాష్యప్రవచనం చేస్తున్న శ్రీవాత్స్యవరదగురు సన్నిధికి తనభాగినేయుడైన బాలుణ్ని వెంట తీసుకొని వెళ్ళాడు. దివ్యతేజస్సంపన్నుడైన ఈ బాలుణ్ని చూచి, గోష్ఠిలో కాసేపు ప్రవచనం ఆపి, "ఆబాలుడెవరు?" అని ఆగురువు అప్పుళ్ళార్‌ను అడిగాడు. ఆయన 'తనమేనల్లు'డని చెప్పాడు. ఆగిపోయిన ప్రవచనం ఏంతవరకు పూర్తిఅయిందో అని ఆవరదగురువు ఆలోచించసాగాడు.

"ఆచార్యవర్యా, దాసుడు ఈ గోష్ఠిలో ప్రవేశించుసరికి "శాస్త్రయోనిత్వాత్" అనే వాక్యార్థాన్ని దేవరవారు ప్రవచిస్తున్నారు కదా!" అని సూచించిన ఆబాలుని జ్ఞాపకశక్తికి సదస్సులందరు ఆశ్చర్యపడినారట. వాత్స్యవరదాచార్యులు మహానుభావులు. వీరికి "నడాధూర్ అమ్మాళ్" అని ప్రసిద్ధ నామమేర్పడింది. 'అమ్మాళ్, అంటే మాతృమూర్తి అని అర్థం. స్త్రీలింగశబ్దం. వీరు ప్రతి దినం కాచిన పాలుతెచ్చి నోటితో ఊది చల్లార్చి వరదరాజ పెరుమాండ్లకు ఆరగింపు సమర్పించేవారు. 'నడాధూర్'

గ్రామానికి చెందిన వీరిని అవరద రాజస్వామి "నడాధూర్ అమ్మాళ్" అని ఆదరంతో పిలిచేవారట.

అట్టి వరదగురువు వేంకట నాథుణ్ని ఆపాదమస్తకం చూచి,

"ప్రతిష్ఠాపిత వేదాన్తః ప్రతిక్షిప్త బహిర్మతః భూయా స్త్రై విద్యమాన్యస్త్వం భూరికల్యాణభాజనమ్॥" (సం.సూ)

(నీవు ఇతరమతసిద్ధాన్తాలను ఖండించి, వేదాన్తశాస్త్ర సిద్ధాన్తాన్ని స్థిరంగాస్థాపించి వేదమూర్తులచే సమ్మానితుడవై, సకలశుభాలను పొందెదవుగాక) అని అనుగ్రహించారు.

తండ్రిగారుతనయునికి ఏడవయేట యథావిధి ఉపనయన సంస్కారం చేశారు. అప్పటినుంచి గురువూ, మేనమామగారూ అయిన ఆత్రేయరామానుజాచార్యులు వేంకటనాథునికి శ్రద్ధతో వేద, వేదాంగ, తర్కమీమాంసాదిశాస్త్రాలనూ, రామానుజ దర్శనాది సకలవిద్యలనూ బోధించారు.

శ్రీ వేంకటనాథశర్మ మంచివర్చస్వి, మేధావి, ఏకసంతగ్రాహి. కాబట్టి "వింశత్యబ్దే విశ్రుతనానావిద్యః" (సం.సూ) ఇరవదేండ్ల ప్రాయంవరకే సకల విద్యలను అభ్యసించాడు. ఆత్రేయరామానుజాచార్యులు ఈయన సదాచార నిష్ఠకు సంతోషించి, గరుడ మంత్రాన్ని ఉపదేశించారు. గుర్వాజ్ఞాప్రకారం, కంచి నుంచి తిరువ హీంద్రపురం వెళ్ళి, అక్కడ గరుడనదిలో స్నానంచేసి, ఔషధాద్రిపైన అశ్వత్థ వృక్షంక్రింద పద్మాసనుడై గరుడమంత్రోపాసన చేశాడు. గరుత్మంతుడు ప్రత్యక్షమైనాడు. వేంకటనాథశర్మ గరుడదండకంతో స్తుతించాడు. ప్రసన్నుడైన ఆ విష్ణురథుడు శ్రీహయగ్రీవ మంత్రాన్ని ఉపదేశించాడు. తదేక దీక్షతో ఉపాసన చేసిన వేంకటనాథశర్మకు లక్ష్మీహయవదనుడు సాక్షాత్కరించి తన లాలాజలాన్ని పానంచేయించాడు. ఆ దైవాను గ్రహంచేత సకల శాస్త్రాలు ఈయన జిహ్వాగ్రాన నర్తించాయి. ఆక్షణాన, ఆశువుగా శ్రీహయగ్రీవస్తోత్రం చేశాడు.

విద్యావ్రతస్నాతకానంతరం శ్రీ వేంకటనాథస్వామి 'తిరుమంగై' (కనకవల్లి) అనే కన్యకను ధర్మపత్నిగా స్వీకరించారు. గృహస్థాశ్రమ ధర్మాన్ని చక్కగా అనుష్ఠిస్తూ, వీరు నాలుగు ఆశ్రమాలలో ద్వితీయమైనా, గృహస్థాశ్రమమే అద్వితీయమైనదని నిరూపించిన మహాపురుషులు.

తమనాశ్రయించిన శిష్యబృందాలకు వేదాన్త శాస్త్రగ్రంథాలను ప్రవచిస్తుండేవారు. 'సంకల్ప సూర్యోదయ' నాటకాన్ని రచించే కాలం వరకు "త్రింశద్వారం శ్రావితశారీరక భాష్యః" అంటేముప్పది సార్లు శ్రీభాష్యప్రవచనం పూర్తి అయిందని వీరే విశదపరచారు.

అద్వైత పండితులు కొందరు శ్రీరంగంలో సంప్రదాయసిద్ధంగా జరిగే అధ్యయనోత్సవాన్ని జరుపకుండా మాన్పించారు. అక్కడి పండితులు వృద్ధులైనందువల్ల వారితో వాదించడానికి సాహసించలేదు. ఆలయ ధర్మాధికారి, అప్పటికి లబ్ధప్రతిష్ఠులైన శ్రీ వేంకటనాథ దేశికులకు ఆహ్వాన పత్రికను పంపినాడు. వార్తాహరుల వెంట దేశికులు శ్రీరంగం చేరినారు. సభలో చాలారోజులు వాదోపవాదాలు చెలరేగాయి. తుదకు ప్రత్యర్థులు పరాజితులై పాదాక్రాంతులైనారు.

శ్రీ వేంకటనాథ దేశికులు, అమితోత్సాహపరులైన ధర్మాధికారి, ఆచార్యపురుషులు, అర్చక స్వాములు మొదలైన భాగవతోత్తములతో కలిసి అధ్యయనోత్సవాన్ని వైభవంగా జరిపించారు. ఈ వాదాలసారాంశమే తర్వాత, 'శతదూషణి' అనే ప్రౌఢమైన వేదాంత వాదగ్రంథంగా దేశికులచే ఆవిష్కృతమయింది.

శ్రీ వేంకటనాథ దేశికులవారు కొంతకాలం అళగిర్‌కోవిల్, మధురై, శ్రీవిల్లిపుత్తూర్, ఆళ్వార్ తిరునగరి, వానమామలై,

త్రివేంద్రం, గోపపురం (తిరుక్కోవలూర్) ఇత్యాది దక్షిణ దివ్యదేశాలను సందర్శిస్తూ, దేహళీశస్తుతి మొదలైన స్తోత్రాలను రచించారు. క్రమంగా ఉత్తర భారతదేశంలోనూ 'మథుర, బృందావనం, ద్వారక, అయోధ్య, గయా, ప్రయాగ, హరిద్వార్, బదరీత్యాది' దివ్యతీర్థక్షేత్రాలను సందర్శించి, యాదవాభ్యుదయం, హంససందేశకావ్యాలను నిర్మించారు. తిరుమలకు వేంచేసి శ్రీనివాసుని సేవించి, 'దయాశతకం' రచించారు. శ్రీపెరుంబూదూరులో భగవద్రామానుజమూర్తిని సందర్శించి యతిరాజ సప్తతిని, కంచిలో వెలసియున్న భగవన్మూర్తుల విషయంగా వదరాజ పంచాశత్, వేగాసేతు స్తోత్రాదులను రచించారు. శ్రీరంగంలో వేంచేసియున్నప్పుడు శ్రీస్తుతి, భూస్తుతి, దశావతారస్తోత్రం, భగవద్ధ్యానసోపానం, శ్రీరంగనాథపాదుకాసహస్రమ్ మొదలైన స్తోత్రకావ్యాలనేకాక మీమాంసాపాదుకా, సేశ్వరమీమాంస, న్యాయ పరిశుద్ధి, న్యాయ సిద్ధాంజనమ్, ఇత్యాదిశాస్త్రగ్రంథాలనూ రచించారు. అమృతరంజని, అమృతాస్వాదిని, పరమపదసోపానమ్, మొదలైన ద్రావిడ ప్రబంధాలనూ నిర్మించారు. భగవద్రామానుజసిద్ధాంతమని ప్రసిద్ధి చెందిన ప్రాచీన విశిష్టాద్వైత సిద్ధాంతాన్నే తమ 'ప్రాకృత, సంస్కృత, ద్రవిడ' ప్రబంధాలలో అద్భుతంగా ప్రతిపాదించారు.

విద్వత్పరిషత్తు దేశికులను 'కవితార్కికసింహ', అనే బిరుదునిచ్చి ప్రశంసించింది. అధీతి బోధాచరణ ప్రచారణల ద్వారా వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులైనారని శ్రీరంగనాథుడు **'వేదాంతాచార్యులు'** అనే బిరుదును, శ్రీరంగనాయకి **'సర్వతంత్ర స్వతంత్రులు'** అనే బిరుదును వీరికి అనుగ్రహించారు.

శ్రీభాష్యసారార్థమైన ఐదువందల స్రగ్ధరావృత్తాలతో కూడిన 'అధికరణసారావళి' అనేగ్రంథారంభంలో "విశ్వస్మిన్నామ రూపాణ్యను విహితవతా తేనదేవేన దత్తామ్! వేదాన్తాచార్య సంజ్ఞామవహిత బహువిత్ సార్థ మన్వర్థయామి॥" (ఈ రచనలో పెరియ పెరుమాండ్లు ప్రసాదించిన బిరుదును అన్వర్థీకరించుకొంటున్నాను) అని దేశికులు ప్రకటించుకొన్నారు. ఈ ప్రబంధానికి తాత్పర్య వివరణ రూపమైన "అధికరణ దర్పణ" మనేగ్రంథాన్నీ వీరే రచించారు.

కంచిలోనే జ్ఞాన వైరాగ్యభూషణులై ఉంఛవృత్తితో కాలక్షేపంచేస్తున్నప్పుడు, వేదాన్తదేశికులకు 48 వ యేట, శ్రీవరదరాజ స్వామి కృపవల్ల 'కనకవల్లి తాయార్' కు పుత్రుడు ఉదయించాడు. ఆదినళనామ సంవత్సరం, ఆవణిమాసం, రోహిణీ నక్షత్రం తేది: 11ఆగష్టు 1316 ఎ.డి. దేశికస్వామి తన పుత్రునికి 'వరదాచార్యులు' అని నామకరణం చేశారు. వరదాచార్యులు తండ్రిగారి వద్దనే విద్యనభ్యసించి సకలశాస్త్ర పారంగతుడైనాడు.

"పిత్రేబ్రహ్మోపదేష్ట్రే మే గురవే దైవతాయచ।

ప్రాప్యాయప్రాపకాయాస్తు వేంకటేశాయమంగళమ్॥" (దేశికమంగళా శాసనమ్)

'జనకుడు, బ్రహ్మోపదేష్ట, గురువు, దైవం, ప్రాప్య, ప్రాపకులు కూడా తమతండ్రిగారే, అని (కమారవేదాన్తాచార్యులు) శ్రీవరద నాథనయినారాచార్యులు" శ్రీవేదాన్తదేశిక మంగళాశాసనం" లో అనుసంధించారు.

ఆచార్యులను ఆశ్రయించి ఉజ్జీవించాలనుకొని "సర్వజ్ఞసింగప్ప" శ్రీ వేదాన్త దేశికులవారిని తన నగరమైన "వేంకటగిరి" కి వేంచేయవలసినదిగా ప్రార్థించాడు. కాని దేశికులు మాత్రం ఆపరమాస్తికుని నగరానికి వెళ్ళలేదు. కృపాప్రసన్నులైన ఆచార్యులు కాబట్టి, 'సుభాషితనీవి' అనే నీతికావ్యాన్ని, తత్త్వసందేశం, రహస్యసందేశం, రహస్యసందేశ వివరణం' అనే మరోమూడుగ్రంథాలను మణిప్రవాళ శైలిలో వ్రాసి ఒక శిష్యునితో పంపి సర్వజ్ఞసింగప్పకు అందజేశారు.

క్రీ.శ. 1327 వ ప్రాంతంలో మహమ్మదీయుల దండయాత్ర దక్షిణ భారతదేశానికి కూడా విస్తరించింది. 'ఢిల్లీసుల్తాన్'

సేనానియైన 'మాలికాఫర్' శ్రీరంగం, మధురపై దాడి చేశారు. ఆ సమయాన ఆచార్య పురుషులు సమావేశమై శ్రీరంగ మందిర సంరక్షణకోసం మూడు వర్గాలుగా ఏర్పడ్డారు. వృద్ధులైన శ్రీపిళ్ళై లోకాచార్యులవారు శ్రీరంగనాథుని ఉత్సవ మూర్తులను పల్లకిలో వేంచేపించి రహస్యంగా కావేరిదాటి దక్షిణ దిశకు పయనించారు.

విశిష్టాద్వైత సిద్ధాన్త సర్వస్వమైన "శ్రుతప్రకాశికా" (శ్రీ భాష్యాన్ని చక్కగా విని వ్యాఖ్యానించిన, గ్రంథ) కర్తయైన శ్రీ సుదర్శన భట్టర్ మందిర సంరక్షణకు పాటుపడదలచారు. వారు 'శ్రుతప్రకాశిక'నూ, తన ఇద్దరు పుత్రులనూ భద్రంగా కాపాడుమని అప్పగించినందువల్ల, దేశికులు వారిని వెంటపెట్టుకొని, వాయవ్యదిశకు పయనించారు.

మందిర ద్వారాలను పెద్దబండరాళ్ళతో ఆచ్ఛాదించి ప్రాకారరక్షణ కోసం పాటుపడుతున్న శ్రీసుదర్శన సూరి మహమ్మదీయుల పాశవికశక్తికి బలియైనారు.

దేశిక స్వామి దారిలో బాలురనిద్దరిని రాత్రిపూట పడుకోపెట్టి, వారిపై ఆకులు, కొమ్మలు కప్పి, కొంతదూరాన వ్యాఖ్యాన సహిత శ్రీ భాష్యగ్రంథాన్ని క్రిందపెట్టి, దానిపై తానూ, శవాలనడుమ పడుకొన్నాడట.

"శ్రీరంగేనగరే ధరాజకహతే నష్టేషు సైద్ధాంతిక
గ్రంథేష్వేష్వఖిలేషు ఘోరమయితే శ్రీ వైష్ణవానాం హతే।
ఆచ్ఛాద్యస్వతనుం శవైశ్చ తదధః సంస్థాప్యతత్పుస్తకం
వేదాన్తా ర్యగురూ రరక్షచ పునస్సంచారయామాసతత్॥"

ఆఘోర విపత్తులో, ఆపద్ధర్మంగా ప్రాణాలనూ, విశిష్టా ద్వైతసిద్ధాన్తగ్రంథాన్నీ రక్షించి తర్వాత ప్రచారంచేశారని సుశ్లోకితం.

ప్రభాతకాలాన లేచి గ్రంథాన్నీ, బాలురనూ తీసుకొని కొన్ని దినాలు ప్రయాణంచేసి, కర్ణాటకరాష్ట్రంలోని 'సత్యకాలం' (ఇప్పుడు సత్యమంగళం) అనే గ్రామానికి చేరుకొన్నారు దేశికులు. ఆ గ్రామంలో చిరకాలంనివసించారు. బాలురకు యథావిధి ఉపనయనం చేశారు. విద్యనూ బోధించారు. అక్కడనే దేశికుల పుత్రుడునూ, శ్రీబ్రహ్మతంత్ర స్వతంత్ర స్వాములూ (మైసూరు పరకాలమత యతిగురువులు) దేశికులవారి సన్నిధిలో శాస్త్రాధ్యయనం చేశారు. తురుష్కులదాడి అంతరించి, దేశంలో శాంతి రాజ్యముదయించదానికి, శ్రీరంగనాథుడు యథాస్థానంలో నెలకొనదానికి దేశికులు నిరంతరం ప్రార్థించారు. ఆ విధంగా సాగినదే 'అభీతిస్తవం'. (సత్యకాలంలోనే 'నిలబడినట్లున్న దేశికుల విగ్రహం'ఉంది.)

అక్కడినుంచి తిరునారాయణపురం (మేల్కోటె) చేరి, శెల్వప్పిళ్ళై పెరుమాళ్ళను సేవించారు. శ్రీరామానుజసిద్ధాన్త నిర్ధారణ సార్వభౌములుగా వాసిగాంచారు. ఆత్రేయరామానుజ దయాపాత్రులు కాబట్టి వీరిని బ్రహ్మతంత్ర స్వతంత్రస్వాముల వారు ఆశ్రయించి

"రామానుజ దయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణమ్।
శ్రీ మద్వేంకట నాథార్యం వందే వేదాన్త దేశికమ్॥" అనే తనిశ్లోకాన్ని వ్రాసి సమర్పించారు.

కాంచీ నగర శిక్షాకేంద్రంలో దేశికులకు సహపాఠియైన శ్రీవిద్యారణ్య స్వామివారు యవనులను పరమార్చి, విజయనగర రాజ్యస్థాపకుడైనాడన్న వార్తను విన్నారు. ఆ సమయాననే తన ప్రార్థన సఫలమైనట్లూ, జింజికోట దళనాయకుడైన గోపనార్యుడు తురుష్క ముష్కరులను తరిమివేసి, ఆనాటికి తిరుమలలో పూజింపబడుతున్న శ్రీరంగనాథుని ఉత్సవమూర్తులను

అతివైభవంగా శ్రీరంగక్షేత్రానికి తీసుకొని వచ్చాదన్న వార్తనూ దేశికులు విన్నారు. వెంటనే శ్రీరంగం చేరుకొన్న వేదాన్త దేశికులవారి సమక్షాన శ్రీరంగనాథుడు పునఃప్రతిష్ఠితుడైనాడు.

గోపనార్యుని భక్తిని ప్రశంసిస్తూ దేశికులు ఆశువుగా చెప్పిన రెండు శ్లోకాలు దేవాలయాంతర్భాగాన తూర్పుగోడపైన చెక్కబడి, నేటికీ కనబడుతున్నవి.

అప్పటినుంచి శ్రీరంగంలోనే స్థిరంగా ఉన్నారు. శిలావృత్తిచే జీవిస్తున్నారు. భగవత్కైంకర్య ధురంధరులై అనేక గ్రంథాలను రచిస్తున్నారు.

ఆ సందర్భంలో శ్రీవిద్యారణ్యస్వామివారు దేశికులనుసన్మానింప దలచి, విద్యానగర చక్రవర్తికి ఆచార్యుల మహిమను వినిపించారు. రాజభటుల ద్వారా దేశికులకు ఆహ్వాన పత్రాన్ని పంపించారు. విద్యారణ్యుల అభిప్రాయాన్ని దేశికులు గమనించారు.

(ఉంఛవృత్తిచే జఠరాగ్నినిశమింప జేయశక్యంకాదా? ఉదరంలో అగ్నిమండిన మందుగాక! మల్లెపూలపరిమళాన్ని వెదజల్లేమాటలతో క్షుద్రమహీపతులను గడ్డిపరకనైనా యాచించను. పిత్రార్జితమూ లేదు. నేనార్జించిన ధనమూలేదు. (పైతామహం) చతుర్ముఖబ్రహ్మను కన్నతండ్రి - కంచి వరదరాజు పెరుమాండ్లే నాకుధనం. ధనంజయస్యందన భూషణమే ధనం- ఈతాత్పర్యమున్న) "సిలంకి మనలం భవేదనల మౌదరం బాధితుం" అనే శ్లోకాలను "వైరాగ్యపంచకం" వ్రాసి దేశికులు ఆభటులతోనే పంపించారు.

ఆచార్యుల విశుద్ధ వైరాగ్యానికి విద్యారణ్యస్వామివారాశ్చర్యపడి,
"విద్యారణ్యో వివిధం వేంకటసూరేర్విశోధ్య వైరాగ్యమ్।
యం విష్ణోరవతారం మేనే, సేవే తమాగమాంతగురుమ్"॥
నిగమాంతగురువులు సాక్షాత్తుగా విష్ణ్వవతారులే అని గుర్తించి ప్రశంసించారు.
సామాన్య జీవితం గడిపిన నిగమాన్త దేశికులు **అద్భుత మహిమ** కలవారు.

దేశికులు 'కంచి'లో ఉన్నప్పుడు ఒకతాంత్రికుడు తనతోవాదించడానికి ఆహ్వానించాడు. వాదనలో ఓడించి అతని మనస్సును నొప్పించలేక స్వామి అంగీకరించలేదు. అతడుచెరువులోని నీటిని త్రాగడం ఆరంభించాడు. స్వగృహంలోనే ఉన్న దేశికుల కడుపు ఉబ్బడం మొదలయింది. ఇది తాంత్రికుని కృత్యమే అని గమనించిన స్వామి తనప్రక్కనే ఉన్న గోడను గోళ్ళతో గీకాడు. దానివెంట నీళ్ళు కారుతూ వీధిలోకి ప్రవహించాయి. చెరువులో నీళ్ళు తగ్గుతున్నా, తాంత్రికుని కుట్ర ఫలించలేదు. వెంటనే అతడు వచ్చి దేశికుల పాదాల మీద సాష్టాంగపడి, క్షమించుమని ప్రార్థించాడు. నీవు చాలామంచి పనిచేశావయ్యా! నీవల్లనే కదా వాననీరు లేకున్నా నగర వీధులన్నీ శోధింపబడ్డాయి. ఇక ముందు ఎవరినీ నీకంటే తక్కువ వారని తలచక, చక్కగా జీవించుమని దేశికులు ఆదేశించారు.

ఒకనాటి తొలిప్రొద్దున దేశికులు స్నానంచేసి, సూర్యోపస్థానంచేస్తుండగా, ఒక వ్యాళగ్రాహి ఒక విషసర్పాన్ని విడిచాడు. ఆ భుజంగం బుస్సుమంటూ తనను కాటువేయడానికి వచ్చి పడగను ఎత్తేలోపల, ఆచార్యులు తనచుట్టు నేలమీద ఒక వృత్తరేఖను గీసాడు. పన్నగం ఆగీతను దాటి రాలేక దానిచుట్టూ తిరుగుతుండింది. ఆచార్యులు గరుడదండకం లోని మూడవపాదం పఠించేసరికి పక్షిరాజు తుర్రున వచ్చి ఆపామును గిర్రున ఎత్తుకొని పోయాడు. పక్షిపాదాల్లో చిక్కుకొని విలవిలలాడే విషధరాన్ని చూచిన అహితుండికుడు ఆచార్యుల పాదాల మీదపడి, తన అపచారాన్ని క్షమించుమని ఏడ్చాడు. దేశికులు ఆకాశం వైపు చూచాడు. ఆ పక్షి పామును జారవిడిచి పోయింది. నేలమీద పడి గిలగిలలాడే ఆపామును అతడు

పట్టి బుట్టలో పెట్టుకొని పారిపోయాడు.

తిరువహీంద్రపురంలో బ్రహ్మోత్సవం జరుగుతున్నప్పుడు దేశికులు తైర్థికునిగా అక్కడికి వేంచేశారు. నాటిరాత్రి ఎప్పుడూ తన వెంట ఉండే శ్రీహయగ్రీవమూర్తికి తిరువారాధనను సమర్పించారు. కాని తన దగ్గర ఏమీ లేనందువల్ల నైవేద్యం పెట్టక విచారంతో ఉన్న ఆరాత్రి నాల్గవ జామున, ఒక రైతువచ్చి దేశికులతో మొరపెట్టుకొన్నాడు. "స్వామీ! అర్థరాత్రి ఒక తెల్లని గుర్రం వచ్చి నా పంటచేను మేసి, తిరిగి మీరున్నచోటుకే వచ్చింది. ఇదేమిన్యాయమండి"? అంటూ ఇంక ఏదో అనబోయాడు. కాని, అంతలోనే దేశికస్వామి చిన్నగా నవ్వుతూ, "ఓరైతన్నా! దేవుడు నిన్నూ, నన్నూ అనుగ్రహించాడు. బాధపడకు. పంటబాగా పండుతుంది పో"అన్నాడు. ప్రొద్దున్నే ఆరైతు తన పొలానికి గబగబా పోయాడు. పిల్లతెమ్మెరల ప్రేరణచే స్వేచ్ఛగా నర్తిస్తున్న ఆ పస్పుపచ్చని పైరులచ్చి, వెన్నుల బరువుతో తలవంచి తనకు స్వాగతం చెబుతుంటే "ఆహా! స్వామి మహిమ ఎంతగొప్పది!!" అనుకొంటున్న ఆ రైతు డెందం ఆనందంతో చిందులాడింది.

ఒకనాడొక యువకుడైన బ్రహ్మచారి దేశికుల సన్నిధికి వచ్చి "పెండ్లి చేసుకొంటాను. ధనసహాయంచేయండి స్వామీ!" అని యాచించాడట. పెండ్లి కోసం పెంపర్లాడే ఆబ్రహ్మచారి దైన్యానికి దేశికుల ఒడలంతా జలధరించింది. వెంటనే ఆశువుగా "శ్రీస్తుతి" చేసి, ఆబ్రహ్మచారికి బోధించాడు, అతడు శ్రీమహాలక్ష్మి పాదాలనెదలో నిల్పుకొని 'శ్రీస్తుతి'ని పఠించగా కోరుకొన్న ధనం కుప్పలు కుప్పలుగా కురిసిందట.

జ్ఞానలక్ష్మి, వైరాగ్యసంపద, వాగ్వైభవం ఎంత ఉన్నా, వినయసంపద మాత్రం లేకపోతే ఏదీరాణించదు. కలికాలప్రభావం వల్ల అసూయగల కొందరు వైష్ణవులు దేశికులను అవమానించడానికి రాత్రిపూట వీరి గృహద్వారానికి తోరణం గా చెప్పులదండలను కట్టారు. ఉదయాన ఆచార్యులు ద్వారాన్ని తెరచుకొని వెలుపలికి వస్తుంటే ఆ దండలు వీరితలకు తగిలాయి. చాటుగా ఉండిచూచిన ధూర్తులు చప్పట్లుకొట్టారు. ఆ సవ్వడి విన్న దేశికులు కడువినయంతో "కొందరు కర్మావలంబకులైతే మరికొందరు జ్ఞానావలంబకులు కదా! మేము మాత్రం హరి దాసుల పాదరక్షావలంబకులం" (కర్మావలంబకాఃకేచిత్, కేచిత్ జ్ఞానావలంబకాః! వయంతుహరిదాసానాం పాదరక్షావలంబకాః॥) అనే శ్లోకాన్ని ఆశువుగా విన్నవించారట. ఖఅర్వగర్విష్ఠులైన వారందరు నేలగీతలు గీశారట.

ఒకనాటి సాయంసమయాన శ్రీరంగనాథుని సన్నిధిలో ఏర్పడిన విద్వత్పరిషత్తులో ఒక విద్వత్కవి 'శ్రీరంగనాథపదకమల సహస్రమ్' రచించడానికి ప్రతిజ్ఞచేయగా, దేశికులు 'పాదుకాసహస్ర' రచనకు ప్రతిజ్ఞచేశారు. అదేరాత్రి దేశికులు 1008 (వేయి ఎనిమిది) శ్లోకాలను రచించి, ఉదయాన పరిషత్తులో ఆగ్రంథాన్ని చదివి శ్రోతలనానందపరచారు. 'పదకమలసహస్ర' రచనకు ప్రతిజ్ఞ చేసిన ప్రత్యర్థి 300 (మూడువందల) శ్లోకాలను మాత్రమే రచించగలిగాడని అభియుక్తోక్తి.

శ్రీమద్వేదాన్త దేశికుల కవితా ప్రతిభకు శ్రీరంగనాథపాదుకా సహస్రమ్' విజయధ్వజ వైజయన్తీ పతాకంలాంటిదని పండితులెందరో ప్రశంసించారు.

"వితస్తి మాత్రేదారుఖండే సహస్రం వివరాణి రచితవాన్ వేంకటనాథ గురురేవకవిః, అన్యేతుకపయఏవ". జిట్టెడున్న కట్టెముక్క మీద వేయిఛిద్రాలను కల్పించిన వేంకటనాథగురువే కవి. ఇతరులు మాత్రం కపులే, అని ఉద్దండ పండితులైన అప్పయ దీక్షితులు కొండాడారు.

భగవద్రామానుజుల తర్వాత అవతరించిన శ్రీవైష్ణవ సిద్ధాన్త ప్రవర్తకులైన ఆచార్యులలో జ్ఞానానుష్ఠాలచేతనూ, వైరాగ్యసంపత్తి చేతనూ, వాగ్వైశర్యం చేతనూ మళ్ళీ రామానుజులవంటి ప్రాధాన్యాన్ని ఆక్రమించిన వారు, సర్వతంత్ర స్వతంత్ర, కవితార్కిక కేసరీ, వేదాన్తా చార్యాది బిరుదులతో భూషితులైన శ్రీవేంకటనాథాచార్యులొక్కరే అనడం పండిత ప్రముఖులు అంగీకరించిన విషయమే. వీరు శతాధిక గ్రంథకర్తలుగా ప్రసిద్ధులు.

# దేశికుల రచనలు:

కావ్యాలు:-

1. యాదవాభ్యుధయం
2. హంససందేశం
3. సుభాషితనీవి
4. సమయసాహస్రి
5. సంకల్పసూర్యోదయం (నాటకం)
6. అచ్యుతశతకం (ప్రాకృతభాషామయం)
7. అపర్యాప్తామృతస్తుతి
8. అభీతిస్తవం
9. అష్టభుజాష్టకం
10. కామాసికాష్టకం
11. గరుడదండకం
12. గరుడ పంచాశత్
13. గోపాలవింశతి
14. దయాసహస్రమ్
15. దయాశతకమ్
16. దశావతారస్తోత్రం
17. దివ్యదేవమంగళాశాసన పంచకం
18. దేహళీస్తుతి.
19. న్యాసతిలకం
20. న్యాసదశకం
21. న్యాసవింశతి, తద్వ్యాఖ్య
22. పరమార్థస్తుతి
23. భగవద్ధ్యాన సోపానం
24. భూస్తుతి
25. యతిరాజ సప్తతి
26. రఘువీర గద్య
27. వేగా సేతుస్తోత్రం
28. వైరాగ్యపంచకం
29. శరణాగతి దీపిక
30. శ్రీగోదాస్తుతి.
31. శ్రీ దేవనాయక పంచాశత్
32. శ్రీరంగనాథ పాదుకాసహస్రమ్
33. శ్రీ వరదరాజ పంచాశత్
34. శ్రీస్తుతి
35. షోడశాయుధ స్తోత్రమ్
36. సుదర్శనాష్టకం
37. శ్రీ హయగ్రీవస్తోత్రమ్
38. యజ్ఞోపవీత ప్రతిష్ఠావిధి
39. భగవదారాధన విధి
40. హరిదిన తిలకమ్
41. శిల్పార్థ సారః (శిల్పశాస్త్రం)
42. రసభౌమామృతం (వైద్యశాస్త్రం)
43. వృక్ష భౌమామృతం ( ”)
44. భూగోళ నిర్ణయమ్

వేదాంత గ్రంథాలు :-

45. ద్రవిడోపనిషత్తాత్పర్యరత్నావళిః
46. ద్రవిడోపనిషత్సారః

47. మీమాంసా పాదుకా
48. సేశ్వరమీమాంసా
49. శతదూషణీ
50. అధికరణసారావళిః
51. తత్త్వటీకా
52. న్యాయపరిశుద్ధిః
53. న్యాయసిద్ధాంజనమ్
54. తత్త్వముక్తాకలాపః
(తద్వ్యాఖ్యా-సర్వార్థసిద్ధిః)
55. గీతాభాష్యతాత్పర్యచంద్రికా
56. గీతార్థసంగ్రహః
57. శ్రీపాంచరాత్రరక్షా
58. సచ్చరిత్రరక్షా
59. నిక్షేపరక్షా
60. చతుశ్శ్లోకీభాష్యమ్
61. స్తోత్రరత్న భాష్యమ్
62. గద్యత్రయభాష్యమ్
63. ఈశావాస్యోపనిషద్భాష్యమ్
64. అధికారదర్పణమ్

రహస్యగ్రంథాలు:-

65. సంప్రదాయ పరిశుద్ధిః
66. తత్త్వపదవీ
67. రహస్యపదవీ
68. తత్త్వ నవనీతమ్
69. రహస్యనవనీతమ్
70. తత్త్వమాతృకా
71. రహస్యమాతృకా
72. తత్త్వసందేశః
73. రహస్య సందేశః
74. రహస్యసందేశవివరణమ్
75. తత్త్వరత్నావళిః
76. తత్త్వరత్నావళీప్రతిపాద్యసంగ్రహః
77. రహస్యరత్నావళిః
78. రహస్యరత్నావళీ హృదయమ్
79. తత్త్వత్రయ చుళకమ్
80. రహస్యత్రయచుళకమ్
81. రహస్యశిఖామణిః
82. అభయప్రధానసారః
83. అంజలి వైభవమ్
84. ప్రధానశతకమ్
85. ఉపకారసంగ్రహః
86. సారసంగ్రహః
87. చకారసమర్థనమ్
88. మునివాహన భోగః
89. మధురకవి హృదయమ్
90. శ్రీమద్రహస్యత్రయసారః
91. సారసారః
92. విరోధపరిహారః

ద్రావిడప్రబంధాలు:-

93. అమృతరంజనీ
94. అధికారసంగ్రహః
95. అమృతాస్వాదినీ
100. అర్థపంచకమ్
101. శ్రీ వైష్ణవదినచర్యా
102. తిరుచ్చిన్నమాలై
103. పన్నిరునామమ్
104. తిరుమంత్రచ్చురుక్కు
105. ద్వయచ్చురుక్కు

106. చరమశ్లోకచ్చురుక్కు
107. ముమ్మణిక్కోవై
108. నవమణిమాలై
109. ప్రబంధసారః
110. ఆహారనియమః
111. నిగమపరిమళః
112. పందు
113. కళల్
114. అమ్మానై
115. ఊశల్
116. ఏశల్.

లుప్తమైన గ్రంథాలు ఎన్ని ఉండినవో కదా! వీరి గ్రంథాలన్నిట్లో భగవద్రామానుజ సిద్ధాంతమే ప్రతిపాదింపబడింది.

విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని బలపరచినవారు కాబట్టి, దేశికులవారిని, "రామానుజ సిద్ధాన్త నిర్ధారణ సార్వభౌములు" అని ప్రపన్నులు కీర్తిస్తుంటారు.

"నిగమాంతగురుప్రోక్తం గ్రంథం కంచిత్ పఠంతియే
విమతస్థాన్ సమస్తాంశ్చ తేజయంతి న సంశయః॥"

వేదాంతాచార్యులు రచించిన ఏదో ఒక గ్రంథాన్ని ఎవరుచదువుతారో, వారు ఇతరులు అవలంబిచిన ఆచారసంప్రదాయాలలోని గుణదోషాలను విమర్శించి, వారికి స్వసంప్రదాయంలోని వైశిష్ట్యాన్ని బోధించి, పాటింపజేయగల సమర్థులై రాణిస్తారని శ్లోకతాత్పర్యం.

"వేదాన్తాచార్యరచిత ప్రబంధా స్సారదర్శినః।
పర్యాప్త మావయోఃశ్రోత్రోః కింవాగ్రంథాంతరాయుతైః॥"

వేదాన్తాచార్యులు అనేకగ్రంథాలనురచించారు. వాటిలోని ముఖ్యమైన విషయాలను శ్రద్ధతో పరిశీలించిన వారూ, విన్నవారూ పూర్ణజ్ఞానసంపన్నులవుతారు. వేలకొలది వేరేగ్రంథాలతో ప్రయోజనమేమి? అని తామనుభవించి తెలుసుకొన్న వారు చెప్పిన వాక్కులు.

"వేరే సంజాతభేదే మునిజన వచనే ప్రాప్తనిత్యావమానే। సంకీర్ణే సర్వవర్ణే సతి తదనుగుణే నిష్ప్రమాణే పురాణే!
మాయావాదే సమోదే కలికలుషవశాచ్ఛూన్యవాదే వివాదే, ధర్మత్రాణాయ యోఽభూత్ సజయతు భగవాన్ విష్ణుఘంటావతారః॥"

"కలికాలప్రభావం వల్ల వేదాలకు అపార్థాలను కల్పించడమూ, పెద్దల మాటలను పాటించకపోవడమూ, సకలవర్ణాలు, సంకీర్ణమ వడమూ, శూన్యవాదం మాయావాదం ప్రబలిపోయి, ప్రజలకు తమ సంప్రదాయ స్వరూపమేదోతెలియక, సంఘవిచ్ఛిత్తికి దారితీస్తున్న సమయాన వైదిక ధర్మరక్షణకోసం శ్రీవెంకటేశ్వర స్వామి ఘంటయే శ్రీవేంకటనాథాచార్యులుగా అవతరించడమయింది. ఆ ఆచార్యులకు జయమగుగాక" అని డిండిమకవి (14 వ శతాబ్ది) వయసులో చిన్నవాడైనా, సమకాలీనుడైనందువల్ల దేశికుల ప్రభావాన్ని ప్రశంసించాడు.

దేశికులు రచించిన, 'యాదవాభ్యుదయ' మహాకావ్యానికి అప్పయదీక్షితులు వ్యాఖ్యానంవ్రాశారు. అందుప్రస్తావనగా దీక్షితులు, దేశికుల రచనలు లలితపదాలు కలవై పరమార్థంతో కూడియున్నవి, అన్నారు.

"ఇత్థం విచింత్యా స్సర్వత్రభావాస్సంతి పదే పదే।

కవితార్కిక సింహస్యకావ్యేషు లలితేష్వపి॥"

వాస్తవంగా కవితార్కిక కేసరి రచనలు మొదటిసారి చదివినప్పుడు అవి నారికేళపాకమనిపిస్తాయి. వాటిని రెండవసారి చదివితే, అవి సులభగ్రాహ్యమై ద్రాక్షాపాకం కలవే అనగలుగుతారు పాఠకులు.

ప్రతివాదిభయంకరం అణ్ణన్ (1300-1400 ఎ.డి) దేశికుల నాశ్రయించి బాల్యంలోనే సకలశాస్త్ర ప్రవీణులైన ప్రతిభాశాలురు. ఒక గొప్ప అద్వైత వేదాంత సిద్ధాంతికాంచీపురానికి వచ్చి వాదానికి ఆహ్వానించాడట. వాదంలో ఒకరి మనస్సును నొప్పించడానికి ఇష్టపడనిదేశికుల వద్ద "గురువర్యా! వాదించడానికి నేను పోతాను" అని ఉత్సాహంతో పలికిన ఆ బాలుడు, అనుమతిని పొంది ఆ సిద్ధాంతితో వాదించాడట. ("యేనాసీత్ సహసాసముద్రితముఖోవాదీ గతాహంకృతిః") ఓడిపోయిన ఆసిద్ధాంతి విశిష్టాద్వైత మతాన్ని స్వీకరించి, సంతోషంతో ఆ బాలునికి తన ఉపాస్యదైవమైన సువర్ణ నృసింహ విగ్రహాన్ని సమర్పించాడట. వేదాంతోదయన సంప్రదాయ ప్రవర్తకులైన దేశికులు, ఆ విధంగా జయించి వచ్చిన బాలుణ్ణి ఆలింగనం చేసి హర్షపులకితాంగులై 'ప్రతివాది భయంకరం అణ్ణనే' ( (ప్రతి పక్షులకు భయంకరమైన నాతండ్రీ) అని పేర్కొన్నారట. ఆ బాలుడు ఈ బిరుదు నామంతోనే వ్యవహరింపబడుతూ ప్రసిద్ధి పొందాడట.

ఆ 'ప్రతి వాది భయంకరం అణ్ణన్' స్వామివారు చతుర్విధ పురుషార్థాలలో తురీయ పురుషార్థమైన మోక్షసామ్రాజ్యాన్ని పొందగోరే వారు దేశికుల పట్ల అత్యంత భక్తి కలిగి ఉండాలి

"గురౌ వాది హంసాంబుదాచార్య శిష్యే, జనా భక్తిహీనా యతీంద్రా ప్రియాఃస్యుః!
యతీంద్రా ప్రియా విష్ణుకారుణ్యదూరాః కుతోముక్తివార్తాహితాదృగ్విధానామ్" ॥

అని ప్రతిపాదించారు. అంతేకాదు, దేశికుల విషయమై వారు "సప్తతిరత్నమాలికా" స్తోత్రం కూడా రచించారు.

"వీతరాగా విశిష్టార్థా వేదాన్తా చార్య సప్తతిః వైష్ణవైః సాదరంగ్రాహ్యా విద్వద్భిర్వీతమత్సరైః॥

"ప్రతివాదిభయంకరేణ సాసుధియా సప్తతిరత్నమాలికా। నిగమాంతగురౌ సమర్పితా హృదయేతం భజతాస్వయాధియా॥"

శ్రీ బ్రహ్మతంత్రస్వతంత్ర (పరకాలమఠం) స్వామివారు దేశికులవారిని ఆశ్రయించి,

"బ్రహ్మతంత్ర చతురాయయోగినే సర్వతంత్ర చతురో గురూత్తమః।

వేద మౌళి యుగళం హ్యుపాదిశత్, వాదిసింహమనఘం తమాశ్రయే॥"

అనే శ్లోకం చేత 'ఉభయవేదాంతోపదేశం' పొందినట్లు విశదమవుతున్నది. ఈ బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామివారు దివ్యప్రబంధాను సంధానారంభంలో పఠింపదగిన "రామానుజదయాపాత్రం" అనే శ్లోకాన్నే కాక, మరొక శ్లోకాన్ని కూడా నిర్మించారు.

"నమఃపదమిదం భూయాత్ తస్మై వేంకట సూరయే! యద్వాగమృత సేకేన సంజీవిత మిదం జగత్॥"

"ఎవరి వాగమృతసేచనం చేత ఈ లోకం జీవించిందో, అట్టి శ్రీవేంకట సూరి కొరకు ఈ (నా) నమస్కృతి" అని శ్లోకార్థం.

షోళంగిపురం శ్రీకందాళ దొడ్డయాచార్యులకు ఒకప్పుడు అప్పయ దీక్షితులతో వాదం సంభవించిందట. విచారమధికమయింది. స్వగృహమందే దైవసన్నిధిలో ప్రపత్తిచేసి పవళించారట. స్వప్నంలో భగవంతుడు "వేదాంతాచార్యకృతాం శత దూషణీ మధీష్వ, జేష్యసి" అని అనుగ్రహింపగా, శతదూషణిని అధ్యయనంచేసి దీక్షితులను వాదంలో జయించారట. అప్పటినుంచి దొడ్డయాచార్యులు దేశిక భక్తాగ్రగణ్యులై "శతదూషణి"కి "చండమారుతం" అనే వ్యాఖ్యానాన్ని రచించారు.

ఆవ్యాఖ్యానమందు

"బాహ్యాదిభిశ్చిర నిరుద్ధనిజప్రకాశే పాణింధమీభవతి వేదపథే సమీచి! శ్రీమద్యతీంద్ర కృతిరత్న రుచి ప్రచారైః సంచారయన్ జయతిసఃకవివాది సింహః॥" దేశికులు వేదమార్గ ప్రతిష్ఠాపకులు' అని ప్రతిపాదించారు. మరొకటి

"అపరిచితసంప్రదాయై రవిదిత యతిరాజసూక్తి తాత్పర్యైః

అశమితకుదృష్టి గర్వై రలమలమన్యై రనాగమాంతార్యైః॥

విశిష్టాద్వైత సంప్రదాయమూ, రామానుజ యతీంద్రుల శ్రీసూక్తులు తెలియని వ్యక్తులతో ప్రయోజన మేమి? అంటూ దేశికులను స్తోత్రం చేస్తూ "వైభవ ప్రకాశికాస్తోత్ర " గ్రంథాన్ని నిర్మించారు శ్రీకందాళదొడ్డయాచార్యులు.

వయోజ్ఞాన వృద్ధులైన శ్రీ పిళ్ళలోకాచార్యుల వారు దేశికుల రచనలను ప్రశంసించిన ఒక పాశురం 'అధికార సంగ్రహం' అనే దేశిక ప్రభంధారంబంలో 'తనియ' గా అను సంధింపబడుతున్నది.

"శీరొన్ఱు తూప్పుల్ తిరువేంగడముడైయాన్, పారొన్ఱచ్చొన్న పళమొళియుళ్;
ఓ రోన్ఱు తానే యమైయాదో తారణియిల్ వాళ్వార్క్కు, వానేఱప్పోమళవుమ్ వాళ్వు, "--"

ఈ భూమండలంలో నివసించే ప్రపన్నులకు పరమపదాన్ని చేరేంతవరకు గల ఉజ్జీవనం కోసం గొప్ప కల్యాణ గుణాలు కలిగి అద్వితీయమైనది కాబట్టి తూప్పుల్ అనే దివ్యక్షేత్రంలో ఆవిర్భవించిన శ్రీదేశికులు భూలోకవాసులందరు ప్రావణ్యాన్ని పొందేరీతిగా అనుగ్రహించిన పలుప్రాచీన దివ్యసూక్తులలో ఏదో ఒక్కసూక్తియే చాలదా?" అని పాశురార్థం. ఏదో ఒక సూక్తిలోని మాధుర్యాన్ని అనుభవించడంచేత జన్మ సఫలమవుతుందనడం వల్ల, సూక్తి వైభవం సూచితం. 'పళమొళి' (ప్రాబల్కు – వేదం) అనడం వల్ల దేశికుల సూక్తులకు వేదసామ్యం ధ్వనిస్తున్నది.

శ్రీ కుమారవరదార్యులు "పిళ్ళైయన్దాది" ప్రబంధంలో దేశికులను స్తుతించిన ఒక పాశురమిది.
"అన్ఱివ్వులగినైయాక్కి యరుమ్పొరుళ్ నూల్విరిత్తు
నిన్ఱు తన్నీళ్ పుగళ్ వేంగడమామలై మేవియుమ్ పిన్,
వెన్ఱిప్పుగళ్, త్తిరువేంగడనాదనెనుమ్ గురువాయ్
నిన్ఱు నిగళ్న్దు మణ్మేల్ నిన్ఱనోయ్గళ్ తవిర్త్తననే ॥" (-5)

పూర్వం భగవానుడు విశ్వాన్ని సృష్టించాడు. వేదశాస్త్రాలను అద్భుతంగా ప్రకాశింపచేశాడు. తానే ప్రసిద్ధి పొందిన తిరుమలైలో శ్రీవేంకటేశ్వరస్వామిగా వెలశాడు. తర్వాత కలియుగంలో శ్రీ వేంకటనాథ గురువుగా తానే అవతరించి ప్రపంచప్రఖ్యాతిని పొందిన ప్రజ్ఞా విశేషంచేత లోకంలో వ్యాపించిన ధర్మవిరుద్ధమైన పద్ధతులను రూపుమాపాడు. సామాజిక రుగ్మతలను ఉపశమింపచేశాడు. అని పాశుర సారార్థం.

"శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణం (మందరం)"లో కృతికర్తయైన శ్రీమాన్ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసస్వామి) శ్రీవేదాన్త దేశికులను స్తుతించారు.

"ఏ సత్కవీంద్రువాచాసముజ్జృంభణ వింతతాలమునేర్పు వేధసతికి

నేవాకృతి పటిష్ఠవావదూకతతార్కిక గజకోటికి సింహగర్జనంబు ఏ మహామహుమతి రామానుజాచార్య మత మహీసితపోత్రి మహితదంష్ట్ర యేవైష్ణవాగ్రణిభావమార్గము ముక్తి భామినీ సౌధ సోపాన పంక్తి

యట్టి కవితార్కికోగ్రపంచాస్యమూర్తి
సాధునుత కీర్తి వైష్ణవ చక్రవర్తి
ధీసురాచార్య వేదాంత దేశికార్య
వేంకటాచార్య గొలుతు వేవేలగతుల

కవి కేసరి యన దేశిక
కవికే సరిగాక యితర కవియుంగవియే?
పవి సఖనఖముఖ భయద వ
పువు పులియుం బులియు నీగపులియుం బులియే? (బబా. 10&11)

దేశికుల వాగ్విలాసం సరస్వతికే కొత్త తాలం నేర్పిందనడానికి ఒక ఐతిహ్యం కలదని వారేదాన్ని వివరించారు.

'కంచుఢక్కా' బిరుదం గల డిండిమభట్టకవి దేశికులతో వాదానికి వచ్చి "ఈ ఢక్కా నీవు వాయించు, నేను కవిత్వం చెబుతాను; నేను వాయించితే నీవు కవిత్వం చెప్పు"మని పందెంచతీచాడట. దేశికులు ఆ ఢక్కాను తీసుకొని వివిధ తాలాలు శాస్త్రప్రకారం వాయించగా, ఆధాటికి సరిగా డిండిమభట్టు చెప్పలేక తికమకలాడాడట. తర్వాత డిండిమభట్టు ఢక్కా తీసుకొని శాస్త్ర పద్ధతిని విడిచి తారుమారుగా వాయింపసాగుతుంటే, దేశికులు దానికి తగినట్లే సాగించిన కవిత్వం 'రఘువీరగద్య' మని పేర్కొనబడిందట.

వజ్రాయుధంతో సమానమైన గోళ్ళచేత భయంకరమైన దేహంగల పులికే పులి యనే పేరు సార్థకం కాని సాలెపురుగుకు ఆ పేరు తగదు కదా! అలాగే కవికేసరి యనే బిరుదు దేశికుల యందే సార్థకం కాని ఇతర కవులకు, ఆ పేరు పెట్టుకొన్నా, తగదని తాత్పర్యం.

వర్ణాశ్రమధర్మాలను పాటిస్తూ, శ్రీ భాష్యకారుల సిద్ధాంతాన్నే శిరసావహిస్తూ, అనుష్ఠానం, ఉపదేశం, రచనలు అనే మూడు ప్రక్రియలద్వారా శ్రీ వైష్ణవ సంప్రదాయంలోని ఔచిత్యానౌచిత్యాలను గమనింపచేస్తూ, "గృహమేవతపోవనమ్" అన్నట్లు గృహస్థాశ్రమంలోనే ఉండి విలక్షణమైన వైరాగ్య జీవితాన్ని గడిపిన శ్రీ వేదాంత దేశికులు " శతాయుః పురుషః" అన్నట్లు పూర్ణాయుష్మంతులై, 1369 వ సంవత్సరం, కార్తీక మాసంలో పరమపదించారు. శ్రీ వేంకటేశ్వరస్వామి అవతరించిన దినమందు అవతరించి "తిరుమంగై యాళ్వార్" అవతరించిన దినమందు అంతర్ధానం చెందారు. అని వీరి చరిత్ర వల్ల తెలుస్తుంది.

ఆచార్య పురుషుల చరిత్ర అందరికీ ఆదర్శం కదా!

కవితార్కిక సింహాయకల్యాణగుణశాలినే
శ్రీమతేవేంకటేశాయ వేదాన్తగురవే నమః

తేది. 10-07-2003

స్వభాను శయనైకాదశి

భాగవత చరణరేణువు,

**కె.వి. రాఘవాచార్యులు.**

C/o కె.వి.రమణా చారి
బి.హెచ్ 3/6, ఐఎఎస్ ఆఫీసర్స్ క్వాటర్స్. రోడ్ నెం.10,
బంజారాహిల్స్, హైదరాబాద్-34.
Ph : 23350258

ఒక అర్థం. శ్రీనివాసుని పరీక్షా వ్యాఖ్యలో మరొక అర్థం చెప్పబడింది. శ్రియః పతి ప్రళయకాలంలో మహారుద్ర రూపం ధరించి అగ్నిమధ్యలో శయనించి ఉంటాడని భగవచ్ఛాస్త్రంలోని పౌష్కరం చెపుతున్నది. పాదుక ఆశాస్త్రం చెప్పిన విషయం యథార్థమే అని నిరూపిస్తున్నది అనేది ఈ రెండవ అర్థం.

**"యుగాన్తే షుచ సంహారం యః కరోతి చ సర్వదా,**
**శంకరాఖ్యో మహారుద్రః ప్రాదుర్భావాంతరం హితత్.**
**దేవస్యానల శాయోర్వై సర్వాయుః సంస్థితస్యవా".**

ప్రకృత వ్యాఖ్యాత ఈ రెండవ అర్థంతోపాటు మొదటి అర్థం కూడ చెప్పి ఉన్నారు. రెండర్థాలు యుక్తంగానే ఉన్నాయి. అయితే - "క్వచిత్ (కాలే) అనలే శయనమ్" అనడం చేత రెండవ అర్థమే యుక్తతరమేమో అనితోస్తుంది.

శ్రీ యామునాచార్యులు స్తోత్ర రత్నంలోని-

**"నివాస శయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః**
**శరీరభేదై స్తవశేషతాం గతైర్యథోచితం శేష ఇతీర్యతే జనైః"**

అను శ్లోకంలో అనంతుడు నివాసం, శయ్య, ఆసనం, పాదుకలు, వస్త్రాలు, ఉపధానం మొదలైన అనేక రూపాలు ధరించి భగవంతునికి శేషుడుగా ఉండడంచేత తన శేషనామధేయాన్ని సార్థకం చేసికొన్నాడు అని అంటూ పాదుక ఆదిశేషుని రూపాంతరం అని ప్రతిపాదించారు. ఆ భావాన్నే శ్రీవేదాంతదేశికులు గ్రహించి-

**"పద్మాభోగాత్ పాదుకే రంగభర్తుః పాదస్పర్శాత్ భోగమన్యం ప్రపిత్సోః.**
**శేషస్యైకాం భూమికామబ్రవీత్త్వామాచార్యాణా మగ్రణీర్యామునేయః" (752 శ్లో.)**

అని పాదుకలు ఆదిశేషుని మూర్త్యంతరమని వర్ణించారు. వ్యాఖ్యాత దీనికి చక్కగా వివరించి శ్రీ వేదాంతదేశికులకున్న ఆచార్య భక్తిని ఈ క్రింది మాటలలో విశదీకరించారు. "భగవచ్ఛాస్త్రం పాంచరాత్రంకంటె గుణోత్కర్షవ్యంజకమైన పరమాచార్య సూక్తియందు మాకున్న ఆదరం దండిది అనే అభిప్రాయాన్ని పట్టి ఇది పరికరాలంకారం". శ్రీనివాస విరచిత పరీక్షా వ్యాఖ్యానంలో కూడ "ఆచార్యాణామగ్రణీరిత్యుక్త్యా సామాన్యతో భగవతోఽపి పరమగురుభూతాత్ గుణోత్కర్షవ్యఞ్జనాదుక్తాత్ పాఞ్చరాత్ర శాస్త్రాదపి యామునోక్తిరేవ అస్మాకమాదరణీయేత్యభిప్రాయప్రతీతేః పరికరశ్చ" అని చెప్పబడింది. అయితే ఈ భావం ఎలా లభించిందో తెలియలేదు. బహుశా అనంతునికి పాదుకారూపత్వవర్ణనం పాంచరాత్రోక్తమైన విషయానికి విరుద్ధంగా ఉండి ఉంటుంది.

ఏదైనా ఒక మతాన్ని లేదా సంప్రదాయాన్ని అనుసరించేవాళ్లు ఇతర మతస్థులను ఇతర సంప్రదాయానుసారులను కూడ కుదృష్టులని, వేద ప్రతారకులనీ, లోకవంచకులనీ అంటూ నిందిస్తుంటారు. ఇది చిరకాలం నుంచి అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వస్తున్న ఆచారం. ఇది మనదేశంలోనే కాదు అన్ని దేశాలలోనూ అన్ని కాలాలలోనూ కనబడుతూన్న పద్ధతి. "శ్రీరంగనాథస్వామి పాదుక తనపైన పొదిగిన రత్నాల కిరణాలనే హస్తాలతో శ్రీరంగనాథుని పాదాలు స్పృశించి ఆ, దివ్యమంగళమూర్తిని చూపుతూ, తన శబ్దంతో శపథపూర్వకంగా కుదృష్టులకు ఈ రంగనాథస్వామియే

పరమసత్యం అనే తత్త్వాన్ని బోధిస్తూన్నట్లున్నది” అని శ్రీవేదాంత.దేశికులొకచోట ఉత్ప్రేక్షించారు-

**రత్నాశ్రితైర్వరిపదం మణిపాదుకే త్వం**
**స్పృష్టాకరైః శ్రుతిరసాయన మంజునాదా,**
**తత్త్వం తదేతదితి బోధయసీవ సమ్యక్**
**వేదాన్ ప్రతారితవతో వివిధాన్ కుదృష్టీన్ (860 శ్లో.)**

వివిధాన్ పరస్పర వ్యాహతోక్తీన్ కుదృష్టీన్ దురుత్ప్రేక్షామూల సిద్ధాన్తాన్ శంకరాదీన్” అని పరీక్షావ్యాఖ్య. ప్రకృత వ్యాఖ్యాత ఈ విషయాన్ని అతి సంక్షిప్తంగా రెండు మూడు వాక్యాలలో వివరించి – 'రత్నాశ్రితైః', 'స్పష్టాకరైః” అను పదాలలో సూచించిన పద్ధతిలో ప్రాచీన కాలంలో ప్రచారంలో ఉన్న శపథ విధానాన్ని విశదీకరించారు.

పాదుకాసహస్రంలోని 31 పద్ధతులు శ్రీ వేదాంతదేశికుల అత్యద్భుత కవితా చాతురికీ, అసాధారణ పాండితీ ప్రకర్షకూ నిదర్శనాలైతే -

**“ప్రతిష్ఠాం సర్వచిత్రాణాం ప్రపద్యే మణిపాదుకామ్,**
**విచిత్ర జగదాధారో విష్ణుర్యత్ర ప్రతిష్ఠితః”**

అని ప్రారంభించిన 40 శ్లోకాల చిత్రపద్ధతి నామధేయమైన ముప్పైయవ పద్ధతి సంస్కృతభాష శ్రీవేదాంతదేశికులకు ఏవిధంగా పూర్తిగా వశంవదయైనదో చెప్పడానికి గొప్ప ఉదాహరణం. చిత్ర బంధనిర్మాణం అనేది కేవలం సంస్కృత భాషలో మాత్రమే సాధ్యమైన ఒక అపూర్వ ప్రక్రియ. శ్రీవేదాంతదేశికులు ఈ పద్ధతిలోని అన్ని శ్లోకాలను వివిధ చిత్ర బంధాలలో నిర్మించారు.

భారవి, మాఘుడు మొదలైన కొందరు ప్రాచీన కవులు తమ కావ్యాలలో కొన్ని యమకాలు, చిత్రబంధాలు చూపి ఉన్నారు. అవి చాల స్వల్ప సంఖ్యలో మాత్రమే ఉన్నాయి. దాదాపు 38 శ్లోకాలలో వివిధ చిత్రాలను నిబద్ధం చేసిన కావ్యం పాదుకాసహస్రం ఒక్కటే. ఏకాక్షర శ్లోకాలు, వివిధ యమకాలు, గోమూత్రికా-మురజ-చక్రబంధాదిబంధాలు ఇవన్నీ సంస్కృత భాషను పూర్తిగా వశం చేసికొన్న మహా పండితులకు గాని సాధ్యమైనవి కావు. ఇవన్నీ వ్యాఖ్యా సాహాయ్య గమ్యములే. శ్రీ రాఘవాచార్యులవారు ఈ శ్లోకాల అర్థాలన్నీ పఠితలకు, హస్తామలకాలుగా చేస్తూ చిత్రాల ద్వారా ఈ శ్లోకాల లేఖన విధానాన్ని కూడ స్పష్టీకరించారు. ఇది పండితైకసాధ్యమైన కార్యం.

ఈ చిత్రబంధాలలో ఈ మహాకవి అనేకమైన చమత్కారాలు చూపించాడు. 940వ శ్లోకం అష్టదలపద్మం. దీనిలోని ఎనిమిది దళాల అగ్రాలలోని అక్షరాలను చదువగా “వేంకటపతి కమలమ్” అను కవినామం లభిస్తుంది. 941వ శ్లోకం మహాచక్రబంధం దీనిలోని మూడవ మండలంలో 'వేంకటనాథీయమ్' అనీ, ఆరవమండలంలో 'పాదుకాసహస్రమ్' అనీ నిక్షిప్తములై ఉన్నాయి.

942వ శ్లోకం (శార్దూల విక్రీడితవృత్తం) చతురంకాక్షర చక్రబంధం. ఒక పద్ధతిలో, ఈ చక్రబంధంలో వ్రాసిన అక్షరాలను ఒక క్రమంలో చదువగా -

**"శ్రీశ్రీవేంకటనాథేన వేదాన్తాచార్య తావతా,**
**కవివాది మృగేన్ద్రేణ కృతా పాదావనీనుతిః"**

అను అంతర్నిహితమైన అనుష్టుప్ శ్లోకం లభిస్తుంది. శ్రీరాఘవాచార్యులుగారు ఈ చమత్కారాలన్నీ తత్తచ్చిత్రనిర్మాణ ప్రదర్శన ద్వారా వివరించి ఉన్నారు.

ఈ మహాప్రబంధాన్ని గూర్చి, దీనికి శ్రీ రాఘవాచార్యులవారు తెలుగుతో సంతరించిన, పరమ ప్రామాణికమైన వ్యాఖ్యను గూర్చి ఎంతవ్రాసినా అత్యల్పమే అవుతుంది. ఆస్తికులైన ప్రతి ఒక్కరూ కనీసం రోజుకు పది శ్లోకాల చొప్పున నైనా (అంతకుమించితే బుద్ధి గ్రహించడానికి నిరాకరిస్తుంది) సవ్యాఖ్యానంగా చదువవలసిన గ్రంథం ఇది. ఇలా చదివినవారికి కావ్యసౌందర్యాస్వాదంతోపాటు శ్రీవైష్ణవసంప్రదాయ జ్ఞానం కూడ కలిగి శ్రీమన్నారాయణుని మీద అచంచలమైన భక్తిభావం కుదురుతుంది. ఇలాంటి ఉత్తమ గ్రంథాలను ఏదో పారాయణ గ్రంథంగా మాత్రమే అర్థ జ్ఞానం లేకుండా చదివినవారు పూర్తి ప్రయోజనం పొందజాలరు.

ఇలాంటి అతిరమణీయ వ్యాఖ్యను రచించిన శ్రీ రాఘవాచార్యులవారికి ఆస్తికులైన తెలుగువారందరూ అధమర్ణులై ఉన్నారని చెప్పడంలో సందేహం ఏమాత్రమూలేదు. అత్యుత్తమ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి ఆనందించే సదవకాశం నాకు కల్పించిన శ్రీమాన్ కే.వి. రాఘవాచార్యులవారికి కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

నందనం, 7-1-324 P2(892)
లీలానగర్, బేగంపేట,
హైదరాబాదు-500 0-6

పుల్లెల శ్రీరామచంద్రుడు

24.8.2003.



శ్రీః

**శ్రీపెరుంబూదూర్ శ్రీలక్ష్మణమూర్తి**

Prof. of English, Kakatiya University,

Warangal

(1)

శ్రీమద్వేదాంత దేశికులు సంస్కృతమున మనకనుగ్రహించిన భక్తి స్తోత్రకావ్యము శ్రీరంగనాథ పాదుకాసహస్రము. వారీ కావ్యమునందు గీర్వాణవాణీ శబ్దశైలీ వైవిధ్య సర్వస్వాన్ని సాక్షాత్కరింపజేసినారు. సర్వతంత్ర స్వతంత్రులు, కవితార్కికసింహులైన శ్రీదేశికులిందు శ్రీవైష్ణవసంప్రదాయాన్ని, విశిష్టాద్వైతసిద్ధాంతాన్నీ, భక్తిపారమ్యాన్ని, తమ నిస్సీమమైన శాస్త్రవైదుష్యాన్ని ఆవిష్కరించినారు.

13వ శతాబ్దికి చెందిన శ్రీపాదుకాసహస్రానికి శ్రీభారద్వాజ శ్రీనివాస పండితులు సంస్కృతమున వ్యాఖ్యానమును వ్రాసినారు. అభినవదేశికులు శ్రీమాన్ శ్రీ ఉత్తమూరి వీరరాఘవాచార్యస్వామివారు సంస్కృతవివృతినీ, తమిళవ్యాఖ్యానాన్ని ప్రసాదించినారు. కాని నిత్యపారాయణగ్రంథంగా శ్రీపాదుకాసహస్రాన్ని సమర్చించిన సంప్రదాయజ్ఞులైన శ్రీవైష్ణవ మహాపండితులెవ్వరూ ఈ గ్రంథరత్నాన్ని తెనుగున వ్యాఖ్యానించడానికి సాహసింపలేదు. దానికి పుణ్యబలమూ అవసరం. శ్రీపోతనామాత్యులు శ్రీమదాంధ్ర మహాభాగవతావతారికలో "నాపురాకృత శుభాధిక్య ఫలముగా మహానుభావులైన నన్నయ తిక్కనాది కవులు భాగవతాన్ని తెనిగింపలేదు. దీనిని తెనిగించి నాజన్మను సఫలం చేసుకుంటాను. పునర్జన్మ రాహిత్యాన్ని సంపాదిస్తాను" అని పరమానందంగా చెప్పుకొన్నారు. సుకృతనిధానంగా శ్రీమద్భాగవతం పోతనగారికి లభ్యమైంది. అట్టి ప్రాక్తనతపఃఫలవిశేషం వల్లనే కడచిన 700 సంవత్సరాలలో ఏ విద్వాంసుడూ తెలుగున వ్యాఖ్యానింపని 'శ్రీపాదుకాసహస్రం' ఆంధ్ర భక్తజన మహాభాగ్యంగా శ్రీమాన్ శ్రీ కారంచేడు తిరుమల వేంకటరాఘవాచార్యుల వారికి ప్రత్యక్షమైంది. శ్రీ ఆచార్యులవారీ మహోత్కృష్ట గ్రంథానికి విపులమైన ప్రామాణికమైన వ్యాఖ్యానాన్ని రచించినారు.

(2)

శ్రీమద్విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిష్ఠాపకులలో శ్రీరామానుజుల తరువాత పూజాస్థానము శ్రీదేశికులదే. ఏతత్సంప్రదాయగ్రంథములు తమిళ సంస్కృతభాషలందు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఆళ్వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధమును ప్రపన్నులు ద్రావిడవేదముగా సమర్చిస్తారు. శ్రుతి స్మృతి పురాణేతిహాస వైపశ్చితికి అనుసంధానముగా ద్రావిడ వేదసార సముద్ధారము చేయకలిగిన ఉపజ్ఞ, పాంచరాత్రాది ఆగమ విజ్ఞానము, భగవద్విషయవేత్తృత, శాస్త్రాధ్యయన సముపేతమైన సాహితీసౌందర్య రసజ్ఞత, నిర్మల భక్తిరస సమార్ద్రమైన చిత్తవృత్తి, సదాచారనిష్ఠ, నిశ్చలతపస్సు, తేనెలూరునట్టి తెలుగుశైలి ఇవన్నీ ఏకత్ర సమావిష్టమైనపుడే శ్రీపాదుకాసహస్రమును తెనుగున వ్యాఖ్యానించడానికి సంపూర్ణమైన అర్హత, సమగ్రమైన అధికృతి లభిస్తాయి. మూర్తీభూతమైన ఏతాదృశ సద్గుణ నికురుంబమే శ్రీరాఘవాచార్యుల వారి వ్యక్తిత్వము.

(3)

"శ్రీమాలోల నరసింహస్వామికృప, ఆచార్యకటాక్షము నాపై ప్రసరింపకుండినచో లోకోపకారకముగనుండు ఈ స్తోత్రము రమణీయాంధ్ర టీకాతాత్పర్య సహితముగా ప్రకాశితము కాకుండెడిది," అని శ్రీ ఆచార్యులవారు

గ్రంథారంభమున విన్నపము చేసినారు. వేయిశ్లోకములకు ఐదు సంపుటములలో అతి విస్తృతమైన వ్యాఖ్యానాన్ని ప్రణయించడం భగవదాజ్ఞానుగ్రహములు లేకుండా సాధ్యమౌతుందా? ఇది వారి వాఙ్మయతపస్సు. 'తపస్సు' అని నిశ్చయంగా ఎందుకంటున్నానంటే, శ్రీ ఆచార్యులవారు "చర్యానఃశౌరిపాదు! త్వం ప్రాయశ్చిత్తేష్వనుత్తమా" (918) అను శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ ప్రాయశ్చిత్తకాండలోని శ్లోకాన్ని ప్రమాణంగా ఉదాహరిస్తూ "ప్రాయః అంటే తపస్సు చిత్తమంటే నిగ్రహ"మని వ్రాసి "తపస్సు అంటే జ్ఞానం కలిగిన వ్యక్తి ఫలాపేక్షలేకుండా ఏకాగ్రతతో ఆచరించే కర్మ" అని వివరించినారు. ఆ వివరణ యథాక్షరంగా ఆచార్యులవారి వ్యాఖ్యాన రూప తపస్సున కన్వయిస్తుంది. తపశ్శబ్దాన్ని 'కృచ్ఛ్రాదికర్మ' 'వ్రతనియమోపాసనాదికర్మ' అనియే అందరూ వ్యాఖ్యానిస్తారు. శ్రీ ఆచార్యులవారు ఆధ్యాత్మిక జీవనానుబద్ధమైన ప్రతిపదానికీ తత్త్వరహస్య వివేచన చేస్తారు. సంప్రదాయ నందనవనంలో ప్రతిపుష్పం, ఫలం రంగు రుచి వాసన వారికి అనుభూతం. అందుకే వారి వ్యాఖ్యానం ప్రతిపదార్థ తాత్పర్యాలకు పరిమితం కాకుండా తత్త్వ భూమికను ఆవిష్కరిస్తుంది. సరియైన వివరణం ఎక్కడ లభించినా స్వాగతం పలుకుతారు.

"పరిమళపరివాహైః పావనైర్వాసయేథాః" (964) అను శ్లోక పాదంలోని "వాసయేథాః" శబ్దౌచిత్యాన్ని వివరిస్తూ 'వాసన' అంటే సంస్కారమని అర్థం అని వ్రాసి, సంస్కార శబ్ద నిర్వచనం చేయనిదే స్పష్టం కాదని, నిఘంటువుల వద్దకు పోకుండా, "సంస్కారోనామ సంస్కారస్య గుణాధానేన వాస్యాద్దోషాపనయనేనవా" అను శ్రీశాంకర భాష్యపంక్తి నుదాహరించినారు. వారి మనీషామధువ్రత విహారానికి ఎల్లలు లేవు. పూర్వవ్యాఖ్యాతలు "వాసయేథాః సంస్కుర్యాః" అని అర్థం చెప్పినారే కాని సంస్కారశబ్దాన్ని వివరింపలేదు.

శ్రీ దేశికులు ఎంత సుకుమారముగా వ్రాయగలరో, అంతగహనంగానూ వ్రాయగలరు. 'చిత్రపద్ధతి'లోని 30 శ్లోకాలను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది. ఎంతటి వారిదైనా చిత్రబంధ కవిత్వం బంధంగా నిర్బంధంగా వ్రాసినట్లే ఉంటుంది. శ్రీ దేశికులవారియెడ అత్యంత ప్రశ్రయభావం కలిగిన శ్రీ ఆచార్యులవారు నిర్మలకవితారసికులు. 919 శ్లోకంలో పాదానులోమప్రతిలోమయమకాన్ని వివరించి, శ్రీ దేశికుల ప్రతిభకు అబ్బురపడినా 'ప్రాయశో యమకే చిత్రే రసపుష్టిర్నవిద్యతే' అని విద్యానాథపంక్తిని ఉదాహరింపకుండా ఉండలేకపోయినారు. సత్కవితారసవివశత్వమట్లా ఉంటుంది.

ఒక సాధారణమైన శ్లోకాన్ని వివరిస్తూ అందమైన మాటల పొందికతో దానికి అనిదం పూర్వ ప్రాధాన్యాన్ని కల్పిస్తారు. ఉదాహరణకు "యత్ర నిర్లిప్తభావేన సంసారే వర్తతే గృహీ... తత్రైవరమతేహరిః" అన్న నిరలంకార శ్లోకానికి "సంసారి నిర్లిప్తమనస్కుడై నిష్కామకర్మను ఆచరిస్తే, కంసారి ఆచోటనే రమిస్తాడు" అని సున్నితమైన శబ్ద చమత్కారంతో ఆనందం కలిగిస్తారు.

ఒక్కొకసారి వ్యాఖ్యావివరణలో వారి సూక్ష్మ దృష్టి తెలుస్తుంది. "కృపణ ద్వార దురాసికాది దుఃఖైః" (973) అను శ్లోకపాదంలోని దురాసికా దుఃఖం ఎటువంటిది? శ్రీ ఆచార్యులవారి వివృతి :

"లోభులకు దానగుణం అరుదు. ఒకవేళ వారు ఇచ్చినా
అది స్వల్పమే. ధనాశచే ముప్పొద్దులూ లోభుల
ముంగిళ్ళకు తిరగడం వల్ల కళ్ళు వాస్తాయి. ఇంద్రుడవు
చంద్రుడవు అని కొండాడడం వల్ల కొండనాలుక

కూడా ఎండిపోతుంది. ద్వారంగుండా వచ్చి
పోయేవారు చూచి.... నిందిస్తుంటే చెవులు
చిల్లులు పడతాయి. గంటల కొద్దీ నిల్చియుండే
దుఃస్థితి వల్ల దేహం నీరసిస్తుంది. నిట్టూర్పులు
సంభవిస్తాయి. కాబట్టి క్షుద్ర యాచనతో
సర్వేంద్రియాలకు బాధ కలిగించడంకంటే
సర్వేంద్రియాలను సంతృప్తిపరిచే శ్రీరంగ
నిధిని సులభంగా అందించే పాదుకాదేవిని
ప్రస్తుతించడం పరమపురుషార్థం."

వారి వైరాగ్య ప్రవణత, ముముక్షాతీవ్రత ఇట్లా స్పష్టమౌతాయి.

987 శ్లోక వ్యాఖ్యానంలో యోగ విషయాన్ని వివరిస్తారు. దర్శన సమాకార జ్ఞానమును పేర్కొని 'తాదృశబుద్ధిగమ్యం' 'స్వప్నే2పిచేత్' పంక్తులను వ్యాఖ్యానిస్తూ అతి సరళంగా "బాహ్యేంద్రియాలు పనిచేయకుండా మనస్సొక్కటే పనిచేయడం స్వప్నానికీ యోగానికీ సమానధర్మమే కదా?" అని సంక్షేపిస్తారు. "కనులు తెరిస్తే సవికల్పసమాధి, మూస్తే నిర్వికల్ప సమాధి" అని శ్రీరమణ మహర్షి సులభంగా తేల్చి చెప్పినారట. యోగమంటే అంతసులభమా అనిపిస్తుంది. అదివారి దయాళుత.

మరణాంత జీవనమేయాగంగా "తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానః" అని ప్రారంభమైన "యన్మరణం తదవభృథః" అనే శ్రుతివాక్యాన్ని "జీవనం ఒక యజ్ఞం, మరణమే అవభృథం" అని సంక్షేపించి శ్రీఆచార్యులవారు దాన్ని అత్యాధునికం చేసినారు.

**(4)**

శ్రీరాఘవాచార్యులు గారు అవిశ్రాంత నిష్ఠాపరులైన ప్రపన్నులు. గురుకుల క్లేశంతో సంపాదించిన పాండిత్యం వారి పెన్నిధి. వారికి సంస్కృత పదబంధాలపై ఎంత మక్కువ ఉన్నా, తెలుగు నుడికారంపై చెప్పరానంత వలపు.

దిగువ నుదాహరించిన శ్లోకవ్యాఖ్యానంలో అది స్పష్టమౌతుంది

కథంకారం లక్ష్మీకరకమల యోగ్యం నిజపదం
నిదధ్యాత్ రంగేశః కులిశ కఠినేస్మిన్మనసినః ।
న చేదేవం మధ్యే విశతి దయయాదేవి భవతీ
నిజాక్రాంతి క్షుణ్ణ స్మరశరశిఖా కంటక తతిః॥ (999)

ఈ శ్లోకం శిఖరిణీ వృత్తంలో గంభీరంగా సాగింది. చివరి పాదం విలక్షణంగా ఉన్నది. శ్రీరంగేశపదం లక్ష్మీకరకమల యోగ్యమైనది. అత్యంతం మృదువైనది. మన్మథ బాణాగ్రకంటకాలను నుగ్గుచేసే పాదుకాదేవి చొరవ చేసికుంటే తప్ప నూరు మొనల వజ్రాయుధం వలె కఠినమైన మనస్సులో శ్రీరంగనాథులు తమ సుకుమారపదాన్ని నిక్షేపిస్తారా? శ్రీరంగనాథుని పాదమెంత మృదువో తెలియవలెనంటే లక్ష్మీకరకమలమెంత సుకుమారమో తెలియవలెను. శ్రీహస్తే

సౌకుమార్యమును తెలియుటకు లక్ష్మీమృదుత్వము తెలియవలెను. ఆ మృదుత్వాన్ని వర్ణిస్తూ "పద్మవాసినియైన లక్ష్మీదేవి పాదాలకు పద్మపరాగం సోకుతుంటే ఎంతో బాధ కలుగుతుంది. ఆమె శరీరం చెలికత్తెల చూపులచేత వాడిపోతుంది. ఎప్పుడైనా విలాసంగా కమల పుష్పాన్ని చేతితో పట్టుకుంటే, అది సాహసకార్యమే" అన్నారు శ్రీపరాశరభట్టర్ (పుట. 112) అంత సుకుమారకర సంవాహన యోగ్యమైన శ్రీరంగనాథపాదమృదుత్వాన్ని ఊహింప సాధ్యంకాదు. ఈ సందర్భాన ఆచార్యులవారు పోతనగారి పద్యాన్ని, కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి పద్యాన్నీ ఉదాహరించినారు. శ్రీ విశ్వనాథవారి పద్యసౌందర్యం వారి మనస్సు నాకట్టుకున్నట్టున్నది. అనురాగంతో దానికి స్థానం కల్పించినారు :

తామరలన్న నీవలపు దారికి దారియుతెన్నులేదు, పొం
దామర యామెమోము, తెలిదామర యాయమ కన్నుదోయి, చెం
దామర యామెకేలుగవ, తామరలన్ మరలన్ జయించుకాం
తామర వాహినీ వికచ తామరసంబులు నామెకన్ జిగుల్

శ్రీ విశ్వనాథ వారు సీతాదేవిని వర్ణించిన పద్యమిది.

పైనుదహరించిన శ్లోకం నాలుగవ పాధాన్ని ఇట్లా వ్యాఖ్యానించినారు :
"పాదుకలక్రింద పడిన ముండ్లు ముఖభంగంతో
తలెత్తుకోలేవు. ఈ కంటకాల (ముండ్ల)కంటె
కడువాడి, వేడి కలవి మన్మథుని బాణాగ్రాలు
మన్మథుని బాణాలన్నీ – అరవిందం, అశోకం,
చూతం, నవమల్లిక, నీలోత్పలం – (5) – అతి
సుకుమార కుసుమాలే ఐనా, ఈ పూలబాణాల
మొనలు కసుక్కున మనస్సులోకి నాటుకపోయి
కాయాన్ని గాయంచేస్తాయి. చిత్తం చెత్త అవుతుంది.
రాగాది విషయాలను స్మరించినాకొద్దీ అంగాలన్నీ
అనంగమయమౌతాయి."

ఈ వాక్యాలలోని శబ్దచమత్కృతి వ్యాఖ్యానాన్ని హృదయంగమం చేస్తుంది. శ్లోకంలో నిక్షిప్తమైన భావసర్వస్వాన్ని సుగమంగా అందించడమే వారి లక్ష్యం.

(5)

శ్రీమాన్ రాఘవాచార్యులవారి వ్యాఖ్యానం విస్తృతమైంది. ఈనాటి వారికోసం ఇంత విస్తారంగా వ్రాయవలసిందే. శ్రీ మల్లినాథ సూరి వ్యాఖ్యాతృచక్రవర్తి. ఆయన 'నామూలం లిఖ్యతే కించిత్, నానపేక్షితముచ్యతే' అని వ్యాఖ్యాన స్వభావాన్ని నిర్దేశించినారు. ఏది అమూలమో, ఏది అనపేక్షితమో నిర్ణయించడమెట్లా? వ్యాఖ్యానము నధ్యయనము చేయువారి సంస్కారబలము ననుసరించి వాటిని నిర్ణయింపవలసి ఉంటుంది. సంస్కారబలము లోపించిన కాలాన గ్రంథగౌరవ భయంచే క్లుప్తంగా వ్యాఖ్యానిస్తే శ్రమ నిష్ప్రయోజనమౌతుంది. మరొక గొప్ప వ్యాఖ్యాత శ్రీరామచంద్ర బుధేంద్రులు భిన్నమైన అభిప్రాయమును చెప్పినారు :

వ్యాకుర్వంతి నిబంధగౌరవభయాన్నైవ స్ఫుటం యుక్తిభి
ర్యేతే2ధ్యేతృజన ప్రతారణపరాః కానైపుణీవాతతః ।
వైఖర్యావచసాం కవీశహృదయం ప్రఖ్యాపయన్నన్వయ
ద్వారైవాహమిహాఖిలం ప్రవివృణోమ్యుక్తిప్రజోజ్జృంభితమ్ ॥

గ్రంథ విస్తరభీతి అనే మిషతో కవిహృదయాన్ని ఆవిష్కరింపకుండా క్లుప్తంగా వ్యాఖ్యానిస్తే దానిలో నైపుణ్యమేమున్నదని బుధేంద్రులు ప్రత్యాఖ్యానము చేసినారు. 'కవీశహృదయం ప్రఖ్యాపయన్ ఉక్తి ప్రజోజ్జృంభితమఖిలం ప్రవివృణోమి' అని మరొక పథమును నిర్దేశించినారు. శ్రీ ఆచార్యులవారి వ్యాఖ్యానము బుధేంద్రపద్ధతికి చెందినది. 'పండిత ప్రమోదాయ, సుకుమార మతీనా మప్యుకారాయ' అని ప్రతిజ్ఞచేసి వ్రాసినట్లున్నది.

(6)

శ్రీమాన్ శ్రీ ఆచార్యులవారి ఆదేశమును శిరసావహించి, కేవలం ఐదవ సంపుటముననుసరించి ఈ నాలుగు మాటలను వ్రాసినాను. ఇతః పూర్వం ప్రచురితమైన నాలుగు సంపుటములందున్న వ్యాఖ్యాన విశేషములను ప్రస్తావింపలేదు. సర్వజనామోదమును పొందిన వ్యాఖ్యానమును గూర్చి ఇంతగా వ్రాయనవసరములేదు. కాని నిర్హేతుక జాయమాన భగవత్కృపావిశేషంచే నాకీ అవకాశం లభించింది. నావంటి వానికిట్టి భాగ్యములభించడమంటే, శ్రీదేశికులవారు అన్నట్లు 'కిమాశ్చర్యం పంగోరుపరియది గంగానిపతతి'.

శ్రీపాదుకా సహస్రాంతమందు శ్రీదేశికులు

సఫలం మమ జన్మతావత్
యదిహాశాస్యమతః పరంకిమేతత్?

(నాజన్మసఫలమైంది. ఇంతకంటె కోరదగిన దేమున్నది?) అన్నారు. శ్రీరాఘవాచార్యులుగారు ఈ పదాలనిట్లాగే వ్యాఖ్యానాంతమున తమకన్వయించుకొన నర్హులు. శ్రీ ఆచార్యుల వారన్నట్లు "రసిక శిఖామణులైన సహృదయులు నిత్య ప్రత్యగ్రభావ స్ఫోరకమైన, రసగర్భ సందర్భ సౌందర్యవిభ్రాజితమైన ఈ స్తోత్రాన్ని తామే స్వయంగా గ్రహించి ఆదరిస్తారు, అనుసంధిస్తారు." అట్లే రమణీయాంధ్ర వ్యాఖ్యానాన్ని సమాదరిస్తారు. సమర్చిస్తారు.

'ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః' అని వసిష్ఠులచే అభిష్టుతమైన పాదుకాయుగళికి దండవత్ప్రణామములను సమర్పిస్తే, శ్రీ దేశికులకు, శ్రీమాన్ ఆచార్యులవారికి ప్రణతి సహస్రాన్ని నివేదించి మత్కృత పరకృత దోష సముదాయాన్ని మన్నింపుడని వేడుకోలు చేస్తున్నాను.

ఇంతటి అమోఘమైన స్తోత్రరత్నాన్ని, రమణీయాంధ్ర వ్యాఖ్యానాన్నీ అంతే అందంగా నిర్దుష్టంగా ప్రచురించిన శ్రీ మాలోల గ్రంథమాలవారికి ఘనమంతా అధమర్ణులం.

ఇ.నెం. 5-11-674,
విద్యారణ్యపురి
వరంగల్-506 009
26-09-2003

ఇట్లు
బుధేంద్రవిధేయుడు
**శ్రీ లక్ష్మణమూర్తి**



శ్రీ రంగనాథ దివ్యమణి పాదుకాభ్యాంనమః
శ్రీమతే రామానుజాయనమః

శ్రీమన్నిగమాన్త మహాదేశికాయనమః

# శ్రీరంగనాథ పాదుకాసహస్రమ్

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ ।
వేదాన్తా చార్యవర్యోమే సన్నిధత్తాం సదాహృది ॥
రామానుజ దయాపాత్రం జ్ఞానవైరాగ్య భూషణమ్ ।
శ్రీమద్వేంకటనాథార్యం వందేవేదాన్త దేశికమ్ ॥

శ్రియైనమ ః

## 30. చిత్ర పద్ధతి

**911.** ప్రతిష్ఠాం సర్వచిత్రాణాం ప్రపద్యేమణి పాదుకామ్ ।
విచిత్ర జగదాధారో విష్ణుర్యత్ర ప్రతిష్ఠితః ॥

శ్రియైనమః

# 30. చిత్రపద్ధతి

*911. ప్రతిష్ఠాం సర్వచిత్రాణాం ప్రపద్యే మణి పాదుకామ్।*
*విచిత్ర జగదాధారో విష్ణుర్యత్ర ప్రతిష్ఠితః ॥-1.*

**అర్థం :-** యత్ర=ఏపాదుకయందు; విచిత్ర జగత్+ఆధారః=ఆశ్చర్యకరమైన జగత్తుకు/సకల చిత్ర ప్రపంచానికి/ అద్భుతంగా జనించి పరివర్తించే విశ్వానికి ఆధారుడైన; విష్ణుః=సర్వవ్యాపకు డైన శ్రీ మన్నారాయణుడు; ప్రతిష్ఠితః=నిలిచి యున్నాడో; సర్వచిత్రాణాం=పలువన్నెల మణులతో కూడిన చిత్రాలకు। శబ్దార్థ చిత్రాలకు। మనోహరమైన అన్ని విషయాలకు; ప్రతిష్ఠాం=ఆస్పదమైన; మణిపాదుకాం= ఆ మణిమయ పాదుకాదేవిని; ప్రపద్యే=శరణం పొందుతున్నాను.

**తాత్పర్యం :-** ఏ పాదుక(ల) యందు విచిత్రమైన విశ్వానికి ఆధారుడైన శ్రీరంగనాథుడు ప్రతిష్ఠితుడైనాడో, సకల చిత్రాలకు ఆస్పదయైన ఆ మణిమయ పాదుకాదేవిని ప్రపత్తిజేస్తున్నాను.

రమణీయ వ్యాఖ్య :- శబ్ద చిత్రప్రాధాన్యంగల పాదుకాదేవిని ప్రస్తుతించే వర్ణన.

ఆశ్చర్యకరమైన వేర్వేరు పదార్థాలతోనూ, ప్రాణులతోనూ కూడి యున్న ప్రపంచానికి ఆధారభూతుడైన శ్రియః పతి చాలా అద్భుతమైన శక్తి మంతుడు. ఆ విచిత్ర జగదాధారునికీ ఆధారభూతమైనది పాదుకాదేవి. పలురంగులు గల రత్నాలతో కూడిన శంఖ పద్మరేఖాది చిత్రాలను తన శరీరమందు కలిగి ఉంది. సకల విధ వైచిత్రి పాదుకాదేవికి తెలియునుకదా!

'చిత్ర' పదానికి అనేకార్థాలున్నాయి.

"చిత్ర కిమ్మీర కల్మాష శబలైతాశ్చ కర్బురే" (అమరం)

"ఆలేఖ్యాశ్చర్య యోశ్చిత్రమ్" అని నిఘంటువు.

అనుప్రాస, యమక, చక్ర బంధాది శబ్ద చిత్రాలకూ, ఇతర పద్ధతులలో ప్రతిపాదింపబడిన ఉపమా, రూపకోత్ప్రేక్షాది అర్థచిత్రాలకూ, పరీక్షిత్తు, అహల్య మొదలైన వారిని ఉజ్జీవింపజేసిన ఆశ్చర్యకృత్యాలకూ ఉనికి పట్టైనపాదుకా దేవిని అనన్య శరణంగా దేశికులు ఆశ్రయించారు.

చరిత్ర కావ్యం, కథాకావ్యం, స్తోత్రకావ్యం, నీతి కావ్యం అనే వివిధ కావ్యాలలో "పాదుకా సహస్రమ్" స్తోత్రకావ్యం. కావ్య శరీరానికి శోభను కూర్చేవి శబ్దార్థచిత్రాలు. ఇంతవరకు, 29 పద్ధతులలో ఉపమాద్యనేకార్థ చిత్రాలతో ఈ కావ్యశోభను అద్వితీయంగా అలరింపజేసి, కవితార్కిక కేసరి ఈ 30వ పద్ధతిలో పాండిత్య ప్రకర్షకూ, ప్రగల్భతకూ తార్కాణమైన బహువిధ శబ్దచిత్ర బంధాల రచనతో కావ్య రామణీయకతను పాదుకావైభవాను భవ యోగ్యంగా ప్రకాశింపజేస్తున్నాడు.

ఆశు, మధుర, విస్తర, చిత్ర రీతులనే 'చతుర్విధ కవిత్వం' లో చిత్ర కవిత ఒక ఛందఃక్రీడ. పద్మ చక్రాది చిత్రాలను గీసి, సంగమ స్థలాలలో అక్షరాలను ఉభయతారకంగా పొందుపరచి, శ్లోకాన్ని బంధించడం బౌద్ధిక వ్యాయామం కదా! కాబట్టి ఇది "చిత్ర పద్ధతి".

సూచ్యార్థ సూచనం "ముద్రాలంకార" లక్షణం.

పదాల్లోనూ, పాదాల్లోనూ, వర్ణావృత్తి-ప్ర-ప్ర; వి-వి; ప్రయుక్తమయినందువల్ల - **'అనుప్రాసం'** అనే శబ్దాలంకారమిది. అనుష్టు బ్ఛందస్సు.

*912. శ్రుణు తే పాదుకే చిత్రం చిత్రాభిర్మణిభిర్విభోః।*
*యుగక్రమభువో వర్ణాన్ యుగపద్వహసే స్వయమ్॥-2*

**అర్థం :-** హేపాదుకే=ఓ పాదుకాదేవీ! తే=నీయొక్క; చిత్రం=మనోజ్ఞమైన శీలాన్ని; శ్రుణు=వినుము. విభోః=సర్వేశ్వరుని యొక్క; యుగక్రమభువః=ఒక్కొక్కయుగ మందు ఒక్కొక్కటి చొప్పున ఉండే/రెండేసి వరుసగా కూర్చబడి ఉండే; వర్ణాన్=(తెలుపు మొదలైన) వన్నెలను / అక్షరాలను; స్వయం=స్వయంగా; చిత్రాభిః=నానావర్ణాలుగల; మణిభిః=రత్నాలచేత; యుగపత్=ఏకకాలమందే; వహసే=ధరిస్తున్నావు.

**తా॥** ఓపాదుకాదేవీ! ఆశ్చర్యకరమైన నీ సౌశీల్యాన్ని విను. భగవంతునికి ఒక్కొక్క యుగ మందు ఒక్కొక్క రంగు-వర్ణం-క్రమంగా ఉంటే, నానావర్ణాలు గల మణులచేత ఆ చిత్ర వర్ణాలనన్నిటినీ, నీవు ఒకే కాలాన ధరిస్తున్నావు.

వ్యాఖ్య :- భగవంతునికన్న పాదుకాశీలం మిన్న, అని ప్రశంస.

కృతయుగంలో భగవద్విగ్రహం తెల్లగానూ, త్రేతాయుగంలో ఎరుపు వన్నెగానూ, ద్వాపరంలో పీతవర్ణంగానూ, కలియుగంలో నీలవర్ణంగానూ ఉంటుంది. అవతార విశేషమిది.

"ఆసన్ వర్ణస్త్రయోహ్యస్య గృహ్ణతోఽను యుగం తనూః।

శుక్లో రక్తస్తథా పీత ఇదానీం కృష్ణతాంగతః॥

అని శాస్త్రప్రమాణం. బహురత్న పద్ధతి-532వ శ్లోకం-లో ఈ విషయం వర్ణితమే. అవతారకాలాన్ని బట్టి భగవంతుడు ఒక్కొక్క వన్నెను వహిస్తే, పాదుకాదేవి ఒకే సమయంలో మణులచేత అన్ని వన్నెలను వహించడం వల్ల భగవంతుని కంటె పాదుకాశీలం వన్నెవాసికెక్కి చాలా ఆశ్చర్యావహమయింది. యమకాది శబ్దాలంకారాలలో ఆవృత్తికి ఆవశ్యకమైన నానావర్ణాలను/అక్షరాలను వహించే నీ విషయం, ఎంత ఆశ్చర్యకరమైనదో చూడుమని దేశికులు విన్నవిస్తున్నారు.

"శ్రుణుతేపాదుకే చిత్రం" అని శ్లోకం చదువుతుంటే, వినేవారికి "శ్రుణుతే' 'ఆత్మనేపది'గా భ్రమకలుగుతుంది. 'శ్రుణోతి'-పరస్మైపది-సాధువు. 'శ్రుణుతే'- అపశబ్దం. వాస్తవంగా ఆలోచిస్తే 'శ్రుణు' విధిలోట్, మధ్యమ పురుషైక

వచనమనీ, 'తే'-వేరే పదమని తెలిసి 'ఆత్మనేపది' అనే భ్రమ తొలగిపోతుంది.

"యత్రాపశబ్దధీః సాధుభావజ్ఞానాన్ని వర్తతే।

తత్రా పశబ్దా భాసఃస్యాత్, యథేదం పురుషోమహాన్"

అనే లక్షణాన్ని బట్టి, ఈ శ్లోకమందు 'అపశబ్దాభాస' మనే శబ్దచిత్రం ఉంది. అనుష్టుప్ ఛందం.

*913.* సురాసురార్చితాధన్యా తుంగమంగళపాలికా।
చరాచరాశ్రితా మాన్యా రంగపుంగవపాదుకా॥-3

**అర్థం :-** సుర+అసుర+అర్చితా=దేవతలచేతనూ, రాక్షసులచేతనూ పూజింపబడే; ధన్యా=సకలసంపద్విశిష్టమైన; తుంగ మంగళ పాలికా=ఉత్కృష్ట శుభాలను పాలించే; చర+అచర+ఆశ్రితా=జంగమ స్థావరాలచే ఆశ్రయింపబడిన; రంగ పుంగవ పాదుకా=శ్రీరంగనాథుని పాదుక; మాన్యా=కొనియాడ తగినది.

**తా॥** దేవదానవులచే పూజింపబడుతూ, సర్వసంపదలతో కూడి ఆశ్రితులకు శ్రేయస్సును కలిగిస్తూ, స్థిరచర పదార్థాలచే ఆశ్రయింపబడిన శ్రీరంగనాథుని పాదుకను అందరూ ప్రస్తుతిస్తారు.

వ్యాఖ్య :- పాదుకాదేవి సర్వలోకమాన్య

ఉత్తమ పురుషుడైన శ్రీరంగనాథుని పాదాలను తాను వహించడం వల్ల పాదుక సకల సంపద్విశిష్ట అయింది. ప్రజలకు శ్రేయస్సును కలిగిస్తుంది. దేవతలకూ, మనుష్యులకూ, తిర్యక్కులకు అంటే పశు పక్ష్యాదులకూ, వృక్ష పర్వతాలకూ ఆధారుడైన శ్రీ రంగనాథునికీ ఆధారమైనందువల్ల ఆచరాచరవస్తువులన్నీ పాదుకను ఆశ్రయించాయి. అనుష్టుప్ ఛందం.

ఇది గోమూత్రికాబంధం.

గోవు మూత్రీకరించినప్పుడు రేఖగా-సూటిగా పడదు. కుటిలంగా అంటే ప్రక్కలకు కూడా పడుతుంది. గోమూత్రికా విధానంగ చిత్రంగీసి, శ్లోకంలోని-పూర్వార్థంలోనూ, ఉత్తరార్థంలోనూ ప్రతిరెండవ అక్షరాన్ని ఒకే అక్షరంగా కూర్చినట్లైతే గోమూత్రికాబంధ మనే శబ్దచిత్ర మేర్పడుతుంది.



*914.* పద్మేవ మంగళ సరిత్పారం సంసార సంతతేః।
దురిత క్షేపికా భూయాత్, పాదుకారంగ భూపతేః॥-4

**అర్థం :-** రంగభూపతేః=శ్రీరంగరాజుయొక్క; పాదుకా=పాదావని; దురితక్షేపికా=పాపాలను పోగొట్టే; మంగళ సరిత్=శుభవాహినియైన; పద్మా, ఇవ=లక్ష్మీదేవి వలె; సంసార సంతతేః=సంసారధోరణికి; పారం=దరిగా; భూయాత్=ఉండుగాక.

**తా॥** శ్రీరంగరాట్పాదుక లక్ష్మీదేవి వలె పాపాలను పోగొడుతుంది. సంసారసముద్రం నుంచి గట్టెక్కిస్తుంది. శుభాలను మీది మీద దొరలి వచ్చేరీతిగా చేస్తుంది.

వ్యాఖ్య :- పాదుకాదేవి అచ్చం లక్ష్మీదేవియే,

పాదుకాదేవికి వాడబడిన విశేషణ పదాలన్నీ లక్ష్మీదేవికి వర్తిస్తాయి. కాబట్టి, పాదుకాదేవి సాక్షాత్తు లక్ష్మీదేవితో సమానగుణాలు కలది, అని దేశికులు ప్రశంసించారు. ఉపమాలంకారం. అనుష్టుప్.

"గూఢ చతుర్థం" అనే శబ్దచిత్రమిది.

"పాదుకా రంగభూపతేః" అనే నాల్గవ చరణంలోని ఎనిమిది అక్షరాలను మీది మూడు చరణాలలో అక్కడక్కడ గూఢంగా కూర్చడం వల్ల 'గూఢ చతుర్థ' మయింది. ఇలాగే "గూఢప్రథమం" కూడా ఉంటుంది.

"యత్రైకపాదవర్ణానా మన్యపాదేషుగోపనమ్।
తద్గూఢపాదకం నామ, తద్భేదఃప్రథమాదిభిః॥"

ఈ శ్లోకంలో 'పారం' అనే చోట 'పా', 'దురిత' అనే చోట 'దు'- 'క్షేపికా' అనే చోట 'కా' ఏరి కలిపితే 'పాదుకా' అయింది. 'పారం' అనే పదంలోని 'రం'- 'మంగళ' లోని-గ' 'భూయాత్' అనే క్రియా పదంలోని 'భూ'- 'పద్మ'లోని 'ప'-'సంతతేః' అనే పదంలోని 'తేః' ఏర్చి కూర్చితే 'రంగభూపతేః' అయింది.

***915. అనన్య శరణః సీదన్ననంత క్లేశసాగరే।***
***శరణం చరణత్రాణం రంగనాథస్య సంశ్రయే॥-5***

**అర్థం :-** అనంత క్లేశ సాగరే=అంతులేని దుఃఖమనే కడలియందు; సీదన్=శోకిస్తూ; అనన్య శరణః=వేరే రక్షకం-గతి-లేనివాడనై; రంగనాథస్య=శ్రీరంగపతి యొక్క; చరణత్రాణం=పాదరక్షను; శరణం=రక్షకంగా; సంశ్రయే=ఆశ్రయిస్తున్నాను.

**తా॥** అవధి లేని శోకసముద్ర మందు మునుగుతూ, తేలుతూ, వేరేదిక్కులేని వాడనై శ్రీరంగనాథుని పాదుకను శరణంగా ఆశ్రయిస్తున్నాను.

వ్యాఖ్య :- సంసారసాగరంలో దరిదాపుదొరకక దుఃఖపడేజీవికి శ్రీరంగనాథుని పాదుకయే శరణమన్నారు దేశికులు.

ఈశ్లోకంలో 'నిరోష్ఠ్యం' అనే శబ్దచిత్రం ఉంది.

'ఓష్ఠ్యం' అంటే పెదవుల కదలిక వల్ల ఉచ్చరింపబడే 'ఉ,ఊ,ఓ,ఔ', (ప వర్గం) 'ప,ఫ,బ,భ,మ'- మరియు 'వ' అనే అక్షరాలు, ఉపయోగింపబడలేదు. సున్న 'మ'కారంకాదు, అనుస్వారం.కాబట్టి 'నిరోష్ఠ్య' మిది. అనుష్టుప్ ఛందం.

916. ప్రతిభాయాః పరంతత్త్వం బిభ్రతీ పద్మలోచనమ్।
పశ్చిమాయామవస్థాయాం పాదుకే! ముహ్యతో మమ॥-6

**అర్థం** :- హేపాదుకే=ఓపాదుకాదేవీ! పశ్చిమాయాం=చివరిదైన; అవస్థాయాం=దశయందు; ముహ్యతః=మూఢుడనైన; మమ=నాకు; పరం, తత్త్వం=ఉత్కృష్టవస్తువైన; పద్మలోచనమ్=పుండరీకాక్షుణ్ని; బిభ్రతీ=భరించే నీవు; ప్రతిభాయాః=ప్రత్యక్ష మగుము.

**తా॥** ఓ పాదుకాదేవీ! పరతత్త్వమైన పుండరీకాక్షుణ్ని వహించే నీవు, అజ్ఞానినైన నాకు అంత్యకాలంలో ప్రత్యక్షం కావాలి.

వ్యాఖ్య:- చరమదశలో శ్రీరంగనాథుని దర్శనం కలిగించుమని పాదుకాదేవిని కవి ప్రార్థించే శ్లోకం.

"పరం తత్త్వం"- అన్నిటి కన్న శ్రేష్ఠమైన యథార్థవస్తువు, భగవంతుని స్వరూపం. "నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే" నారాయణునితో సమానుడు గానీ అధికుడు గానీ లేడు, అని శ్రుతి. "పద్మలోచను"డు:- కమలాల వంటి కన్నులు కలవాడు. "కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" శ్రుతి.

ఈ శ్లోకంలో "క్రియాగుప్తం" అనే శబ్ద చిత్రం ఉంది.

"ప్రతిభాయాః"- ఇదిక్రియాపదం. 'ప్రతి' పూర్వకమైన 'భా=దీప్తౌ' అనే ధాతువు యొక్క "ఆశీర్లిఙ్" మధ్యమ పురుషైక వచనాంతం. కాని, కొందరు ఆకారాంతస్త్రీలింగమైన 'ప్రతిభా' శబ్దం యొక్క షష్ఠీ విభక్త్యేక వచనాంత రూపమని భ్రమించి వంచితులవుతారు. కాబట్టి ఇది 'క్రియావంచనం' అనే ప్రహేళిక.

"క్రీడాగోష్ఠీ వినోదేషు తత్‌జ్ఞైరాకీర్ణ మంత్రణే।

"పరవ్యామోహనే చాపి సోపయోగా ప్రహేళికా॥" క్రీడాగోష్ఠీ వినోదాల్లోనూ, రహస్య సంభాషణలోనూ, పలువురున్నతావున పరవ్యామోహనంలోనూ ఉపయోగపడేది ప్రహేళిక.

"వంచితాన్యస్వరూపేణ యత్రశబ్దేన వంచనా"

శబ్దం, భావాన్ని మాత్రం సూచిస్తూ, అర్థస్వరూపాన్ని తెలియనివ్వకుండా వంచిస్తుంది.

"రసస్య పరిపంథిత్వాత్ నాలంకారః ప్రహేళికా!" కావ్యజీవితమైన రసానికి విరోధియైన ప్రహేళిక అలంకారం కాదు. కానీ, ఇది కావ్యాంతర్భూతమే, అన్నారు లాక్షణికులు. సాధారణంగా 'చిత్రప్రబంధం' 'శబ్దక్రీడ' యే (words game) కాని, 'రసఖండం' కాదనడం వాస్తవం. అనుష్టుప్ ఛందం.

917. యామః శ్రయతి యాంధత్తేయైన యాత్యాయయాచ్చయా!
యాస్య మానాయయైవాన్యాసామా మవతు పాదుకా॥-7

**పద విభాగం** :- యాం, అః, శ్రయతి। యా; అం, ధత్తే। యా, ఏన, యాతి। ఆయ,యా। ఆత్,చ,యా। యా,

అస్య, మానాయ। యా,ఏ, వాన్యా। సా, మాం, అవతు, పాదుకా॥

**అర్థం :-** అః=విష్ణువు; యాం=దేనిని; శ్రయతి=ఆశ్రయిస్తాడో।

యా=ఏది; అం=విష్ణువును; ధత్తే=ధరిస్తుందో। యా=ఏది; ఏన=విష్ణువుచేత; యాతి=పయనిస్తుందో।

యా=ఏది; ఆయ=విష్ణువు కోసం; (ఉందో)।

యా,చ=ఏదైతే; ఆత్=విష్ణువు వల్ల; (ఆయెనో)।

యా=ఏది; అస్య=విష్ణువు యొక్క; మానాయ=పూజకోసం, (ఉందో)। యా=ఏది; ఏ=విష్ణుభగవానుని విషయమై; వాన్యా=భజింపదగినదో। సా=ఆ, పాదుకా=పాదరక్ష; మాం=నన్ను; అవతు=రక్షించుగాక।

**తా॥** విష్ణుమూర్తి పాదుకను ఆశ్రయిస్తాడు. పాదుక విష్ణుమూర్తిని ధరిస్తుంది. పాదుక భగవంతునికి అధీనమై, అతనితో కూడి నడుస్తుంది. పాదుక భగవంతుని కొరకే శేషభూత. పాదుక భగవంతుని వల్ల అధిక సత్త కలిగి ఉంది. పాదుక భగవంతునికి పూజలో పుష్పంలాగా సమర్పింపబడుతుంది. పాదుక భగవద్విషయంగా భజింపదగినది. ఆ ప్రసిద్ధపాదుక నన్ను కాపాడుగాక.

వ్యాఖ్య :- భగవద్వాచకమైన 'అ' శబ్దాన్ని ఏడు విభక్తులలో ప్రయోగించి, భగవంతునికి శేషభూతయైన పాదుకాదేవిని ప్రార్థించారు దేశికులు

"యో వేదాదౌ స్వరఃప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః।

తస్య ప్రకృతి లీనస్యయః పరస్స మహేశ్వరః॥" (శ్రుతి.)

వేదాధ్యయనానికి మొదట, చివరకూడా 'ఓమ్' ఉచ్చరించడం విధి. 'ఓమ్' అంటే ప్రణవం. ఆ ప్రణవానికి ప్రకృతియైన అకారం చేత వాచ్యుడు భగవానుడు. "అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకేశ్వరో హరిః"-(స్మృతి). "అక్షరాణా మకారోఽస్మి" (భ.గీత.) "అకారార్థో విష్ణుః". 'అ' శబ్దం యొక్క సప్త విభక్తుల ఏకవచనాంత రూపాలు ఈ శ్లోకంలో ఉన్నాయి.

"అః, అం, ఏన, ఆయ, ఆత్, అస్య, ఏ"- వీటితో ఏడువాక్యాలు కల్పింపబడినాయి.

"వాన్యా":- "వన షణ- సంభక్తౌ" అనిధాత్వర్థం. "ఋహలోర్ణ్యత్" అనే వ్యాకరణ ప్రక్రియ వల్ల 'ణ్యత్' ప్రత్యయం చేరగ ఏర్పడిన రూపమిది. 'భజనీయ' అనే అర్థం కలిగిన ఈ పదం పాదుకకు విధేయ వివేషణంగా ఉంది.

"వివక్షితానేక నామ వంచనం" అనే శబ్దచిత్రమిది. ఈ వంచన సార్వ విభక్తికం. ఏడువాక్యాల్లో చెప్పగోరిన పదాలు స్పష్టంగా తెలియక, చెప్పగోరని వేరే పదాల భ్రాంతిని కలిగిస్తుంది కదా ఈ శ్లోకం. "ప్రతిభాయాః" అనే ఆరవ శ్లోకం కంటెను, విచ్ఛిత్తి విశేషశాలియైన మరొక ప్రహేళిక ఇది. అనుష్టప్ ఛందం.

918 చర్యానఃశౌరి పాదు! త్వంప్రాయశ్చిత్తేష్వనుత్తమా।
నివేశ్యసే తతః సద్భిః, ప్రాయశ్చిత్తేష్వనుత్తమా॥-8

**అర్థం** :- హేశౌరిపాదు=ఓ భగవత్పాదుకా! త్వం=నీవు; నః=మా యొక్క; ప్రాయశ్చిత్తేషు=పాపాలను తొలగించే కర్మల యందు; అనుత్తమా=ఉత్కృష్టతమమైన; చర్యా=క్రియా రూపవు, తతః=అందువల్ల; అనుత్త, మా=నిరసింపబడని; లక్ష్మిగల, నీవు; ప్రాయః=తరచుగా; సద్భిః=సాధుజనులచేత; చిత్తేషు=మనస్సులందు; నివేశ్యసే=ప్రవేశింప బడుతుంటావు.

**తా॥** ఓ శౌరి పాదుకా! నీవు అనాది సంసారం వల్ల ప్రవర్తించిన పాపాలు గల మా యొక్క పాపాలను తొలగించే కర్మలయందు సర్వోత్కృష్టమైన ప్రాయశ్చిత్త క్రియారూపవు. కాబట్టి, భగవంతుని చరణాలకు పరిచరణ (సేవ) చేసే సమయాలలో లక్ష్మీదేవిని ఆదరించే నీవు ప్రాయశ్చిత్త పరులైన సత్పురుషులచేత బహుశః హృదయాల్లో ప్రవేశింపబడుతావు.

వ్యాఖ్య :- సత్పురుషులు ప్రాయశ్చిత్తం కోసం పాదుకను ధ్యానిస్తారు.

పాపాలను చేసి శిక్షలను తప్పించుకొనే వారికి పాపపరిహారం కానే కాదు. నిత్తనైమిత్తిక కర్మలను చేస్తుంటే మంత్రలోపం గానీ, స్వర, వర్ణలోపంగానీ, కర్మలోపంగానీ- మంత్రపఠనం చేస్తూ దానికి విధించిన క్రియను ఆచరించక పోవడంగానీ సంభవిస్తే దోషం చుట్టుకొంటుంది.

"ఫలంకతక వృక్షస్య యద్యప్యంబు ప్రసాదకం।

ననామగ్రహణాదేవ తస్యవారి ప్రసీదతి"॥ (ప్రాయశ్చిత్తకాండ)

కతకమంటే చిల్లజంజ పండు (గింజ). దీన్ని నూరి నీళ్ళల్లో వేస్తే నీళ్ళు స్వచ్ఛ పడుతాయి. కాని 'కతక' మనే పేరుచెప్పినంత మాత్రాన నీళ్ళు స్వచ్ఛ (తేట) పడవుకదా! కాబట్టి మంత్రపఠనంతో పాటు విధ్యుక్త కర్మను ఆచరించాలి. లేనిచో పాపం అంటుకొంటుంది. ఈ విధమైన పాపాలను తొలగించుకోవడానికి ప్రాయశ్చిత్తకర్మ(ల)ను సజ్జనులు ఆచరిస్తారు.

"ప్రాయోనామ తపఃప్రోక్తం, చిత్తం సంయమ ఉచ్యతే।

తపస్సంయమ సంయుక్తం ప్రాయశ్చిత్తం విదుర్బుధాః॥ (ప్రా.కాండ.)

'ప్రాయః అంటే తపస్సు, 'చిత్త' మంటే నిగ్రహం. ఈ రెండు శబ్దాల కలయికయే 'ప్రాయశ్చిత్తం' అని నిర్వచింపబడినది. 'తపస్సు' అంటే జ్ఞానం గల వ్యక్తి ఫలాపేక్షలేకుండా ఏకాగ్రతతో ఆచరించే కర్మ; "తపసాకిల్బిషంహంతి' ' అనే మనువాక్యం, తపశ్శబ్దం కర్మవాచకమనడానికి ప్రమాణం. కాబట్టి, పాదుక పాపాపనోదనమైన కర్మరూప. ఈ చర్య అనుత్తమమైనది. (ఉత్తమం నవిద్యతే యస్యాఃసా) దీని కంటే ఉత్తమమైనది లేదని అర్థం.

పాదుకాదేవి, లక్ష్మీదేవి భగవంతుని పాదసేవచేస్తుంటారు. అందు వల్ల ఒండొరుల పై అసూయలేనేలేదు. కాబట్టి, పాదుకాదేవి (చతుర్థపాదంలో) 'అనుత్తమ' అనబడినది. లక్ష్మీదేవిని గౌరవించేదని అర్థం.

"నుద-ప్రేరణే" అనే ధాతువువల్ల, కర్మార్థకమందు 'క్త' ప్రత్యయం చేరగా 'నుత్తా' రూపమేర్పడింది. నత్వం వికల్పితం, నత్వం కల్పిస్తే 'అనుత్తా' రూపం సిద్ధిస్తుంది. న+నుత్తా=అనుత్తా। 'మా' అంటె లక్ష్మీదేవి. "ఇందిరాలోకమాతామా' (అమరకోశం) "అనుత్తా, మా, యయాసా=అనుత్తమా! అని విగ్రహవాక్యం. లక్ష్మీచేత ఆదరింపబడేది. పాదుక, అని భావం ("అం నుదతీతి=అనుత్। అతిశయేన, అనుత్=అనుత్తమా।" అని శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్య స్వామివారి ద్రమిడవ్యాఖ్యానంలో ఉంది.)

శ్రుతులూ, స్మృతులూ భగవంతుని ఆజ్ఞారూపాలు. శాస్త్రంలో చెప్పబడిన రీతిగా-ధర్మనిర్వహణకోసం-కర్మలను ఆచరించాలి.. భగవంతుని అనుగ్రహం కలుగుతుంది. తత్ఫలితంగా సుఖశాంతులు లభిస్తాయి. విధ్యుక్తమైన స్వధర్మాన్ని చక్కగా నెరవేర్చని వారు భగవంతుని నిగ్రహానికి (గురి) పాత్రులవుతారు. తత్ఫలితంగా ఆధివ్యాధులతో బాధపడుతారు. దుస్థితి ఏర్పడుతుంది.

"గౌరవాద్యదపిజాతు మంత్రిణాం
దర్శనం ప్రకృతి కాంక్షితం దదౌ।
తద్గవాక్ష వివరావలంబినా
కేవలేన చరణేన కల్పితమ్॥ (రఘువంశం)

ఉత్తమ చరిత్రగల సూర్యవంశపు రాజులలో కడపటివాడైన అగ్నివర్ణుడు ప్రజారంజకంగా తన ధర్మాన్ని నిర్వహించలేదు. "రాజా ప్రకృతి రంజనాత్"- ప్రకృతి అంటె ప్రజ. ప్రజలను రంజింపచేసే రాజకార్యాలను వదలి, అంతఃపురంలో ప్రియురాండ్రతో కాలం గడిపేవాడు. ప్రజలు రాజును దర్శించడానికి ఎంతోకాలం నుంచి అపేక్షించినా, దర్బారుకు వచ్చి తన దర్శనాన్ని వారికి కలిగించనే లేదు. ప్రజల కోరికను త్రోసివేయడం అసాధ్యమని అందరు మంత్రులు రాజుకు తెల్పినప్పుడు, ఆయన "కిటికీలో నుంచి బయటకు చాచిన తనకాలును దర్శించి పొండు" అని ప్రజలను ఆదేశించాడట. ఇంత దుఃస్థితికి దిగజారిన అగ్నివర్ణుడు స్త్రీలోలుడై క్షయవ్యాధితో మరణించాడు. కర్మఫలానుభవమే కదా ఇది.

"పరమ పురుషారాధన, తద్విపర్యయ రూపే కర్మణీ పుణ్యపాపే; తదనుగ్రహ నిగ్రహాయత్తేచ తత్ఫలే" (శ్రీభాష్యం.)

భగవంతునికి ప్రీతికరమైన కార్యం పుణ్యమనీ, భగవంతుని నిగ్రహానికి హేతువైన కార్యం పాపమనీ, భగవద్రామానుజులవాణి. "యత్త్వత్ప్రియం తదిహ పుణ్యమపుణ్యమన్యత్"- అని "అతిమానుషస్తవం"లో ఈ విషయాన్నే శ్రీ కూరేశులు తెలిపారు. కాబట్టి, శాస్త్రంలో చెప్పినట్లు ఆచరించినా, హరినామాన్ని స్మరించినా పాపంపరిహారమవుతుంది.

"సాంకేత్యం పరిహాస్యంవా స్తోభం హేళనమేవవా।

వైకుంఠనామగ్రహణమశేషాఘహరం విదుః॥" (అజామిళో పాఖ్యానం)

ఇతరులకు చూపడానికైనా, నవ్వులాటగానైనా, దుఃఖంతోనైనా, దెప్పడానికైనా నారాయణుని నామాన్ని స్మరిస్తే సర్వపాపాలు తొలగుతాయి. ఇతరులకు భగవంతుని పేరు పెట్టి పిలిస్తే సాంకేత్యం' అని సంజ్ఞ.

అజామిళుడు తన పుత్రుణ్ని 'నారాయణ' అని పిలిచిముక్తుడయ్యాడు. సత్పురుషులు ప్రాయశ్చిత్తానుష్ఠాన మూవికలమైనప్పుడు, ఆప్రాయశ్చిత్తం కోసం పాదుకాదేవిని ధ్యానిస్తారు. విశ్వానికాధారుడైన శ్రీరంగనాథునికీ ఆధారమైన పాదుకాదేవిని సత్పురుషులు తమ హృదయంలో నిల్పుకొని అంతర్ముఖులై ఏకాగ్రతతో ధ్యానించడం వల్ల, పరబ్రహ్మోపాసనకు ప్రతిబంధకంగా ఉండే సర్వపాపాలు నశిస్తాయి.

ఇది "పాదావృత్తి యమకం" అనే శబ్దాలంకారం.

"యమ ఏవ ప్రకృతిః యస్యతత్=యమకం" స్వరవ్యంజనాల జంటయే ప్రకృతిగా కలది యమకమని వ్యుత్పత్తి. "సమానార్థకత్వాభావవత్ సమానాను పూర్వికానేక వర్ణావృత్తిర్యమకం" సమానార్థకాలు కానట్టి సమానవర్ణాల ఆవృత్తి యమకం. యమకాలంకారం అనేక భేదాలు కలది.

"అవ్యపేతవ్యపేతాత్మాయావృత్తిర్వర్ణసంహతేః। యమకం తచ్చ పాదానా మాదిమధ్యాన్తగోచరమ్। ఏక ద్విత్రిచతుష్పాదయమకానాం వికల్పనాత్। ఆది మధ్యాన్త మధ్యాద్య మధ్యమాద్యన్త సర్వతః। అత్యంత బహవస్తేషాం భేదాః సంభేదయోనయః॥"

ఈ శ్లోకంలో రెండవపాదమే నాల్గవపాదంగా ఆవృత్తి అయింది. కాబట్టి ఇది "సందష్టయమకం". పదాలు ఒక్కరీతిగానే ఉన్నా, అర్థం వేర్వేరుగా ఉంటుంది. అలాగా ఉండకుంటే పునరుక్తి దోషం కలుగునుకదా! అనుష్టుప్ ఛందం.

*919. రామపాదగతాభాసా, సాభాతాగదపామరా।*
*కాదుపానఞ్చకాసహ్యా, హ్యాసకాఞ్చనపాదుకా॥-9*

**అర్థం** :- రామపాదగతా=శ్రీరాముని పాదాలయందుండు నట్టిది, భాసా=కాంతిచేత; భాతా=ప్రకాశిస్తున్నది. గద పామరా/గద=వ్యాధులనుంచి; ప=రక్షింపబడే; అమరా=దేవతలు కలిగినది/అగదపామరా=రోగాలులేని పామర జనులు గలది; సా=ఆ; కాంచనపాదుకా=బంగారు పాదుక; కాత్=బ్రహ్మనుంచి; ఉప+ఆనంచ=(అయోధ్యకు) వచ్చెను. క+అసహ్యా=సూర్యునికి సహింప శక్యం కానిదై; ఆస=(ప్రకాశిస్తు) ఉండెను. హి=ప్రసిద్ధంకదా!

**తా॥** శ్రీరాముని పాదాలను ఆశ్రయించిన బంగారు పాదుక స్వీయకాంతిచే మిక్కిలి ప్రకాశించేది. దేవతలను వారి విరోధుల వల్ల కలిగే మానసిక వ్యాధుల నుంచి రక్షించేది. ఆగదపామరులు కలది-పాదుకను ఉపాసిస్తూ జ్ఞానానుష్ఠానాలు లేని పామరజనులకు వ్యాధులు రాకుండా సుఖాన్ని కలిగించేది. చతుర్ముఖ బ్రహ్మచేత,

ఆరాధింపబడే శ్రీరంగనాథుడు సూర్యవంశస్థుడైన ఇక్ష్వాకు మహారాజుకు ప్రసాదించబడడం వల్ల పాదుక అయోధ్యకు చేరుకొన్నది. అయోధ్యలో సూర్యునికన్న ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూ ఉండింది.

వ్యాఖ్య :- భగవత్పాదుకా మహిమ వర్ణితం.

శ్రీరంగనాథునితో పాదుక, సత్యలోకం నుంచి అయోధ్యకు చేరుకొన్న విషయం 'శ్రీరంగనాథ మాహాత్మ్యం'లో ప్రసిద్ధమే. 'క' అంటే నానార్థాలున్నాయి. ఇక్కడ 'సూర్యుడు, బ్రహ్మ' రెండర్థాలనే గ్రహించాలి (కః=పులింగమందు.)

"మారుతే వేధసి బ్రధ్నే పుంసికః, కంశిరోఽంబునోః" (అమరకోశం)

అన్వయభేదాలు :-

ఆగదపామరా/(గదం=వ్యాధిని; పాంతి=రక్షించేవారు;) గదపాః=దోషరూపమైన మనోవ్యాధిని కలిగించే విరోధులు. న, గదపాః=అగదపాః: విరోధులులేని; అమరాఃయస్యాఃసా। దేవతలు కలది, పాదుక, అని అర్థం. బహువ్రీహి సమాస పదం ఇది. దేవతలకు విరోధులైన వారిని నివర్తింపచేసే మహిమకలది పాదుక; అని భావం. 'భాసా=కాంతిచేత; (కస్య ఆసహ్యా) క+అసహ్యా=సూర్యునికి సహింపశక్యంకానిది. సూర్యుని కన్న మిక్కిలి తేజస్సుతో కూడినది, పాదుక।

ఉప+ఆనంచ=(లిట్) భూతకాలక్రియా పదం, ప్రథమ పురుషైక వచనాంతం. (ఉపపూర్వాదంచతేర్లిట్)। భాతా=తెలియబడినది; ఆస=ఆయెను. (తిజన్తప్రతి రూపకమైన అవ్యయం ఇది.) ఇలాగా, శ్రీ భారద్వాజ శ్రీనివాసాచార్య వ్యాఖ్యకలదు.

ఇక, శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్య వ్యాఖ్య ఇలాగా ఉంధి.

"సాభాతాగదపా మరా" అనేది సమాసపదం. స+ఆభ=ప్రకాశంతో కూడిన; అత=సంచారమందు; అగద=రోగం లేకుండా; ప=రక్షించే; అమరా=దేవతలు కలది, పాదుక। కాత్=బ్రహ్మను పొందినది. చతర్ముఖ బ్రహ్మచే ఆశ్రయింపబడినది పాదుక, అనిభావం/ఉపా/ఉం=రుద్రుణ్ని; పా=రక్షించేది. (932 శ్లోకం రీతిగా ఉంది ఇది)। లేదా; కాత్=సుఖహేతువుగ; ఉం=అయోధ్యా రాజ్యలక్ష్మిని; పా=కాపాడేది। "అనంచకా సహ్యా, ఆస" అని మరొక వాక్యం। ఆనంచకైః అసహ్యా=అనంచకాసహ్యా, అని విగ్రహ వాక్యం। అనంచక=ఆరాధించని వారిచే సహింపశక్యం కానిదై; ఆస=ఉండెను.

పాండిత్య ప్రకర్షచేత కలిగిన ఆన్వయభేదాలవల్ల, పాఠకులకు చాలా లాభమేకదా!

ఇది "పాదానులోమ ప్రతిలోమ యమకమ్" అనే శబ్దచిత్రం ఈ శ్లోకంలోని మొదటి పాదాన్ని క్రింది నుంచి మీదికి చదివితే, రెండవ పాదం అవుతుంది. అలాగే అనులోమంగ ఉన్న మూడవ పాదం ప్రాతిలోమ్యంగా ఆవృత్తి అయితే, నాల్గవ పాదం అవుతుంది.

"ప్రాయశో యమకే చిత్రే రసపుష్టిర్నదృశ్యతే" "బహుశః 'యమకం'లో రసపుష్టి లేదు, ఉండదు"- అన్నాడు శ్రీ

విద్యాధరుడు.

"ఆవృత్తిః ప్రాతిలోమ్యేన పాదార్ధశ్లోకగోచరా।

యమకం ప్రతిలోమత్వాత్, ప్రతిలోమ మితిస్మృతమ్॥" అని ఈ 'ప్రతిలోమ యమక' లక్షణం. అనుష్టుప్ ఛందస్సు.

*920. బాధా ఘాళీర్ఝాటతుచ్ఛే గాధాభానాయపుల్లఖే।*
*సమాధౌశఠజిచ్చూడాం వృణోషిహరిపాదుకే॥-10*

**అర్థం** :- హే హరిపాదుకే=ఓ హరిపాదుకా। బాఢాఘాళీర్ఝాటతుచ్ఛే। బాఢ=దృఢమైన; అఘ+ఆళీ=పాపాల సమూహమనే; ఝాట=అడవిచేత; తుచ్ఛే=శూన్యమైన; పుల్ల=వికసించిన; ఖే=మనోరూపమైన ఇంద్రియం గల; సమాధౌ=మానససాక్షాత్కారమనే యోగ నిష్ఠయందు; గాథా+ఆభానాయ=దివ్యప్రబంధంలోని పద్యాల (పాశురాల)ను ప్రకాశింపజేయడానికి; శఠజిత్+చూడాం=నమ్మాళ్వారు యొక్క తలను; వృణోషి=ఎన్నుకొంటున్నావు.

**తా॥** ఓ భగవత్పాదుకా। దృఢమయిన పాపసముదాయమనే అడవిలేనట్టి, వికసించిన మనస్సుగల సమాధి యోగమందు దివ్యప్రబంధాన్ని ప్రకాశింప జేయడానికి నీవు శఠకోపసూరి శిరస్సును వరిస్తున్నావు.

వ్యాఖ్య :- యోగనిష్ఠుడైన శఠకోపసూరి, తన శిరస్సున పాదుక(ల)ను ధరించాడు.

శఠకోపసూరి అవతరించినప్పటి నుంచి యోగనిష్ఠలోనే కాలం గడిపారు. వారికి పూర్వాఘాల, ఉత్తరాఘాల సంసర్గమే లేదు. అంటే వారు పాపకర్మలనే అడవిలో సంచరించలేదు. యోగాభ్యాసంలో (అష్టమ) చివరి అంగం 'సమాధి'. 'మా' అంటే లక్ష్మి. మాతోకూడి యుండేవాడు 'సమః'. సముడంటే శ్రియఃపతి. "సమః ఆధీయతే అత్ర"= సమాధిః. యోగనిష్ఠయందు పుష్పించిన మనస్సు భగవంతుని సాక్షాత్కారాన్ని పొందుతుంది.

పాదుకాదేవి శఠకోపసూరి యొక్క ఉత్తమాంగమందు (తలమీద) చేరి ద్రమిడవేదాంతమనే దివ్యప్రబంధాన్ని ప్రకాశింప జేసింది.

"శెలుమ్బుఅవై తానేఱి త్తిరివాన తాళిణైయెన్ తలైమేలే" (తిరువాయ్ మొళి. 10.6.5) "సుందరుడైన గరుత్మంతుని మీద తానెక్కి సంచరించే శ్రియఃపతి యొక్క పాదయుగళి నా తల మీద ఉన్నది".

"తలైమేల తాళిణైగళ్ తామరైక్కణెన్నమ్మాన్

నిలైపేరా నెన్నెంజత్తు ఎప్పొళుదు మెమ్బెరుమాన్" (10-6.6.)

"భగవంతుని రెండు పాదాలు నా శిరస్సు నందున్నాయి. పుండరీకాక్షుడు, నా స్వామి నా మనస్సులో తొలగక సర్వదా నివసించాడు. ఆయన తన మహిమనూ కనబరచాడు" అన్నారు నమ్మాళ్వార్లు.

ఒకే సమయాన తలమీద, మనస్సులోనూ భగవంతుడు ఎలా ఉంటాడు? అంటే; 'సౌభరి' అనే ఋషి

యాభైరూపాలను దాల్చినాడు. శ్రీకృష్ణుడు (16) పదారువేల గోపికలకు పదారువేల రూపాలతో వెలసినట్లు, భగవంతుడు ఆళ్వార్లను అనుభవించడానికి అనేక రూపాలను దాల్చాడు, అని శ్రీనంబిళ్లగారి వ్యాఖ్య.

ఈ శ్లోకమందున్న 'అఘ' శబ్దానికి 'దుఃఖం, పాపం, వ్యసనం, అని అనేకార్థాలున్నాయి. "దుఃఖైనో వ్యసనేష్వఘం" (అమరకోశం). 'ఝాట' పదానికి 'పొదరిల్లు, అడవి, వ్రణ సంమార్జనం' అని అర్థాలు. "ఝాటోనికుంజే కాంతారే వ్రణసంమార్జానేఽపిచ" (విశ్వనిఘంటువు). 'ఖం' అంటే 'ఇంద్రియం'. "ఇంద్రియేఽపిఖం" (అమరం)

భగవత్పాదాలను ధరించే పాదుకయే శఠకోపసూరి యొక్క దివ్యస్వరూపమనీ, పాదాలున్న చోటు శిరస్సు అనడం వల్ల "శఠారి" స్మారితం, అని శ్రీ భారద్వాజ శ్రీనివాసాచార్య వ్యాఖ్య.

పాదుకా మూర్త్యంతరమే శఠకోపసూరి. (నమ్మాళ్వార్లు) దివ్యప్రబంధంలో, నమ్మాళ్వార్లు పాదుక(ల)ను ధరించినట్లు లేదు. పైగా, 'వృణోషి' అని (లట్) వర్తమానకాలక్రియా పదం యొక్క మధ్యను పురుషైక వచనాంతంకదా!

శ్రీమన్నాథమునులు యోగనిష్ఠులైప్పుడు, పాదుకాదేవి దివ్యప్రబంధాన్ని ప్రకాశింపజేయడం కోసం, శ్రీ శఠకోపసూరి యొక్క రూపాన్ని దాల్చి నాథమునులకు సాక్షాత్కరించింది. శ్రీమన్నాథమునులు ఆ శఠారిని హర్షాతిరేకంతో శిరస్సున ధరించాడు. తత్ఫలితంగా, ఈనాడు కూడా ప్రతిభక్తుని తలమీద పాదుక (శఠారి) చేరే వేడుక కలిగి ఉంటున్నది. ఈ సంప్రదాయార్థం స్వరసంగా ఉంటుందని శ్రీ ఉత్తమూర్ వీరరాఘవాచార్యుల వారి సంస్కృతటిప్పణి.

ఈ శ్లోకంలో "అపునరుక్త వ్యంజనమ్" అనే శబ్దచిత్రం ఉంది. చెప్పిన అక్షరాన్ని తిరిగి-మళ్ళీ-చెప్పక శ్లోకాన్ని రచిస్తే అది 'అపునరుక్తవ్యంజనం' అనే శబ్దచిత్ర లక్షణం.

"స్వరాణాం వ్యంజనానాం వాయత్రావృత్తిర్నలక్ష్యతే।

అనావృత్తార్ణకం తజ్ఞాః శబ్ద చిత్రం ప్రచక్షతే॥"

***921. సా భూపా రామపారస్థా, విభూపాస్తి సపారతా।***
***తారపా సకృపా దుష్టి పూరపారామపాదుకా॥-11***

**అర్థం :-** భూపా=భూమిని పాలించేది; రామపారస్థా=రామరూపమైన మర్యాద యందు ఉండేది; విభు+ఉపాస్తి, సపారతా=భగవదుపాసనకు ఎల్ల అయినట్టిది; తారపా=ప్రణవార్థమైన పరబ్రహ్మను కాపాడేది; సకృపా=దయతో కూడిన; సా=ఆ (ప్రసిద్ధమైన); రామపాదుకా=శ్రీరాముని పాదుక; దుష్టి పూరపా=దోషప్రవాహాన్ని త్రాగుతుంది; దోషాలను నశింపజేసేదని భావం.

**తా॥** పాదుకాదేవి భువనాన్ని పాలిస్తుంది. రాముడు అనే మర్యాదా స్థాపకుని యందు ఉంటుంది. భగవదుపాసన

యొక్క ఫలరూప (ం) పాదుక. పరమాత్ముణ్ణి సంచరించేవేళల్లో కంటకాదుల నుంచి కాపాడుతుంది. దయావతి కాబట్టి ఆశ్రితుల దోషాలను సహిస్తుంది శ్రీరామపాదుక.

వాఖ్య :- పాదుక ఆశ్రితాపరాధసహిష్ణువు.

అర్చావతారాల్లో మధ్యమలోకాన్ని రక్షిస్తుండేది పాదుక. శ్రీరాముడు భూపాలుడు. మర్యాదాపురుషోత్తముడైన శ్రీరాముని అనతిచేత పాదుక ఆయన కంటె ముందే భూమిని (కోసలదేశాన్ని) పాలించింది. కష్టాల కడలికి గట్టు అవడంచే శ్రీరాముడే పారం. "పారం పరం విష్ణురపారపారే" అని బ్రహ్మాపారస్తవం.

"పరిగత వృషశైలం పారమ్" అనే ప్రకారంగా శ్రీరామరూపపార మందు ఉండేది పాదుక. పరబ్రహ్మోపాసనకు ఫలరూపయైనది కూడా పాదుకయే. ప్రణవప్రతిపాద్యుడైన పరమాత్ముడు పయనించే సమయంలో ఆయన పాదాలకు రాయి-రప్పతగులకుండా వాటిని రక్షిస్తుంది. తనను ఆశ్రయించిన వారి దోషాలు కననేబడవు, ఒక వేళ కనబడినా, వాటిని దిగమ్రింగుతుంది అంటే క్షమిస్తుంది. కాబట్టి శ్రీరామపాదుక ప్రసిద్ధమయినది కదా!

ఈ శ్లోకంలో "రామపారస్థా, రామపాదుకా" అని రామశబ్దం రెండుసార్లు ఉంది. కాబట్టి, "ఆరామపారస్థా' 'అని పదవిభజన జేస్తే "పునరుక్తి" లేకుండా సరిపోతుంది కదాః అన్నారు శ్రీ ఉత్తమూర్ వి. రాఘవాచార్యస్వామి వారు. (ద్రమిడవ్యాఖ్య) దీని రీతిగా, "ఆరామం" అంటే జీవునికి భోగ్యమైన వస్తువు. "ఆరామమస్య పశ్యంతి నతం పశ్యంతి కశ్చన" అని ఉపనిషద్వాణి. ఆరామమనే పారమందు ఉండేది పాదుక. భగవంతుని చరణయుగళిని ఆశ్రయించి పాదుక ఉంటుందని అర్థం. పాదుకాసంబంధం లేకుంటే భగవదుపాసన పూర్ణం కాదనడం వాస్తవం.

"మురజ బంధ" మనే శబ్దచిత్రం ఉన్న శ్లోకం ఇది. అనుష్టుప్ ఛందం.

'మురజం' అంటె మద్దెల. మురజ చిత్ర లక్షణం ఇలా ఉంది

"తిర్యగ్రేఖా లిఖేత్ పంచ నవవా తత్ర పంక్తయః।

అష్టకోష్ఠాశ్చతస్రఃస్యు స్తాసుశ్లోకం లిఖేత్ క్రమాత్॥"



యథారీతిగా చదువ తగిన ఈ శ్లోకాన్ని కోష్ఠాల్లో కూర్చిన అక్షరాల ప్రకారం చదివితే, అదేశ్లోకం రెండుసార్లు ఆవృత్తమవుతుంది.

"మురజ బంధ" శబ్దచిత్రోద్ధారం :-

"ఆద్యాంఘ్రి రాద్యయోః పంక్త్యోర్వాచ్యో గోమూత్రికాక్రమాత్।
కించైకం ద్వితయం ద్వైతం ద్వయమేకద్వయోరపి।
స్వపంక్తి ప్రక్రమాదేవం విన్యాసద్వితయంభవేత్।
ఏవం తృతీయతుర్యాంఘ్రీ స్వపంక్త్యోస్తదనుక్రమాత్॥"

ఈ శ్లోకం యొక్క పూర్వార్థంలోని అక్షరాలను గోమూత్రికాబంధంవలె, కొంచెం భేదంగా, కూర్చినట్లైతే రెండుపాదాలు పూర్తియవుతాయి. అలాగే ఉత్తరార్థంలోని అక్షరాలను కూర్చగా రెండు విన్యాసాలవుతాయి. అంటే, మొదటి పాదంలోని మొదటి అక్షరాన్ని మొదటి వరుసలో, రెండవ, మూడవ అక్షరాన్ని రెండవ వరుసలోనూ; నాల్గవ, ఐదవ అక్షరాన్ని మళ్ళీమొదటి వరుసలోనూ, ఆరవ, ఏడవ అక్షరాన్ని మళ్ళీ రెండవ వరుసలోనూ; ఎనమిదవ అక్షరాన్ని మళ్లీ మొదటి వరుసలోనూ కూర్చి ప్రథమ పాదాన్ని చదువవలెను. అలాగే రెండవ పాదంలోని మొదటి అక్షరాన్ని రెండవ వరుసలోనూ, రెండవ, మూడవ అక్షరాన్ని మొదటి వరుసలోనూ; నాల్గవ, ఐదవ అక్షరాన్ని మళ్ళీ రెండవ వరుసలోనూ, ఆరవ, ఏడవ అక్షరాన్ని మళ్లీ మొదటి వరుసలోనూ; ఎనమిదవ అక్షరాన్ని మళ్లీ రెండవ వరుసలోనూ కూర్చి ద్వితీయ పాదాన్ని పఠించవలెను.

ఇలాగే మూడవ వరుసలోని మొదటి అక్షరం మొదలుకొని నాల్గవ పంక్తిని కూడా, ప్రథమ పాదం వలె పూరిస్తే, తృతీయ పాదం చదువవచ్చును. నాల్గవ వరుసలోని ప్రథమాక్షరం మొదలు మూడవ వరుసలోనూ ద్వితీయ పాదం వలె అక్షరాలను సంకీర్ణం చేస్తే, చతుర్థపాదం చదువనగును.

మరొక విధంగా పఠించే నియమం :-

1. *"ఆద్యాంఘ్రిః ప్రథమాదౌస్యాత్ ద్వితీయస్త్రిస్త్రిస్తురీయకే।*
*చతుర్థం పంచమంచ త్రిషష్ఠం చాథద్విసప్తమమ్।*
*ప్రథమాయాం తతః పంక్తౌ ద్రష్టవ్యంచరమాక్షరమ్॥"*

**అర్థం** :- మొదటి వరుసలోని మొదటి అక్షరాన్ని, రెండవ వరుసలోని రెండవ అక్షరాన్ని, మూడవవరుసలోని మూడవదాన్ని, నాల్గవ వరుసలోని నాల్గవ, అయిదవ అక్షరాన్ని, మళ్ళీ మూడవ వరుసలోని ఆరవ అక్షరాన్ని, రెండవ వరుసలోని ఏడవ అక్షరాన్ని, మొదటి వరుసలోని ఎనిమిదవ అక్షరాన్ని గ్రహించి ప్రథమపాదం చదువదగినది.

ద్వితీయ పాదం :-

2. *"ద్వితీయాంఘ్రిర్ద్వితీయాదావాద్యే ద్విత్రీ ద్వితీయకే।*
*తృతీయే తుర్యకే ద్విత్రీ తృతీయాద్యంచ వాచయేత్॥"*

**అర్థం** :- రెండవ పంక్తిలోని మొదటి అక్షరాన్ని, మొదటి పంక్తిలోని రెండవ, మూడవ అక్షరాన్నీ, రెండవ పంక్తిలోని నాల్గవ మరియు మూడవ పంక్తిలోని నాల్గవ అక్షరాన్ని, నాల్గవ పంక్తిలోని మూడవ, రెండవ అక్షరాన్నీ, మూడవ పంక్తిలోని మొదటి అక్షరాన్ని గ్రహించి, ద్వితీయపాదం చదువదగినదని నియమం.

తృతీయ పాదం:-

3. *"తృతీయోఽంఘ్రిర్ద్వితీయాంతే ఆద్యసప్తమషష్ఠయోః।*
*ద్విత్రి పంచమయోస్తుర్య షష్ఠ సప్తమయోః క్రమాత్*
*తృతీయాంత్యేచ లక్ష్యాయాం బంధో మురజసంజ్ఞికః॥*

**అర్థం** :- రెండవ పంక్తిలోని ఎనిమిదవ అక్షరాన్ని, మొదటి పంక్తిలోని ఏడవ, ఆరవ అక్షారాన్నీ, రెండవ పంక్తిలోని ఐదవ అక్షరాన్ని, మూడవ పంక్తిలోని అయిదవ అక్షరాన్నీ, నాల్గవ పంక్తిలోని ఆరవ, ఏడవ అక్షరాన్ని, మూడవ పంక్తిలోని ఎనమిదవ అక్షరాన్నీ గ్రహించి, తృతీయ పాదంచదువదగినది. ఈ విధంగా ద్వితీయ, తృతీయ చరణాలు వృత్తాకారంగానూ చదువ శక్యమైనవి.

చతుర్థపాదం :-

4. *"తుర్యాంఘ్రిస్తు తదాదౌస్యాత్ త్రిద్విద్విత్ర్యాద్య తుర్యకే।*
*తత్పంచమే ద్విషష్ఠే త్రిసప్తమే తుర్యకాంతిమే॥"*

**అర్థం** :- నాల్గవ వరుసలోని ప్రథమాక్షరాన్ని, మూడవ వరుసలోని ద్వితీయాక్షరాన్ని, రెండవవరుసలోని తృతీయాక్షరాన్ని, మొదటి వరుసలోని చతుర్థ, పంచమాక్షరాలనూ, రెండవ వరుసలోని షష్ఠాక్షరాన్ని, మూడవ వరుసలోని సప్తమాక్షరాన్ని, నాల్గవ వరుసలోని అష్టమాక్షరాన్నీ గ్రహించి, చతుర్థపాదం పఠించదగినది.

ఈ 921 శ్లోకం, మురజ బంధవిన్యాస ప్రకారంగా రచింపబడినది.

***922. కారికానన యాత్రాయా యాగేయా స్యస్యభానుభా।***
***పాదపా హహ సిద్ధాసియజ్ఞాయ మమసాంజసా॥-12***

**అర్థం** :- యాత్రాయాః=సంచారానికి; న, కారికా,న=కారణమైన దానవుకాదనేది కాదు. భానుభా=సూర్యుని ప్రకాశంలాంటి ప్రకాశం గల; యా=ఏ నీవు; గేయా=గానయోగ్యురాలవై; అసి=ఉన్నావో; అస్య=ఈ భగవంతునియొక్క; పాదపా=పాద రక్షిణివైన; సా=అ, నీవు; అంజసా=శీఘ్రంగా; మమ=నా యొక్క; (నేను చేసే); యజ్ఞాయ=పూజకోసం; సిద్ధా+అసి=అనుకూలవై ఉన్నావు. హ, హ,=ఆహా! నా భాగ్యం.

**తా॥** భగవంతుని లీలా విహారానికి కారకురాలవుకాదనేది లేదు. భగవత్పాద సంబంధం వల్ల సర్వదా కీర్తింప దగినదానవు. సూర్యుని తేజస్సులాంటి తేజస్సు గల నీవెక్కడ? నేనెక్కడ? నేనాచరించే భగవదారాధన కోసం నీవు భగవత్సన్నిధిలో సిద్ధంగా ఉన్నావు. అహో! నా భాగ్యం. చాలా ఆశ్చర్యం.

వ్యాఖ్య :- భగవంతుని సంచారానికి కారకురాలైన పాదుకాదేవి,
కవి చేసే భగవదారాధనకు కూడా సిద్ధంగా ఉంటుంది.

ఎక్కడెక్కడ భగవదారాధన జరిగితే అక్కడక్కడ భగవత్సంచారానికి కారణభూతయైన పాదుక, కవి కర్తృక పూజయందు అమిత తేజస్సుతో కూడా సిద్ధంగా ఉంటుంది. "ద్రాక్ ఝటిత్యం జసాఽహ్నాయ". (అమరం). ఇది " **అనతిరిక్త పద పదర్థానులోమ ప్రతిలోమం"** అనే శబ్దచిత్రం. అనులోమ పాఠంలాగా ప్రతిలోమ పాఠంలో కూడా అవేపదాలు, అవే అర్థాలు ఉంటాయి.

"సాఞ్జసా మమ యజ్ఞాయ సిద్ధాసి హహపాదపా।

భానుభాస్యస్య యాగేయా యాత్రాయానన కారికా॥" అని, ఈ శబ్దచిత్ర లక్షణం.

***923. సరాఘవా శ్రుతౌదృష్టాపాదుకా సనృపాసనా।***
***సరాఘవాగతౌ శ్లిష్టా స్వాదుర్మే సదుపాసనా॥-13***

**అర్థం** :- శ్రుతౌ=వేదమందు; దృష్టా=కనబడేది; సరాఘవా=శ్రీరామునితో కూడి యుండేది; స నృపాసనా=రాజాసనం కలది; గతౌ=సంచారమందు; సరాఘవా=లాఘవం-వేగం-కలది; శ్లిష్టా=పరస్పరం కలిసి ఉండేది; సత్+ఉపాసనా=సత్పురుషులచే ఉపాసింపబడే; పాదుకా=పాదరక్షిణి; మే=నాకు; స్వాదుః=భోగ్యమైనది.

తా॥ శ్రుతిగోచరయై, శ్రీరామసహితయై రాజసింహాసనమందు అధిష్ఠించేది. భగవంతుని చరణ సంగతయై గమనమందు వేగం కలది. సత్పురుషులకు ధ్యానరూపయైన పాదుకాదేవి నాకు ఇష్టమైనది,

వ్యాఖ్య :- పాదుకా మహిమ ప్రశంసితం.

భగవత్పాద సంబంధాన్ని బట్టి, పాదాలలాగా పాదుకలుకూడా వేద ప్రతిపాదితాలు. పాదుకాదేవి శ్రీరామునితో కూడి యుంటుంది, ఆయన రీతిగా, లోకహితాన్ని కాంక్షిస్తుంది. భగవంతుని పాదాలతో అన్యోన్యంగా ఉండి శీఘ్రగమనం కలది. సజ్జనులకు ధ్యాన రూపయైన పాదుకాదేవి యందు దేశికులకు చాలా ఆదరాభిమానాలున్నాయి. ఈ శ్లోకంలోని ఉత్తరార్ధమందలి మొదటి పదంలో నాల్గక్షరాలున్నాయి. అందులోని రెండవ అక్షరం 'ర'ను 'ల' గా ఉచ్చరించ వచ్చును. "రలయో రభేదః" అనే శబ్దశాస్త్రవాక్యప్రకారం, అది 'సలాఘవా' అవుతుంది. అనుష్టుప్ ఛందస్సు ఇది "శరబంధం".

ఉద్ధారం :- బాణంలాగా చిత్రం గీయాలి. పూర్వోత్తరార్ధాల్లోని మొదటి నాల్గు అక్షరాలు ఒక్కరీతిగా ఉన్నందు వల్ల, బాణంలో మొదట కూర్చాలి. తర్వాత పూర్వార్ధంలోని బేసిఅక్షరాలను క్రింది రేఖ వెంట వ్రాయాలి. మధ్యనున్న గళ్ళల్లో (సరి) శ్లిష్టాక్షరాలను పూరించాలి. చివరి మూడక్షరాలను, రెండు పంక్తుల్లోనూ ఒకే విధంగా ఉన్నాయి కాబట్టి, బాణపు మొనలో కూర్చాలి.

"యత్రార్ధయోశ్చతుర్వర్ణా ఆదా వన్తే పునస్త్రయః।

మధ్యేశ్లిష్టాశ్చతుర్యుగ్మాః శరబంధో౽యముచ్యతే॥" అని లక్షణం.

***924.*** *కావ్యాయా స్థిత మావర్గ వ్యాజయాతగమార్గకా।*
*కామదాజగతఃస్థిత్యై రంగపుంగవ పాదుకా॥-14*

**అర్థం :-** మా వర్గవ్యాజ యాతగ మార్గకా। మా=శోభను; ఆవర్గ=కలిగించడానికి; వ్యాజ=నిమిత్తమైన; యాత=సంచారాన్ని; గ=పొందే; మార్గకా=అల్పమార్గం కలిగినట్టిది. మా=ధనధాన్యజ్ఞానాది వివిధ సంపదలను; ఆవర్గ=ఆర్జించే; వ్యాజ=నిమిత్తమై; యాత=సంచరిచే జనులను; గ=పొందిన; మార్గకా=దారులు కలది. మా=రాజ్యలక్ష్మిని; వర్గ=వర్జించిన; వ్యాజ=కారణంచేత; యాత=వెళ్ళిన భరతుణ్ని; గ=పొందిన; మార్గకా=మార్గం కలది. కామదా=కోరిక దీర్చునట్టిది; రంగపుంగవ

పాదుకా=శ్రీరంగనాథుని/శ్రీరాముని పాదుక; జగతః=ప్రపంచం యొక్క; స్థిత్యై=రక్షణ కోసం; కావ్యాయ=కవులచే రచింపబడిన గ్రంథవిషయంగా; అస్థిత=ఉండింది. (ఆత్మనేపది)

**తా॥** పాదుక సంచరించే మార్గం స్వల్పమార్గమే అయినా, దాన్ని ఘంటాపథం-రాజమార్గంలాగా శోభింపజేసేది. ధనధాన్యజ్ఞానాది నానాసంపదలను ఆపాదించే జనులు ప్రవర్తించే అనేక మార్గాలు కలది. రాజ్యలక్ష్మిని వదలి వెళ్ళిన భరతుని మార్గాన్ని స్వయంగా పొందినట్టిది. సర్వాభీష్టాలను నెరవేర్చే భగవత్పాదుక, జగద్రక్షణార్థం 'రామాయణ, పాదుకాసహస్ర' గ్రంథ విషయంగా, ఆత్మప్రకాశనం కోసం ఉండింది.

**వ్యాఖ్య :- లోకాల యోగక్షేమం కోసం భగవత్పాదుక రామాయణాది కావ్య విషయంగా ప్రకాశిస్తున్నది.**

పాదుక (సంచరించే)ది సకల సంపదలను సమకూర్చుతూ, తన నాశ్రయించిన వారి కోరికలనీడేర్చుతూ, సర్వలోక రక్షణ కోసం మహాకవులు నిర్మించిన గ్రంథ విషయంగా ప్రవర్తించే మార్గమే కదా! ఇది "గరుడ గతి చక్రబంధం" అనే శబ్దచిత్రమున్న శ్లోకం.

లక్షణం :-



"మధ్యస్థ ప్రథమాదిశ్చాంతర పంక్త్యం తరస్పృగేకార్ణమ్। గరుడ గతిచక్రమేతత్ ద్వ్యర్ధాద్యం త్రైకగం త్రిమండలగమ్॥"

అర్థం :- మూడు పంక్తులు ఉండేరీతిగా నాలుగు వృత్తరేఖలను గీయాలి. మొదటి పంక్తిలో పది గదులను; రెండవ మూడవ పంక్తులలో ఐదేసి గదులనేర్పరచాలి. మధ్యమ పంక్తిలో ఒక గది యందు ప్రథమ పాదప్రథమాక్షరాన్ని

దాని క్రింద మూడవ పంక్తిలో ప్రదక్షిణంగా రెండు గదులలో వరుసగా రెండక్షరాలను, మళ్ళీ మధ్యమ పంక్తిలో ప్రథమాక్షరమున్న ప్రక్కగదిని వదలి, తర్వాతి గదిలో ఒక అక్షరాన్ని, మూడవ పంక్తిలో రెండక్షరాల చొప్పున వ్రాస్తే, రెండువృత్తాలలో పూర్వార్ధం ఆరంభించిన అక్షరమందే సమాప్తం. ఇక ఉత్తరార్ధం, అక్కడనే మొదలై మొదటి పంక్తిలో వరుసగా రెండు గదులలోనూ రెండక్షరాలను, మధ్యమ పంక్తిలో వరుసగా రెండు గదులలోనూ రెండక్షరాలను, మధ్యమ పంక్తిలోని అక్షరం శ్లిష్టిమై, మళ్లీ మొదటి పంక్తిలో రెండేసి అక్షరాల చొప్పున వ్రాస్తే మీది రెండు వృత్తాలలోనే ఆరబ్ధాక్షర మందే పూర్తి అవుతుంది.

*925. సురకార్యకరీ దేవీ రంగనాథసు (స్య) పాదుకా।*
*కామదా కలితాదేశా చరంతీసాధువర్త్మసు॥ 15*

**అర్థం :-** సురకార్యకరీ=దేవతల కార్యాలను నెరవేర్చేది; దేవీ=కాంతికలది, కలిత+ఆదేశా=చేయబడిన ఆజ్ఞకలది; సాధు వర్త్మసు=సన్మార్గాల యందు; చరంతీ=సంచరించేది; రంగనాథ సుపాదుకా=శ్రీరంగపతి యొక్క, శోభనమైన పాదుక; కామదా=కోరికలను ఒసగునట్టిది.

**తా॥** దేవతలకు ఇష్టమైన, అనిష్ట నిరసన రూపమైన ఆజ్ఞను వ్యాపింపజేస్తుంది. సన్మార్గాలలో సంచరిస్తూ శ్రీరంగనాథుని పాదుక, ఆశ్రితుల కోరికలను నెరవేరుస్తుంది.

వ్యాఖ్య :- శ్రుతిస్మృతిరూపమైన ఆజ్ఞను ప్రసరింప జేసే భగవత్పాదుక లోకహితకారిణి.

దేవతలకు ఇష్టప్రాప్తిని కలిగిస్తుంది, అనిష్టాలను తొలగిస్తుంది. స్వయంగా దీప్తిమతి. తన ఆజ్ఞారూపాలైన వేదశాస్త్రాలను వ్యాపింపజేస్తుంది. లోకాలను హితకరమైన మార్గాల్లో సంచరిస్తూ, ఉపాసకుల సకలాభీష్టాలను సిద్ధింపజేస్తుంది భగవత్పాదుక. కాబట్టి సుపాదుక. విశేషణ పదాలన్నీ పాదుకకు అన్వయించేవే కాబట్టి, సుపాదుక 'సమాసోక్తి' అనే అలంకారంగా వర్ణింపబడింది.

"ద్విశృంగాటక చక్రబంధం" గా ఈ శ్లోక రచన సాగింది.



లక్షణం :-

"ప్రక్రాంతాంతం లిఖేద్వర్ణాన్ క్రమాదేకత్రమండలే।
అన్యత్రైకాంతరం ద్వౌచేత్ ద్విశృంగాటక ఉచ్యతే॥

అర్థం :- రెండు పంక్తులుండే రీతిగా మూడు మండలరేఖలను గీసి, రెండు పంక్తులందు పండ్రెండు గదులను ఏర్పరచాలి. మీది పంక్తిలోని గదులలో పూర్వార్ధంలోని పండ్రెండు అక్షరాలను క్రమంగా వ్రాయగా, ప్రథమాక్షరం శ్లిష్టమవుతుంది. ఆరంభించిన అక్షరం క్రింద ఉన్న రెండవ పంక్తిలోని రెండు గదులలో క్రమంగా రెండు

అక్షరలను వ్రాయగా, మీది పంక్తిలో ఆరబ్ధాక్షరం తర్వాతి గదిని విడిచి మరొక గదిలో ఉన్న అక్షరం శ్లిష్టమై పూర్వార్థం సమాప్తం. ఉత్తరార్థం అక్కడనే మొదలై, దాని క్రింద ఉన్న రెండవ పంక్తిలోని రెండు గదులలో క్రమంగా రెండక్షరాలనూ వ్రాసి, మీది పంక్తిలోని అక్షరాన్ని శ్లిష్టంగా ఉపయోగించి, మళ్ళీ క్రింది పంక్తిలోని రెండు గదులలో రెండేసి అక్షరాల చొప్పున వ్రాస్తే, ఈ విధంగా మీది పంక్తిలోని ఆరబ్ధాక్షరం శ్లిష్టమై, ఉత్తరార్థమూ పూర్తి అవుతుంది. మీది పంక్తిలోని ప్రథమాక్షరమూ, తృతీయాక్షరమూ రెండుసార్లు శ్లిష్టంగా ఉంటుంది. అక్కడి నుంచి ఏకాంతరితకోష్ఠాలలోని అక్షరాలు శ్లిష్టమవడం గమనీయం.

***926. భరతారాధితాంతారాం వందే రాఘవపాదుకామ్॥***
***భవతాపాధితాంతానాం వంద్యాం రాజీవమేదురామ్॥-16***

**అర్థం :-** భరత+ఆరాధితాం=భరతుని చేత పూజింపబడిన; తారాం=ఉత్కృష్టమైన; భవ తాప+ఆధి తాంతానాం=సంసార తాపమనే మనోవ్యాధిచేత ఆయాసపడేవారికి; వంద్యాం=స్తుతింపదగిన ; రాజీవమేదురాం=తామరపూలచే నిండియున్న; రాఘవపాదుకాం=శ్రీరాముని పాదుకకు; వందే=నమస్కరిస్తున్నాను.

**తా॥** భరతుడు పూజించిన ఉత్కృష్టమైన పాదుకను సంసార తాపత్రయమనే మనోవ్యాధితో బాధపడే జనులు తమతాపాన్ని పోగొట్టడానికి స్తుతిస్తారు. పూజయందు సమర్పిత కమలాలచే సాంద్రమైన శ్రీ రాఘవపాదుకకు వందనమాచరిస్తున్నాను.

వ్యాఖ్య :- ఆర్తులచే పుష్పార్చితయైన పాదుకాదేవికి వందనం

భగవత్సంబంధం చేత పాదుక ఉత్కృష్టమైనది. భరతుని ఆరాధ్య దేవత శ్రీరాఘవపాదుక. సాంసారిక తాపమనే ఆధిచే పీడితజనులు ఆర్తితో స్తుతింపగా వారి బాధలను అపనయిస్తుంది పాదుక. ఆశ్రితులు అర్చించిన తామరపూలతో పూర్ణంగా ప్రకాశించే పాదుక అఖిలలోకాలకూ వందనీయ. అనుష్టుబ్ఛందం.

ఇది "ద్విచతుష్కచక్రబంధం".



*లక్షణం :-*
***బహిరంతర్మండలస్థ మష్టకోష్ఠ విహారియత్।***
***కోణాష్టక యుతంతత్ ద్విచతుష్కం చక్రముచ్యతే॥***
***తత్రాయుగ్మాక్షరాశ్లిష్టా యదిగోమూత్రికాభవేత్ ।***
***ఆనులోమ్యేనరచితా దుష్కరేష్వియముచ్యతే॥***

**అర్థం :-** దిఙ్ముఖకోణమూ, విదిఙ్ముఖకోణమూ గల రెండు చతురస్ర చక్రాలను వ్యత్యయంగా గీసి, రెండుబహిరంతర్మండల రేఖలను గీయగా ఎనిమిది గదులేర్పడును. బేసి అక్షరాలను

అంతర్మండలంలోని ఎనిమిది గదులలోనూ, సరి అక్షరాలను బహిర్మండలంలోనూ వ్రాస్తే, పూర్వార్థం పూర్తి అవుతుంది. గదులలోని ఎనిమిదక్షరాలు శ్లిష్టమై, ఉత్తరార్థంలోని సరిఅక్షరాలను గదుల క్రింది వృత్తరేఖలో వ్రాస్తే, ఉత్తరార్థమూ పూర్తి అవుతుంది. ఇది '**ఆయుగ్మాక్షర శ్లిష్టానులోమ గోమూత్రికాబంధం**'. సురాసురా (913) శ్లోకం యుగ్మాక్షర శ్లిష్టమైనందు వల్ల దాన్నీ ఈ చక్రమందు వ్రాయవచ్చును. మండల స్పర్శతోపాటు కోణస్పర్శ మాత్రమే భేదం కదా!

***927. కాదుపాస్యసదాలోకా కాలోదాహృతదామకా।***
***కామదాధ్వరిరంసాకా కాసా రంగేశపాదుకా॥-17***

**అర్థం** :- క+అత్+ఉపాస్య, సత్+ఆలోకా=జలపానంచేసే ఋషులచేత ఉపాసింపదగిన మంచి ప్రకాశం కలిగిన; కాల+ఉత్+ఆహృత, దామకా=(పూజా) సమయమందు ఎత్తి సమర్పింపబడిన పూలమాలికలు కలిగిన; కామదా=కోరికలను తీర్చునట్టి; అధ్వరిరంసాకా=దారిలో క్రీడించే కోరికగల; రంగేశపాదుకా=శ్రీరంగనాథుని పాదుక; అ,కాసా=విష్ణుభగవానుని గమనంలాంటి గమనం కలది.

**తా॥** నీటిని మాత్రం త్రాగుతూ తపమాచరించే ఋషులు ధ్యానించదగిన సత్ప్రకాశం కలిగి, పూజా సమయాల్లో అర్చకులు ఎత్తి సమర్పించిన పూలమాలికలూ కలిగి, సేవించేవారి కోరికలను దీర్చేదీ, సంచారమార్గంలో ఒయ్యారంగా నడిచే శ్రీరంగనాథుని పాదుక విష్ణుమూర్తి నడక లాంటి నడక కలది.

వ్యాఖ్య:- పాదుక గొప్ప మహిమ కలది.

నీటినీ, గాలినీ ఆహారంగా తీసుకొంటూ తపస్సుచేసే ఋషులుంటారని "అబ్భక్షా వాయుభక్షాశ్చ" అని స్మృతి చెబుతుంది. "కంశిరోఽంబునోః" అని నిఘంటు ప్రకారం 'క' అంటే నీరు. 'అద' భక్షణే; అనే ధాతువుకు 'అదోఽనన్నే' అని 'విట్' ప్రత్యయం వల్ల 'అత్' అనే రూపమేర్పడుతుంది క+అత్=కాత్, అంటే 'ఋషి' అని అర్థం. "అవ-రక్షణే" అనే ధాతువు వల్ల 'అః' అంటే రక్షకుడు; 'అకారార్థో విష్ణుః" అనీ, 'అక్షరాణాం అకారోఽస్మి' అనే 'అకారం' విష్ణువాచకంగా శాస్త్రం చెబుతుంది, "కస-గతౌ" అనే ధాతువుకు 'భావ' మందు "ఘఞ్" ప్రత్యయం చేరడం వల్ల "కాసః" అవుతుంది. అస్య కాస ఇవకాసః యస్యాః సా=అకాసా, అని పాదుకకు విధేయ విశేషణ పదం. మూడుపాదాలలోని విశేషణ పదాలు కలది "కా"=ఎవరు? అంటే 'సా'=అది, రంగేశపాదుక, అని అన్వయం చేయవచ్చును. (ఇది ఉత్తమూర్ వారి టిప్పణి.) అనుష్టుబ్ఛందం.

ఇది చతురర చక్రబంధం. లేదా, అష్టదళ పద్మబంధం.





చతురరచక్ర లక్షణం :-

*"సకలేషుచపాదేషు యద్యాద్యంతాక్షరైకతా।*
*గతాగతాను కూల్యేన న్యస్తేయే షష్ఠసప్తమే॥*
*తే ద్వితీయ తృతీయాభ్యా మభిన్నే చరణాన్తరే।*
*తదాచతురరం చక్ర మష్టవర్ణాంబుజాదివత్॥"*

**అర్థం** :- మండలాకారంగా రెండు గీతలు గీయాలి. దాని మధ్యన నిలువుగానూ, అడ్డంగానూ రెండేసి గీతలూగీయాలి. మండలంలో నాలుగు విదిగ్రేఖలను గీయాలి. నాభిమధ్యన మొదటి అక్షరాన్ని, దాని మీద రెండవ అక్షరాన్ని, దానిపైని మండల నేమివద్ద మూడవ అక్షరాన్ని, వరుసగా విదిశలలో నాల్గవ, ఐదవ అక్షరాలను, మండలనేమివద్ద ఆరవ అక్షారాన్ని, దీనికీ మొదటి అక్షరానికీ నడుమ ఏడవ అక్షరాన్ని వ్రాయాలి. ఆరునుంచి నాభిలోని అక్షరం వరకున్న మూడూ ప్రవేశ నిర్గమాక్షరాలుకాగా, మళ్ళీ విదిశలలో వరుసగా రెండేసి, నేమివద్ద ఒకటి, దాని కింద మరొక అక్షారాన్నీ వ్రాస్తే, ఆశ్లిష్టాక్షర పూర్వకంగా మొదటి పాదంలోని మొదటి అక్షరమందే శ్లోకం పూర్తి అవుతుంది. ఇది నాలుగు అరలతో కూడిన శ్లోకమయినందువల్ల, 'చతురచక్రబంధ' సంజ్ఞ దీనికేర్పడింది.

ఈ శ్లోకాన్ని 'అష్టదళపద్మం' లోనూ నిబద్ధించవచ్చును.

అష్టదళపద్మబంధ లక్షణం :-

"కర్ణికాయాంన్యసేదేకం ద్వేద్వే దిక్షు విదిక్షుచ।
ప్రవేశనిర్గమౌ దిక్షుకుర్యా దష్టదళాంబుజే॥"

**అర్థం** :- కర్ణికతో కూడిన ఎనిమిది రేకుల పద్మాన్ని చిత్రించాలి. కర్ణికలో మొదటి అక్షరాన్నివ్రాసి, దళం మొదట రెండవ అక్షరాన్ని, చివరమూడవ అక్షరాన్ని, తర్వాతి దళం చివర నాల్గవ అక్షరాన్ని, మొదట ఐదవ అక్షరాన్ని, ఇలా ప్రతిదళంలోనూ రెఢదేసి అక్షరాల చొప్పున వ్రాస్తే, కర్ణికాక్షరంతో కూడిన ప్రతిమూడవ దళంలోనివి అనులోమ ప్రతిలోమాక్షరాలుగా లేదా ప్రవేశనిర్గమాక్షరాలుగా ఉంటాయి. ప్రథమ దిగ్దళమందు కర్ణికాక్షరంతో శ్లోకం పూర్తి అవుతుంది.

*928. పాపాకూపారపాళీపా త్రిపాదీ పాదపాదపా।*
*కృపా రూపా జపాలాపా స్వాపా మాపా న్నృపాధిపా॥-18.*

**అర్థం** :- పాప+అకూపార, పాళీ,పా=పాపమనే సముద్ర పంక్తిని పానం చేయునట్టి; త్రిపాదీ, పాద, పాదపా= పరమపదమందు ఉండే విష్ణుపాదాలను కాపాడునట్టి; కృపారూపా=దయామూర్తియైనట్టి; జప+ఆలాపా=మంత్రజపం వలె సంకీర్తన కలిగినట్టి; సు+ఆపా=సుఖంగా పొందదగినట్టి; నృప+అధిపా=రాజులను పాలించే మహారాజ్ఞియైన పాదుకాదేవి; మా=నన్ను; అపాత్=రక్షించెను.

**తా॥** పాపసముద్రమునంతటినీ పానంచేసేది, వైకుంఠుని చరణాలను కాపాడేది, దయాప్రచురయైన, జపంలాగా తన కీర్తన కలిగిన,- సుఖలభ్యయైన, రాజులకు రాజ్ఞియైన పాదుకాదేవి నన్ను కాపాడింది.

వ్యాఖ్య :- పాదుకా ప్రశంస.

ప్రకృతి మండలంకంటె మూడు రెట్లు ఉండడం వల్ల పరమ పదానికి త్రిపాద్విభూతి అని సంజ్ఞ. పాదత్రయ సమాహార రూపం కాబట్టి త్రిపాదీ అని ద్విగు సమాస పదం. (ఙీప్-స్త్రీలింగరూపం) "త్రిపాదస్యామృతందివి" శ్రుతి. త్రిపాదీం పద్యతే, ఇతి=త్రిపాదపాదః విష్ణువు అని అర్థం.

అధిపాతి, ఇతి=అధిపా, స్వామిని అని అర్థం.

'మాపాత్' అనే చోట 'మా+అపాత్, అనే పదచ్ఛేదనకంటే, తకారం (ద్విత్వన కారం) లేకున్నా, 'మాపా' అనే పాఠమూ ఉండవచ్చు. "మాంపాతి ఇతి=మాపా; లక్ష్మిని కాపాడే పాదుక, స్వాపా=సుఖలభ్య, అని శ్రీ ఉత్తమూర్ వారి టిప్పణి. అనుష్టుబ్ఛందం.

"సకర్ణిక షోడశ దళ పద్మబంధం" ఇది.

లక్షణం :-

"ఏకం సర్వం యదిభవే దేకాంతరిత మక్షరమ్।
తత్ షోడశదళం పద్మం శ్లిష్టార్ణాధారకర్ణికమ్॥"



ఈ శ్లోకంలో ప్రతియుగ్మాక్షరం "పా" కాబట్టి 'పా'ను పద్మకర్ణికలో వ్రాయాలి. 'ఏకాంతరితాక్షరం' అంటే, ఒక అక్షరాన్ని విడిచి మరొక అక్షరం చొప్పున-(బేసి) అయుగ్మాక్షరాలను పదహారు (రేకుల్లో) దళాల్లో వ్రాయాలి కర్ణికాక్షరం శ్లిష్టం కాబట్టి దానితోనే శ్లోకం సమాప్తమవుతుంది.

*929. స్థిరాగసాం సదా రాధ్యా విహతా కతతామతా।*
*సత్పాదుకే సరాసామా రంగరాజ పదం నయ॥*

**అర్థం** :- హే సత్పాదుకే=ఓ భగవత్పాదుకా! స్థిర+ఆగసాం=దృఢమైన పాపాలుగల సంసారులకు; సదా+ఆరాధ్యా=ఎల్లప్పుడు పూజింపదగినట్టి; విహత+అక, తత+అమతా=పోగొట్టబడిన దుఃఖ విస్తారమైన అనిష్టాలు కలిగినట్టి; సరాసా=నాదంతో కూడిన నీవు; మా=నన్ను; రంగరాజ పదం=శ్రీరంగరాజ స్థానానికి (పాదాల వద్దకు) నయ=తీసుకొని పొమ్ము.

**తా**॥ ఓ భగవత్పాదుకా! స్థిరమైన పాపాలుకల జనులకు సర్వదా ఆరాధ్యవై దుఃఖభూయిష్ఠమైన అనిష్టాలను తొలగించే దానవు. నాదసహితవైన నీవు శ్రీరంగపతి పాదసన్నిధికి నన్ను చేర్చుము.

వ్యాఖ్య :- శ్రీరంగనాథుని స్థానానికి తనను చేర్చుమని పాదుకాదేవిని కవి ప్రార్థించే శ్లోకమిది.

"ఓం, తత్, సత్" అనే మూడు పదాలు పరబ్రహ్మవాచకాలు.

"ఓంతత్సదితినిర్దేశో బ్రహ్మణస్త్రివిధఃస్మృతః" (భ.గీత) కాబట్టి, 'సత్పాదుక' అంటే భగవత్పాదుక. 'ఆగః' అంటే పాపం. "ఆగో஽ పరాధో మంతుశ్చ"(అమరం) 'కం' అంటే సుఖం "సుఖ శీర్షజలేషుకం"(విశ్వని) 'కం' లేనిది 'అకం' అంటే దుఃఖం. "రాస-శబ్దే" అనడం వల్ల 'నాదం' అని అర్థం.

*930. స్థితా సమయరాజత్పా గతరా మాదకేగవి।*
*దురంహసాం సన్నతాదా సాధ్యా తాపకరాసరా॥-20*

**అర్థం** :- సమయరాజత్ పా=శిష్టా చారమందు శోభిస్తున్న జనులను కాపాడు తున్నట్టిది; ఆగత రాః=పొందిన సువర్ణం - ఐశ్వర్యం కలది, మాదకే=ఆనందకరమైన; గవి=సూర్యుని యందు/కిరణమందు; స్థితా=ఉన్నట్టిది; దుర్+అంహసాం=మిక్కిలి పాపిష్ఠుల యొక్క; సన్నతా, దా=దీన భావాన్ని పోగొట్టునట్టిది; సాధ్య+అతాప, కరా=సాధింపదగిన, తాపంలేని కిరణాలు కలది; ఆ సరా=అంతట సంచరించే నీవు, (పాదుక) రంగరాజపదం= రంగరాజస్థానానికి; నయ=చేర్చుము

**తా**॥ ధర్మ మార్గమందు రాజిల్లే వారిని రక్షిస్తున్నట్టి; స్వర్ణమయివైన, సంతోషకరమైన సూర్య మండల మందున్న భగవంతునితో సంబంధం కలిగిన, మిక్కిలి పాపాత్ములైన వారి దైన్యాన్ని నివారించునట్టి, మణుల కిరణాల కాంతి వల్ల నమ్రులైన జనుల తాపాన్ని శాంతింప జేసే నీవు శ్రీరంగనాథుని స్థానానికి నన్ను చేర్చుమని పూర్వశ్లోకంతో అన్వయం.

వ్యాఖ్య :- ఆదిత్యమండల మధ్యవర్తియైన శ్రీమన్నారాయణుని సన్నిధికి చేర్చుమని పాదుకను ప్రార్థించే శ్లోకం.

"సమయఃశపథాచారః" అని 'సమయ' శబ్దానికి ఆచారమనే అర్థమూ ఉంది. 'రై'శబ్దం ధనద్రవ్యార్థకం. కాబట్టి పాదుక స్వర్ణమయి. 'గో' శబ్దానికి అనేకార్థాలున్నాయి. "గౌర్నాఽదిత్యే బలీవర్దే క్రతు భేదర్షి భేదయోః। స్త్రీ తుర్యాం దిశి భారత్యాం భూమౌచ సురభావపి। నస్త్రియాం స్వర్గ వజ్రాంబు రశ్మి దృగ్బాణలోమసు" (విశ్వనిఘంటువు) 'గవి' అనే విశేష్యపదానికి 'మాదకే' అనేది విశేషణం. కాబట్టి 'గో' శబ్దం పుంలింగం. సన్నతా=అవసన్న భావాన్ని, దా=ఖండించేది. "దోఽవఖండనే" అని ధాత్వర్థం వల్ల 'సన్నతాదా' అని రూపనిష్పత్తి 'ఆ=సమంతాత్, సరతి ఇతి=ఆసరా. సకలలోకాల్లోనూ చరించేది పాదుక.

929 మరియు 930 రెండు శ్లోకాలను ఒక్క వాక్యంగా అన్వయించి, 'తురంగపదక్రమంగా- రెండుశ్లోకాల నుంచి అక్షరాలను ఉద్ధరించి-కూర్చడం సంప్రదాయం.

ఇట్టి రచనకు "చతురంగ తురంగ పదబంధం" అని సంజ్ఞ.

లక్షణం :- "చతురంగ పదన్యస్తే శ్లోకే శ్లోకాంతరం యది।

ఉద్ధార్యం హయగత్యా స్యాత్తత్తురంగ పదం విదుః॥"

స్థిరాగసాంసదారాధ్యా



929వ శోకాన్ని 4 పాదాలుగా వ్రాయాలి. 930వ శ్లోకం లోని అక్షరాలను అంకెలలో అశ్వగతిని చూపినట్లు పరిస్తే, మొదటి శ్లోకంలోనే రెండవ శ్లోకమూనిబద్ధమని గ్రాహ్యమవుతుంది.

ఇది తురంగ గతిక్రమం.

(930 శ్లోకం పూర్వార్ధం)

వేసిన అంకె మొదలు ప్రతి నాల్గవ ప్రక్క అక్షరంగమనీయం.

*931. లోక తారా కామచారా కవిరాజదురావచా।*
*తారాగతే పాదరామ రాజతే రామపాదుకా॥ -21*

**అర్థం** :- లోకతార+ఆకామచారా=లోకాన్ని తరింపజేసే కోరదగిన సంచారం కలిగినట్టి; కవిరాజ దురావచా=కవీశ్వరులచే వర్ణింప శక్యం కానట్టి; గతే=గమనమందు; తారా=తారస్థాయి ధ్వని కలిగినట్టి; పాదరా=కిరణకాంతిని ఇచ్చునట్టి, లేదా భగవత్పాదాలను మన కోసం తెచ్చి ఇచ్చునట్టి; రామపాదుకా=శ్రీరాముని పాదుక; ఆమ=ఇట్లు; రాజతే=ప్రకాశిస్తుంది.

**తా॥** ఆశ్రిత జనులకు సంతారకమైన అభిలషణీయ సంచారం కలిగినట్టి, వాల్మీకి వ్యాసాది కవి రాజుల చేత సమగ్రంగ వర్ణింప శక్యం కానట్టి, సంచరించు వేళ ఉచ్చైర్నాదం కలిగినట్టి, మణుల కిరణాల కాంతిని ప్రసరింపజేసే శ్రీరామచంద్ర స్వామి పాదుక ఇలాగా ప్రకాశిస్తుంది.

వ్యాఖ్య :- లోక సంతారకమైన భగవత్పాదుక నాద, కాంతులతో శోభిస్తుంది.

'తార' శబ్దానికి అనేకార్థాలున్నాయి. "కలోమంద్రస్తు గంభీరేతారోఽత్యుచ్చైస్త్రయస్త్రిషు" (అమరం) కల, మంద్ర, తారశబ్దాలు మూడూ మూడు లింగాలలో వర్తిస్తాయి. "తారో నామౌక్తికే శుద్ధే గురుసుగ్రీవ భార్య యోః। బౌద్ధదేవ్యాంతారకయోస్తారాదౌ రూప్యవర్ణయోః। తారమత్యుచ్ఛనిధ్వాన తరీసంబంధ యోస్త్రిషు" అని శేషనిఘంటువు. 'పాదరా' అనే చోట "రా-దానే"ధాతువు వల్ల 'ఇచ్చుట' అని అర్థం. "ఆమేవం, ఆమైవం" (అమరం) "ఇట్లు, అలాగే, జ్ఞాననిశ్చయ" మనే అర్థమిచ్చే అవ్యయం "ఆమ". అనుష్టుబ్ఛందం.

ఇది "అర్ధభ్రమకం" అనే యమకం.

**లక్షణం** :- "ఆహురర్ధభ్రమంనామ శ్లోకార్ధభ్రమణం యది।
తదిష్టం సర్వతోభద్రం భ్రమణం యది సర్వతః"

**అర్థం** :- శ్లోకం యొక్క ప్రతిపాదంలోని సగం భాగమే తిరుగును కాబట్టి ఇది 'అర్ధభ్రమకం' అనే దుష్కరమైన చిత్రబంధం. పాదాలు అంతట ఒకే రీతిగా భ్రమించినచో "సర్వతోభద్రం" అనే చిత్రబంధమేర్పడును.

విన్యాసం :- అడ్డంగా ఐదుగీతలు గీయాలి. నిలువుగా తొమ్మిది గీతలు గీయగా ముప్పది రెండు గదులేర్పడుతాయి. ఒక్కొక్క గదిలో ఒక్కొక్క అక్షరం చొప్పున నాలుగు వరుసలలో నాలుగు పాదాలను యథాక్రమం వ్రాయాలి. ప్రతి పాదంలోని మొదటి అక్షరాలనూ, చివరి అక్షరాలనూ నిలువున మొదటి గదులలోనూ, చివరి గదులలోనూ ఉన్నట్లు అనులోమంగా చదువగా మొదటిపాదం పూర్తి అవుతుంది. రెండవ వరుసలోనూ, ఏడవ వరుసల్లోనూ ప్రతిపాదంలోని రెండవ మరియు ఏడవ అక్షరాలనూ; అలాగే మూడవ, ఆరవ వరుసలో మూడవ, ఆరవ అక్షరాలనూ; నాల్గవ, ఐదవ వరుసలోని అక్షరాలనూ అనులోమంగా చదివితే శ్లోకం సమాప్తమవుతంది. నాలుగు వరుసలలో ప్రతిపాదం యొక్క అర్ధభాగం, అడ్డంగానూ, నిలవుగానూ చదివితే, ఒక్కరీతిగనే ఉంటుంది. కావున "అర్ధభ్రమకం" సంజ్ఞ.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1లో | క9 | తా17 | రా25 | కా32 | మ24 | చా16 | రా8 |
| 2క | వి10 | రా18 | జ26 | దు31 | రా23 | వ15 | చా7 |
| 3తా | రా11 | గ19 | తే27 | పా30 | ద22 | రా14 | మ6 |
| 4రా | జ12 | తే20 | రా28 | మ29 | పా21 | దు13 | కా5 |

### *932. జయామపాపామయా జయామ హేదుదు హేమయా।*
### *మ హేశకాకాశ హేమపాదుకా మమకాదుపా॥-22*

**అర్థం** :- జయామపా=జయ=ఉత్కర్ష, ఆమ=పక్వంకాని జనులను; పా=రక్షించునట్టి; అప+ఆమయా=పోగొట్టబడిన రోగాలు కలదైన; అమమ,క+అత్+ఉ,పా=మమకారంలేని, బ్రహ్మను, పీడించిన, రుద్రుణ్ని, కాపాడినట్టి; మహేశక+అక+అశ,హేమపాదుకా=ఇంద్రాదుల, దుఃఖాన్ని, మ్రింగే (నశింపజేసే) విష్ణువు యొక్క, బంగారు పాదుక; మయా=నాచేత; అజ, యా, మహే=భగవంతునికి జరిగే ఉత్సవ మందు; దుదుహే=(కోరికలను దీర్చునట్లు) పితుకబడును.

**తా॥** ఉత్కర్షం పరిణతిని పొందని ముముక్షువులను కాపాడునట్టి, వ్యాధులను పోగొట్టునట్టి, తనది కాని వస్తువు నందు తనది అనే బుద్ధి లేని బ్రహ్మ శిరస్సును ఛేదించి గురుపాతకానికి గురియైన రుద్రుణ్ని రక్షించినట్టి, ఇంద్రాది దిక్పాలురు కష్టాలను తొలగించే విష్ణువు యొక్క స్వర్ణమయ పాదుకను శ్రీరంగనాథుని బ్రహ్మోత్సవమందు అభీష్టసిద్ధికోసం ప్రార్థిస్తాను.

**వ్యాఖ్య** :- ఆశ్రిత రక్షిణియైన భగవత్పాదుకను శ్రీరంగనాథుని ఉత్సవంలో ప్రార్థిస్తానని కవి ప్రకటన.

'ఆమం' అంటే పక్వంకాని-వండని-పండని-పదార్థం. 'ఆమయం'అంటే రోగం. 'కం' అంటే సుఖం, అది లేనిది 'అకం' అంటే 'దుఃఖం", "నామ్నా అకంభవతి" (శ్రుతి). బ్రహ్మదేవుని తలను కొట్టిన శివుని చేతికి అంటిన

కపాలాన్ని వదిలించే భిక్ష పెట్టి రక్షించినవాడు శ్రీహరి అని పురాణాలలో ప్రసిద్ధం.

"మహేశకాకాశహేమపాదుకా', మహా+ఈశ=లోకపాలకులైన ఇంద్రాది దేవతల యొక్క, క=శిరస్సు మీద; ఆకాశ=ప్రకాశించే; హేమపాదుకా=స్వర్ణమయమైన పాదుక" అని శ్రీమాన్ డి.టి.తాతాచార్యస్వామి (తిరుపతి) వారి ద్రవిడ భాషలో ఉన్న అర్థమిది.

ఇది "సర్వతో భద్రబంధం"

పైన "అర్ధభ్రమకబంధ" లక్షణ శ్లోకంలోనే "సర్వతోభద్రబంధ" లక్షణం 'అంతట పాద భ్రమణం ఉంటుంది' అని చెప్పబడింది.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| జ | యా | మ | పా | పా | మ | యా | జ |
| యా | మ | హే | దు | దు | హే | మ | యా |
| మ | హే | శ | కా | కా | శ | హే | మ |
| పా | దు | కా | మ | మ | కా | దు | పా |
| పా | దు | కా | మ | మ | కా | దు | పా |
| మ | హే | శ | కా | కా | శ | హే | మ |
| యా | మ | హే | దు | దు | హే | మ | యా |
| జ | యా | మ | పా | పా | మ | యా | జ |

"సర్వతో భద్ర బంధ" ప్రస్తారక్రమం :-

మొదట "చతురస్రం" గీయాలి. దాని మధ్యన అడ్డంగా నిలవుగానూ ఏడు రేఖలను సమానంగా గీస్తే 64 గదులు ఏర్పడుతాయి. ఎనమిది వరుసలు ఉంటాయి. మొదటి నాలుగు వరుసలలో గదికి ఒక్క అక్షరం చొప్పున, శ్లోకం యొక్క నాల్గుపాదాలను యథాక్రమం వ్రాయాలి. తర్వాత ఉన్న నాలుగు వరుసలలో శ్లోకాన్ని వ్యుత్క్రమంగా అంటే, వరుసగా 4,3,2,1 పాదాలను వ్రాయాలి.

శ్లోకం యొక్క ప్రతిపాదంలోని నాలుగు అక్షరాలు అనులోమ, ప్రతిలోమంగా ఉండడం వల్ల, ఏ ప్రక్కనుంచి ఒక్కొక్క పాదం చదివినా, శ్లోకం ఎనమిది సార్లు ఆవృత్తమవుతుంది. చిత్ర కవితలో "సర్వతో భద్ర బంధం"గా శ్లోకాన్ని రచించడం దుష్కరమూ, ఆశ్చర్యజనకమూ అయిన ప్రయోగం.

*933. పాపాదపా పాదపాపా పాదపాద దపాదపా।*
*దపాదపా పాదపాద పాదపాద దపాదపా॥ 23.*

పదచ్ఛేదం :- 1. పాపాత్. 2. అపాపాత్ 3.అపాపా. 4.అపాదపాదద పాదపా 5. దపాదపా పాద పాద పాదపా. 6. దదపాదపా.

**అర్థం :-** 3. అపాపా=పాపం లేనట్టి; 4. అపాదపాదదపాదపా। అ=విష్ణువు యొక్క; పాద=చరణాలకు; పాద=కాంతిని; ద=ఇచ్చే; పాద=కిరణాలను; పా=కాపాడు నట్టి; 6. దదపా దపా। దద=(పాదుకా) సమర్పకుల విషయమై; పాత్=రక్షించే; అపా=జలాలను కలిగినట్టి; 5. దపాదపాపాదపాదపాదపా।ద=రక్షణను; పాద=సంపాదించునట్టి, పాప+అ,ద=పాపాలను పూర్తిగా తొలగించునట్టి, పాద=చరణాలుకల శ్రీరంగనాథుని యొక్క; పాద=పాదాలను, పా=రక్షించే పాదుక; 1. పాపాత్=పాపం నుంచి; 2. అపాపాత్=కాపాడెను.

**తా॥** పాపంలేనట్టి, భగవత్పాదాలకూ (పాదభూతులైన జీవులకూ) కాంతినిచ్చే కిరణాలను కాపాడు నట్టి, అభిషేకాన్ని సమర్పించే వారి విషయమై రక్షించే అభిషేక తీర్థం కలిగినట్టి; రక్షణాపాదకమూ, పాపాపనోదకమూ అయిన పాదాలుకల శ్రీరంగనాథుని పాదుక (నన్ను) పాపం నుంచి కాపాడింది.

వ్యాఖ్య :- పాపరహితయైన భగవత్పాదుక పాపం నుంచి రక్షిస్తుంది.

“పాదోస్య విశ్వాభూతాని” శ్రుతి వల్ల జీవులు భగవత్పాద భూతులు “దేజ్-రక్షణే” ధాతువును బట్టి ‘ద’ అంటే రక్షణ. అభిషేకించే వారికోసం అభిషేక తీర్థాన్ని రక్షిస్తూ, పాపాలను తొలగించి ఆశ్రితులను రక్షించే భగవంతుని పాదాలను రక్షించే పాదుక మనలనూ కాపాడుతుంది.

ద్వ్యఝల్ విషయ యమకసర్వతో భద్రబంధం (932 శ్లోకం వంటిదే ఇది) (ద్+అ; ప్+ఆ=ద,పా) హ్రస్వ దీర్ఘాచ్చులతో కూడిన రెండు హల్లులు గల యమకమున్న ‘సర్వతో భద్రం’ ఇది. దీని లక్షణమూ, ప్రస్తారమూ చెప్పబడింది కదా!

*934. కోపోద్దీపక పాపేఽపి కృపాపాకోపపాదికా।*
*పూద పాదోదకాపాదోద్దీపికాకాఽపి పాదుకా॥-24*

**అర్థం :-** కోప+ఉద్దీపక, పాపే, అపి=కోపాన్ని రగిలించే పాపం కల వ్యక్తి యందు కూడా; కృపా పాక+ఉపపాదికా=నిండుదయను సంపాదించునట్టి; పూద-పికా। పూద=పవిత్రతను కల్పించే, పాద+ఉదక=చరణ తీర్థం కలిగిన; అ=విష్ణువు యొక్క, పాద=పాదానికి, ఉద్దీపికా=బాగాదీప్తిని కలిగించునట్టి; పాదుకా=పాదరక్షిణి; కా+అపి=అవాఙ్మా నసగోచర వైభవ.

**తా॥** భగవంతుని కోపాన్ని తీవ్రంచేసే పాపకర్మలు చేసిన వ్యక్తిపట్ల కూడా భగవంతునికి కృపా పూర్ణతను కలిగించేదీ, పావనత్వాన్ని కలిగించే (గంగారూప) పాదతీర్థం కలిగిన భగవత్పాదానికి (తన మణులతో) ఎక్కువ కాంతిని ప్రసరింప జేసేదీ అయిన పాదుక మాటలతో వర్ణించరానిది, మనస్సుకూ గోచరించనిది.

వ్యాఖ్య :- పాదుకా వైభవాన్ని ప్రశంసించే శ్లోకం.

"పూఞ్-పవనే" ధాత్వర్థాన్ని 'ద'=ఇచ్చేది కాబట్టి 'పూదం' అనేది పాదోదకానికి విశేషణం. "క,ద,ప" అనే మూడు అక్షరాలతో కూర్చబడిన ఈ శ్లోకం "త్ర్యక్షర యమకం", అనుష్టుబ్ఛందం.

*935. తతాతత్తా తితత్తేతా తాత తీతేతి తాతితుత్।*
*తత్తత్తత్తాత తితతా తతేతాతేత తాతుతా॥-25*

పదచ్ఛేదం :- 1. తతాతత్తా 2. అతి తత్తేతా 3. తాతతి 4. ఇతేతితాతితుత్ 5. తత్తత్తత్తాతతితతా 6. ఆతతా. 7.ఇతాతే తతాతుతా.

**అన్వయం**:- 1. తతాతత్తా 2. అతితత్తేతా 4. ఇతేతి తాతితుత్ 5. తత్తత్తత్తా తతితతా 6. ఆతతా 7. ఇతాతేత తాతుతా 3. తాతతి.

**అర్థం** :-1. తతాతత్తా। తతా=విస్తృతమైన, అతత్తా=సతతం సంచరించే ధర్మం కలిగిన; 2. అతితత్తేతా। అతి=అతిక్రమించిన, తత్+తా=పరబ్రహ్మ కలిగిన భావంతో, ఇతా=కూడినట్టి; 4. ఇతేతి తాతితుత్। ఇత=పొందిన, ఈతి, తా=ఈతిబాధలుకల (వారి) భావాన్ని, అతి=మిక్కిలి; తుత్=నశింపజేయునట్టి; 5. తత్తత్తత్తా తతి తతా। తత్+తత్=ఆయావస్తువు యొక్క; తత్+తా=ఆయాధర్మం యొక్క; తతి=సముదాయంతో; తతా=విస్తరింప బడినట్టి; 6.ఆ తతా=పలుదెసల వీణాది వాద్య(నాద)ం కలిగినట్టి; 7. ఇతాతేతతాతుతా। ఇ=మన్మథుని యొక్క, తాత=తండ్రియైన విష్ణువుతో, ఇత=కూడిన, తాతుతా=పాదుక; 3. తాతతి=తండ్రిలాగా ఆచరిస్తుంది.

**తా॥** జగద్రక్షణార్థం విస్తార గతిశీల యైనట్టి, భోగ్య, ప్రాప్యత్వాదుల చేత పరబ్రహ్మను మించినట్టి; సర్వవస్తువులను స్వాధీనపరుచుకొన్న సత్తా కలిగినట్టి, సర్వత్ర వీణాది వాద్యనాదం కలిగినట్టి, ఈతిబాధలను నివారించునట్టి, మన్మథుని తండ్రియైన శ్రీ మహావిష్ణువుతో కూడిన పాదుకాదేవి ప్రజలను తండ్రిలాగా కాపాడుతుంది.

వ్యాఖ్య :- పాదుకాదేవి ప్రభావాన్ని 'ఒకే హల్లుతో' వర్ణించే శ్లోకం.

(2) 'తత్' శబ్దం "ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రి విధఃస్మృతః" (భ,గీత) అనే స్మృతి ప్రకారంగా పరబ్రహ్మ వాచకం. (1) "అత-సాతత్యగమనే" అనే ధాత్వర్థం వల్ల 'అతత్తా' సతతగమనశీలం కలది పాదుక. (4) "తుద-వ్యథనే" ధాత్వర్థంకల పదం "తుత్" (6) "తతం వీణాదికం వాద్యం" (అమరకోశం) 'తౌతాతిత' అనే పదప్రయోగం వల్ల-అచ్చుల సామ్యంతో హల్లులను మరుగు పరచినందువల్ల- "కౌమారిల, దౌవారిక" ఇత్యాది పదాలను గ్రహించడం సంప్రదాయమే. కాబట్టి, హల్లోపనం చేత 'పాదుకా' రూపంగా ఉన్న "తాతుతా" పదంతో అంతమైన "ఏకాక్షర" శ్లోకమిది. "ఉత్సవేషుచ సర్వేషు పితేవ పరితుష్యతి" అనే న్యాయంగా వసంతాద్యుత్సవాలలో పాదుక తండ్రివలె అందరినీ రక్షిస్తుంది. దుష్కర చిత్రబంధాలలో చెప్పిన పదాన్ని మళ్ళీ చెప్పినా "పౌనరుక్త్య దోషం" ఉండదని ఆలంకారికులంటారు, అని వ్యాఖ్యాతలన్నారు.

936. యాయా యాయా యాయా యాయా।
యాయా యాయా యాయా యాయా।
యాయా యాయా యాయా యాయా।
యాయా యాయా యాయా యాయా। 26

పద విభాగం:-1.యాయాయా 2.ఆయ 3.ఆయాయ 4.అయాయ 5.అయాయ 6.అయా య 7.అయాయ 8.అయాయా 9.యాయాయ 10.ఆయాయాయ 11.ఆయాయా 12. యా 13.యా 14.యా 15.యా 16.యా 17.యా 18.యా 19.యా॥

**అర్థం** :- 1. యా యా యా=దేశాంతర ప్రాపణకు సాధనమైన పాదుక; 2. ఆయ=విష్ణువు కోసమే, ఉంది. 12. యా=ఏపాదుక; 3. ఆయాయ=రామాదులచే గ్రహింపదగిన కోసలదేశ భాగం కోసమో; 13. యా=ఏపాదుక; 4. అయాయ=శుభావహవిధి కోసమో14. యా=ఏపాదుక. 5. అయాయ=జ్ఞానం కోసమో. 15. యా=ఏపాదుక; 6. అయాయ=ఇచ్ఛకోసమో; 16. యా=ఏపాదుక 7. అయాయ=(విరోధి) నిరసన కోసం; 8. అయాయా=విష్ణువును పొందిందో 17. యా=ఏ పాదుక; 9.యా యా య=సంచారం కోసమో 18. యా=ఏపాదుక; 10. ఆయాయాయ=భగవంతుడు మన దగ్గరికి రావడానికో; 19. యా=ఏ పాదుక. 11. ఆయ+ఆయా= సమంతాత్ గతికి అంటే సర్వలోక సంచారానికి ప్రాప్తియో; (సా=ఆపాదుక, ఆయ=విష్ణువు కోసమే ఉంది, అని (పూర్వంతో అన్వయం)

**తా॥** భగవంతునికి ఇష్టమైన స్థలానికి తీసుకొనిపోయే పాదుక భగవంతునికి శేషభూతయే. అయోధ్యానగర సింహాసన మధిష్ఠించింది పాదుక. ఆశ్రితులకు మంచి అదృష్టాన్ని కలిగించి శుభాన్ని ఆవహింపజేస్తుంది. తన ఉపాసకులకు మంచి జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. ప్రజలకు "ఈ పాదుకయే మాదేవత" అనే ఇచ్ఛను జనింప జేస్తుంది. భక్తుల విరోధులను ఎదుర్కోవడానికి భగవంతునిచే గ్రహింపబడుతుంది. భగవంతుని లీలా విహారానికీ ఉపయోగ పడుతుంది. ఆశ్రితుల రక్షణ కోసం భగవంతుడు రావడానికీ ఉపకరిస్తుంది. ముక్తుల కోసం సర్వలోకాల్లోనూ యథేచ్ఛగా సంచరిస్తుంది శ్రీరంగనాథస్వామి పాదుక.

వ్యాఖ్య :- భగవత్సేవికయైన పాదుక, సర్వలోకాలను సంచరిస్తూ భగవదనుగ్రహాన్ని భక్తులకు ప్రాప్తింపజేస్తుందని ప్రశంసించే శ్లోకం.

1. "యా-ప్రాపణే" అని ధాత్వర్థం. 2.విష్ణువు అనే అర్థమిచ్చే 'అ' (కార) శబ్దం యొక్క చతుర్థీ విభక్త్యే వచనాంతం "ఆయ" 3. గ్రాహ్యభాగమనే 'ఆయ" శబ్ద చతుర్థీ విభక్త్యేక వచనాంత రూపం "ఆయాయ", 4. "అయఃశుభావహో విధిః" (అమరం) 5. "ఇణ్-గతౌ" అనే ధాతువు వల్ల 'భావ' మందు 'ఏరచ్' ప్రత్యయం. గత్యర్థాలు అన్నీ జ్ఞానార్థకాలు. 6."ఈ-గతి పూజన కాంత్య సనఖాదనేషు" అనే ధాతువునకు, ఇచ్ఛా పరమైన కాంత్యర్థక పర్యాయపదం వల్ల "ఏరచ్" ప్రత్యయం చేరగా "అయః" పద చతర్థీ విభక్త్యేకవచనాంతం "ఆయాయ" 7. అయాయ=విరోధులను నిరసించడం కోసం, 8. అ, యాయా=విష్ణువుచే గ్రహింపబడినది పాదుక, అని అర్థం.

ఈ శ్లోకం, ప్రతిపాదానికీ రెండు మ గణాలూ, రెండు గురువులూ ఉండే, "విద్యున్మాలా" వృత్తం. "మోమోగోగో, విద్యున్మాలా" అని లక్షణం.

'ఆ' కారంతో కూడిన 'య' కారంతో రచితమైన ఈ శ్లోకం "ఏకస్వరచిత్రం" "ఏకవర్ణచిత్రం" సర్వవిషయాల సముచ్చయమైన ఈ శ్లోకం "మహాయమకం". గోమూత్రికాబంధం, సర్వతో భద్ర, కంకణబంధ, మురజ బంధ, పద్మ బంధాలూ, అనులోమ ప్రతిలోమ గతిచిత్రమూ, అర్ధ యమక, పాద చతురావృత్తి యమక, పాదార్థాష్టావృత్తి యమక, పాదషోడశా వృత్తియమక, ఏకాక్షర ద్వాత్రింశత్ (32)ఆవృత్తి యమకాలూ, ఇందు ఉండడం వల్ల ఈ శ్లోకానికి "మహాయమకత్వం". (పాఠకులకు కలిగే వ్యామోహన భయం చేత అర్థాంతరమున్నా, ఉపేక్షితమన్నాడు వ్యాఖ్యాత.)

*937. రఘుపతి చరణావనీ తదా*
*విరచిత సంచరణావనీ పథే।*
*కృత పరిచరణావనీ పకై*
*ర్నిగమ ముఖైశ్చరణావనీ గతా॥-27.*

**అర్థం :-** తదా=విశ్వామిత్రునితో పయన మైనప్పుడు; వనీపథే=అడవి దారియందు; విరచిత సంచరణా=చేయబడిన సంచారం కలిగినదీ; రణ+అవనీ గతా=సుబాహుమారీచుల యుద్ధభూమిని పొందినదీ; రఘుపతి చరణ+అవనీ=శ్రీరాముని పాదాలను కాపాడేదీ అయిన పాదుక; వనీపకైః=యాచకులచేత; నిగమముఖైః చ=వేదముఖులైన వారి చేతనూ; కృత పరిచరణా=చేయబడిన సేవకలది.

**తా॥** విశ్వామిత్రునితో సిద్ధాశ్రమానికి పోయే సమయాన శ్రీరాముడు అడవిలో పాదుకలతో పాటు సంచరించాడు. యాగ రక్షణార్థమై మారీచ సుబాహులతో పోరుసలిపి నప్పుడు రణభూమిలో శ్రీరాముడు పాదుకలతో ప్రకాశించాడు. రక్షార్థులైన యాచకుల చేతనూ, వేదవిదులైన గౌతమ, శతానందాది మహర్షుల చేతనూ పాదుక సేవింపబడింది.

వ్యాఖ్య :- రఘుపతి పాదుకా ప్రశంస

శ్రీరాముడు విశ్వామిత్రుని వెంటపోయినప్పుడూ, యాగరక్షణకోసం మారీచ సుబాహులతో పోరాడిన రణభూమిలోనూ పాదుక శ్రీరాముని చరణాలను కాపాడింది. అహల్యాశాప విమోచన మప్పుడు గౌతమ మహర్షియు, రక్షార్థులైన యాచకులూ, మిథిలానగరంలో అహల్యానందనుడైన శతానందుడూ, ఇంకెందరో మహర్షులూ శ్రీరాముని పాదుకలను సేవించారు.

సంగ్రామ విషయమై "కుంజరేణ రథేన వా" అన్నట్లు బహుశః లక్ష్మణునితో కూడి శ్రీరాముడు సంచరించాడనీ గ్రహింపదగును, అన్నది శ్రీ ఉత్తమూర్ వారి సంస్కృతటిప్పణి.

ఇది "పాదచతుష్టయ భాగావృత్తి యమకం". "చరణావనీ" అనే అక్షరాలు నాల్గు చరణ భాగాలలోనూ ప్రయోగింపబడినాయి.

"త్రిష్టుప్" మరియు "జగతీ" ఛందస్సులతో మిశ్రితమైన శ్లోకం.

"ననరలగురుభిశ్చ భద్రికా" అనీ "భవతి నజావిహ 'మానినీ' జరౌ" అనీ "భద్రికా, మానినీ"వృత్తాల సంకీర్ణ శ్లోకమిది. "ఇత్థం కిలాన్యాస్వపి మిశ్రితాసు వదంతి జాతిష్విదమేవనామ" అన్నట్లు ఇలాగా (రెండేసి) వృత్తాల మిశ్రమశ్లోకాన్ని "ఉపజాతి" వృత్తం అంటారు.

*938. దత్తకేళిం జగత్కల్పనా నాటికా*
*రంగిణా రంగిణా రంగిణా రంగిణా।*
*తాదృశే గాధి పుత్రా ధ్వరే త్వాంవినా*
*పాదుకాపాదుకాపాదుకాపాదుకా॥-28*

పదచ్ఛేదం :- దత్తకేళిం, జగత్కల్పనా నాటికా రంగిణా, అరంగిణా, రంగిణా, రంగిణా, తాదృశే, గాధి పుత్రాధ్వరే, త్వాం, వినా, పాదుకా, అపాత్, ఉ, కా, పాదు, కాపాదుకా॥

**అర్థం** :- హేపాదు=ఓపాదుకాదేవీ! జగత్, కల్పనా, నాటికా, రంగిణా=విశ్వసృష్టియనే నాటకాన్ని నడిపించే; అరంగిణా=(తన కంటె మించిన) నటుడు లేనట్టి; రంగిణా=యుద్ధరంగ ప్రవేశంచేసే; రంగిణా=శ్రీరామరూపంలో ఉన్న నటుని చేత; దత్తకేళిం=ఇవ్వబడిన ఉల్లాస విహారం కలిగిన; త్వాంవినా=నిన్ను విడిచి (నిన్నుకాక) కా, ఉ, పాదుకా=ఏపాదుక; తాదృశే=అలాంటి(ప్రసిద్ధమైన); గాధిపుత్ర+అధ్వరే=గాధిరాజ పుత్రుడైన విశ్వామిత్రుని యాగమందు; క+ఆపాదుకా=సుఖాన్ని ఆపాదించినదై; అపాత్=కాపాడెను?

**తా॥** ఓపాదుకాదేవీ! చరాచరప్రపంచాన్ని సృజించడమనే నాటకాన్ని నడిపించునట్టి, తనకన్న గొప్పనటుడేలేని, యుద్ధరంగమందు ప్రవేశించే శ్రీరామరూపంతో ఉన్న శ్రీరంగనాథుడనే నటుడు కల్పించిన లీలా విహారంకల నీవు తప్ప వేరే ఏ పాదుక సుబాహుమారీచులు చెడగొడుతున్న విశ్వామిత్రుని యాగాగ్నిని (విశ్వామిత్రుణ్ని) సుఖా పాదకంగా రక్షించింది?

వ్యాఖ్య :- శ్రీరామరూపంతో ఉన్న శ్రీరంగనాథుని పాదుకయే గాథేయుని యాగాన్ని రక్షించిందని సంకీర్తితం.

తాత్పర్యం స్పష్టం. "రగి-గతౌ"- ధాత్వర్థం. "రంగితుం (గంతుం) శీలం అస్య అస్తి, ఇతి=రంగీ". జగన్నాటక గతియే స్వభావం కలవాడని అర్థం. "రంగం (నృత్తస్థలం) అస్య అస్తి, ఇతి=రంగీ". నటుడని అర్థం. "నవిద్యతే రంగీ యస్య సః=అరంగీ". 'ఉ' శబ్దానికి 'ఏవ' కారార్థం ఉదా:- "తదేవాగ్ని స్తద్వాయుస్తదు చంద్రమాః (శ్రుతి) "కా,ఉ,పాదుకా" అంటే 'కైవపాదుకా" అని యే కదా! "క' ఆపాదుకా" అనేచోట "కా, పాదుకా" అనీ చెప్పవచ్చును. 'కా' పదం 'ఈషత్' అర్థకం. కాబట్టి, భగవత్పాదుకాగతి కంటే వేరే పాదుకాగతి స్వల్పమే, అని

అర్థం. "పా-రక్షణే" ధాతువు యొక్క 'లజ్' ప్రథమ పురుషైక వచనాంత రూపమే "అపాత్". ఇది "పాదభాగ చతురావృత్తి యమకం". "రంగిణా, పాదుకా" అనే పదాలు నాల్గుసార్లు రెండవ, నాల్గవ పాదాలలో ఆవృత్తియైనవి. "రైశ్చతుర్భిర్యుతా స్రగ్విణీయంమతా"- నాల్గు రగణాలున్న "స్రగ్విణీ" వృత్తమిది.

*939. పాదపా పాదపా పాదపా పాదపా*
*పాదపా పాదపా పాదపా పాదపా*
*పాదపా పాదపా పాదపా పాదపా*
*పాదపా పాదపా పాదపా పాదపా॥- 29*

పదచ్ఛేదం :- 1. పాదపాపాదపాపాదపాపాదపా 2. పాదపా 3.అపాదపా 4. పాదపాపాదపా 5. పాదపాపాదపాపాదపా పాదపాపాత్ 6. అపాపాదపాపా 7. ఆదపాపాదపా.

**అర్థం :-** 1. పాదపా పాదపా పాదపా పాదపా। పాదప=స్థావరాలనూ; అపాదప=జంగమాలనూ; ఆపాద=పొందుతున్న; పాప=పాపాలను; అత్=నశింపజేసే; అపా=అభిషేక జలం కలిగినట్టిది.

2. పాద, పా=లీలా విభూతియైన ప్రకృతిమండలాన్ని రక్షించేది.

3. అపాద, పా=పాదభిన్నమైన నిత్యవిభూతిని కాపాడేది.

4. పాదపాపాదపా। పాద=పదసంబంధులైన వారు పాదులు, అంటే పదాధికారులైన ఇంద్రాదులను; ప=రక్షించే; అ=విష్ణువు యొక్క; పాద=చరణాలను; పా=కాపాడే పాదుక.

5. పాదపా పాదపా పాదపా పాదపాపాత్। పాద=రక్షింపదగిన మాతా పిత్రాదులను; పాపాత్=మిక్కిలి రక్షించే వారి విషయమై; అపాపాత్=మిక్కిలి రక్షకులునూ కాని వారి విషయమై; అపాపాత్=శుభాన్ని కల్పించేది; అపాప+అత్=సుకృతాన్ని నశింపజేసేది;

6. అపాపాదపాపా। అ=విష్ణువును; పాపా=మిక్కిలి పానం చేసే (అనుభవించే) సత్పురుషులను; ద=శోధించే శమదమాదిగుణాలను; పాపా=పునః పునః వృద్ధియగునట్లుకాపాడేది. 7.ఆదపాపాదపా! ఆద=(ఆశ్రితులను) ఖండించే వారిని; పా=శుష్కింప జేసే; పాద=కిరణాలను; పా=కాపాడేది పాదుక.

**తా॥** స్థావర జంగమాలకు కలిగే దోషాలను తొలగించే అభిషేక తీర్థం కలది పాదుక. పరవ్యూహ విభవాదులందు భగవంతుడు ధరించిన పాదుక సంచారం చేత ఇహపరలోకాలను రక్షిస్తుంది. భగవన్నిష్ఠ నిగ్రహానుగ్రహజనకమైన పాదుక అవశ్యంగా రక్షింపదగిన మాతాపిత్రాదులను రక్షించే వారి పట్ల శుభాన్నీ, రక్షించే దక్షత కలిగి ఉన్నా రక్షింపక ఉపేక్షించే వారి విషయమై అశుభాన్నీ సంకల్పిస్తుంది. భగవదనుభవ శీలురైన సాధుజనుల శమదమాది గుణాలను వృద్ధి పరచేది ఇంద్రాది లోకపాలకులను రక్షించే భగవత్పాదుకయే. స్వాశ్రితజనవిరోధులను శోషింపజేసే కిరణాలను కాపాడేదీ పాదుకయే.

వ్యాఖ్య :- పాదుకా వైభవాన్ని ప్రశంసించే 'పాదపా"పదరచిత శ్లోకం.

ఇందు 'పద' శబ్దానికి ఉన్న అనేకార్థాలతో రచింపబడిన పదాలున్నాయి.

"పదం వ్యవసిత త్రాణ స్థాన లక్ష్మాంఘ్రివస్తుషు" (అమరకోశం)

1. "అపా"-"ఋక్ పూరబ్ధూః పథా మానక్షే" అనే వ్యాకరణ సూత్రం చేత సమాసాంత మందు 'అప్' శబ్దానికి 'అ' ప్రత్యయం.

2. పాద- "పాదోఽస్య విశ్వాభూతాని" అనే శ్రుతి వల్ల నాల్గవ భాగమైన 'ఇహలోకం' అని అర్థం 3. అపాద- "త్రిపాదస్యామృతం దివి" అనే శ్రుతి రీతిగా మూడుపాదాలు (భాగాలు) కల్గిన "పరలోకం". 5. పాద-పదం అంటే రక్షణం. "తస్యేదమ్" అనే సూత్రం వల్ల 'అణ్' ప్రత్యయంచేరగా (పాదులు) రక్షణకు సంబంధించినవారు (మాతాపిత్రాదులు) "పాపాత్, అపాపాత్"- ఇవి రెండు శత్రాంత శబ్దాలు 'పా-రక్షణే' ధాత్వర్థం వల్ల 'రక్షకులు, అరక్షకులు' అని అర్థం కలవి.

అపాపాత్- "పాపం, అతతి"- "అతసాతత్యగమనే" అనడం వల్ల 'క్విప్' ప్రత్యయంగా 'పాపాత్' రూపం. 'పాపాత్' కానిది 'అపాపాత్' శుభసంకల్పం చేసేది. మరొకటి 'అపాపాత్'- "అపాపం, అత్తి"- "అద భక్షణే"- అదోఽనన్నే" అని "విట్" కల్గిన రూపం. 'పుణ్యనాశిని' అర్థంకలది.

6. 'అం పాపాన్తి' ఇతి 'అపాపాః=విష్ణువును అనుభవించేవారు. 'అపాపాన్ దాయంతి' ఇతి 'అపాపాదాః'. అపాపులను శోధించే శమదమాదులు. "దైప్-శోధనే" ధాత్వర్థం. 'అపాపాదాన్, పాపాతి=(పునఃపునఃరక్షతి) ఇతి "అపాపాదపాపా".

"శాంతోదాంత ఉపరతస్తి తిక్షుః సమాహితో భూత్వా ఆత్మన్యే వాత్మానం పశ్యేత్" (శ్రుతి) పాదుకా సబంధం వల్ల శమదమాదులు వృద్ధి చెందుతాయి. వాటి వల్లనే కదా భగవంతుని గుణ, విభూతులను అనుభవించే వీలుకలుగుతుంది.

7. అద్యంతి (ఖండయంతి) ఇతి 'ఆదాః' విరోధులు, అని అర్థం. ఆదాన్, పాంతి (శోషయంతి) ఇతి 'ఆదపాః' "పై-శోషణే" ధాత్వర్థం. ఆదపాశ్చతే పాదాశ్చ 'ఆదపాపాదాః' (పాదశబ్దంకిరణార్థకం) ఆదపాపాదాన్ పాతి ఇతి 'ఆదపాపాదపా'. పాదుకా మణుల కిరణ ప్రసారం వల్ల విరోధులు పరాభూతులవుతారు.

ఇది "షోడశావృత్తి యమకం"

'పాదపా' అనే ఒక్క పదమే 16 సార్లు ప్రయుక్తమైన శ్లోకం. రెండు (ఆ,అ) అచ్చులు; రెండు (ప్,ద్) హల్లులు మాత్రమే ఉన్నందువల్ల ఇది 'ద్వ్యచ్+హల్కం'. అనేక (బంధాల) శబ్ద చిత్రాల సంసృష్టి, సంకరంగానూ ఉన్న విచిత్ర శ్లోకం. స్రగ్విణీవృత్తం.



1. షోడశదళ పద్మబంధం: దళమందలి 'పా'ను ఉపక్రమోపసంహారంగా, కర్ణికలోని 'ద'ను మధ్య మాక్షరంగానూ, 'పాదపా' చదువాలి



2. అష్టదళ పద్మ బంధం: కర్ణికలోని 'పా'ను ప్రవేశ నిర్గమాలతో చదువాలి.

3. చతుర్థళ పద్మబంధం : ఒకదానిలో మరొకటి చొప్పున అయిదు వృత్తరేఖలను గీసి, నాలుగు దిక్కుల నాలుగు (రేకుల) దళాలను చిత్రించాలి. ఒక్కొక్కదళంలో ఐదేసి గదులలో పై నుంచి 'పాదపాపాద' అయిదక్షరాలను, కర్ణికలో 'పా'ను వ్రాస్తే ప్రశేశ నిర్గమాలతో, దళానికి ఒక పాదం చొప్పున నాల్గు దళాలలో (శ్లోకం) నాల్గుపాదాలు పూర్తి అయ్యే విన్యాసం గల బంధమిది.



*940* *సాకేత త్రాణవేళాజనిత తతనిజ ప్రాంకణ శ్రీ ప్రభాసా*
*సాభాప్రశ్రీరట వ్యామియమమమయమి వ్యాపదుచ్ఛేదిలాసా।*
*సాలాదిచ్ఛేద తిగ్మాహవరురురువహ హ్రీకరస్యా మరాసా*
*సారామస్యాం ఘ్రి మభ్యాజతిననతిజస్థూల ముత్రాతకేసా -30*

**అర్థం** :- సాకేత-ప్రభాసా। సాకేత=అయోధ్యా నగరం యొక్క; త్రాణ,వేళా=పాలన సమయ మందు; జనిత=ఉదయించిన (కలిగిన); తత=విస్తరించిన; నిజ ప్రాంకణ=స్వీయ ఆస్థానమంటపమందు; శ్రీ ప్రభాసా=సంపత్తి ప్రకాశం కలిగినట్టి; స+ఆభా=కాంతితో కూడినట్టి; ప్రశ్రీః=ప్రకృష్టమైన త్రయీరూపశోభ కలిగినట్టి; అటవ్యాం=తాటకావనమందు;

అమమ-లాసా। అమమ=మమకారంలేని; యమి=మునుల యొక్క; వి+ఆపత్=వివిధ ఆపదలను; ఉచ్ఛేది=తొలగించే; లాసా=విలాసంకలిగినట్టి; ఆమ రాసాసా। ఆమ=అపక్వమైన; రాస=శబ్దాన్ని; అసా=అణచివేసే; సా=ఆప్రసిద్ధమైన; ఇయం=ఈ పాదుక; సాలాది-కరస్య। సాల (ర)+ఆది=బలాన్ని, ధనుస్సును ('అది' శబ్దంచేత ధనుర్గ్రహణం), ఛేద=భంగపరచే; తిగ్మ=తీక్షణమైన; ఆహవ=యుద్ధ మందలి; రు=హుంకార (శబ్ద)ం చేత; రురువహ=మృగధారియైన శివునికి; హ్రీకరస్య=సిగ్గును కలిగించిన, రామస్య=రాముడుగా అవతరించిన శ్రీరంగనాథుని యొక్క; ఉత్ త్రాతకే=ఉత్కర్షతో రక్షింప వలసిన దీనుల పట్ల; నతి, జ=(వారుచేసిన) నమస్కారం వల్ల ఏర్పడే; స్థూలం=ఉల్బణం కలిగిన; అంఘ్రిం=భగవత్పాదాన్ని; న, అభ్యాజతి, న=ప్రేరేపించక ఉండదు; ప్రేరేపిస్తూ ఉంటుంది.

**తా॥** అయోధ్యానగరాన్ని పాలించే సమయాన రత్నకాంచనాది ద్రవ్యశోభతో కూడిన సభామంట పంకలది, స్వయంగా కాంతితో కూడినది, ఋగ్యజుస్సామలనే వేదత్రయ ప్రతిపాద్యమైన తేజస్సు కలది, తాటకాటవిలో మమతారహితులైన మునులను వివిధాపదల నుండి కాపాడే శీలం కలది, ఆశ్రితులకు పరిణతి చెందని శబ్దజాలాన్ని నిరసింపజేసి చక్కని సారస్వతాన్ని ప్రదానంచేసేదీ అయిన ఈ ప్రసిద్ధపాదుక, మృగధారియైన శివుని బలాన్నీ, ధనుస్సునూ భంగం చేయడానికి హుంకారశబ్దం చేత శివుడు సిగ్గుపడే రీతిగా చేసిన శ్రీరామావతారుడైన శ్రీరంగనాథుని పాదాలకు, రక్షింప వలసిన వారిచే నమస్కరింపజేసి, సంతోషంతో స్వయంగా ఉబ్బిపోయే భగవత్పాదాలకు సాధనంగా ఉండి ప్రేరేపిస్తూ నిత్యసంశ్లిష్టయై విరాజిల్లుతుంది.

వ్యాఖ్య :- కల్యాణ రాముని రూపంలో ఉన్న శ్రీరంగనాథుని పాదుకామహిమ.

'ప్రశ్రీః'-ప్రకృష్టా శ్రీః యస్యాఃసా'. "ఋచఃసామానియజూంషిసా హిశ్రీరమృతా సతామ్". శ్రుతి. త్రయీరూప-వేదప్రతిపాద్య-యైన పాదుక, అని అర్థం. అస్యతి ఇతి అసా "అసు-క్షేపణే" ధాతువు. 'ఆమరాసస్య అసా = ఆమరాసాసా'

"వేంకటపతి కమలం" అని కవినామాంకితమైన "అష్టదళపద్మం"గా చిత్రితమైన శ్లోకం ఇది.



"మరభనయయయ" గణాలున్న "స్రగ్ధరావృత్తం"

లక్షణం :- అష్టదళ పద్మం గీయాలి. శ్లోక పాదంలో 21 అక్షరాలుంటాయి. ప్రతిపాదం యొక్క మొదటి, చివరి అక్షరం ఒక్కటే కాబట్టి దాన్ని కర్ణికలో వ్రాయాలి. రెండవ అక్షరం నుంచి పదవ అక్షరం వరకు, దళాలలో అక్షరాలను ప్రదక్షిణ క్రమంగా వ్రాయాలి. ఎనిమిది నుంచి పదివరకున్న మూడక్షరాలు అవరోహణారోహణ క్రమంగా ఉంటాయి. కర్ణికాక్షరాన్ని తొంపత, పదవ అక్షరమైతే మూడుసార్లు పలుకుతుంది. దళాల్లో ఇలాగా వ్రాస్తే, దళాగ్రాలలో

'వేంకటపతి కమల' మని ఎనిమిది అక్షరాలు సమకూరుతాయి. ప్రతిపాదాంతమందున్న నాలుగక్షరాలే తర్వాతి పాదంలో మొదట ప్రతిలోమంగా ఉన్న శ్లోకమిది. ప్రతిపాదంలోని 6,16వ అక్షరాలతో, వేంకటనాథకవి పాదుకాదేవికి సమర్పించిన పద్మమని స్పష్టమవుతుంది.

లక్షణం :- "పాదేషు ప్రథమాం త్ర్యైక్యపాదోపాంత్యాక్షర త్రయమ్।
పాదాంతర ద్వితీయాది త్రితయం చేద్వి పర్యయాత్॥
అష్టమాది త్రయం వాచ్యం గత్యాగత్యోర్భవేద్యది।
దశమస్యాధికా వృత్తి రుదయంచేద్దళాగ్రకమ్॥
యదికోణా పరిస్పృష్ట కర్ణికాక్షర వాచనమ్।
ఇదమష్టదళం పద్మం కవి సంజ్ఞాంకితం తదా॥"

*941. రమ్యేవేశ్మని పాపరాక్షసభిదా స్వాసక్త ధీనాయికా*
*నంతుం కర్మజ దుర్మదాలసధియాం సాహంతనాథీకృతా।*
*సద్వాట భ్రమికాసుతాపస తపో విస్రంభభూయంత్రికా*
*కాచిత్స్వైర గమేన కేళిసమయే కామవ్రతాపాదుకా॥-31*

**అర్థం** :- పాప-నాయికా। పాపరాక్షస=క్రూరరాక్షసుల యొక్క; భిదా=వధయందు; సు+ఆసక్త=చాల పట్టుదల గల; ధీ=బుద్ధిగల శ్రీరాముణ్ని; నాయికా=నడిపించుకొని పోవునట్టి; కేళిసమయే=క్రీడావేళలో; స్వైరగమేన=తన ఇష్టప్రకారం సంచరించడం చేత; కామవ్రతా=(ఆశ్రితుల) కోరికలను తీర్చు నియమం కలిగినట్టి; సత్+వాట, భ్రమికాసు=మునుల ఆశ్రమాల్లో సంచరించునప్పుడు; తాపస-యంత్రికా। తాపస=మునులకు; తపః=తపస్సు విషయంలో; విస్రంభ=విశ్వాసాన్ని; భూ=పుట్టించే; యంత్రికా=రేఖాత్మక ముద్రలను వేయకలిగిన; సా=ఆ; కాచిత్=అనిర్వాచ్య వైభవం కలిగిన; పాదుకా=పాదుక; కర్మజ, దుర్మద, అలస, ధియాం=దుష్కర్మల వల్ల కలిగే దురభిమానం చేత మందబుద్ధి కలవారికి; రమ్యే=అందమైన; వేశ్మని=(శ్రీరంగ) మందిరమందు; నంతుం=నమస్కరించ (సేవించ) డానికి; నాథీకృతా=స్వామినిగా చేయబడినది. హంత=ఆశ్చర్యమే.

**అర్థం** :- సుబాహు మారీచాదిక్రూర రాక్షసుల వధ కోసం మిక్కిలి పట్టుదలకల శ్రీరాముణ్ని విశ్వామిత్రుని సత్రభూమికి తీసుకొనిపోయినట్టి, లోకరక్షణార్థం విలాసంగా సంచరిస్తూ తనను సేవించే వారి కోరికలను దీర్చే నియమం కలిగినట్టి; తాపసుల ఆశ్రమాలలో శ్రీరామపాదుకా ముద్రల దర్శనం వల్ల మునులకు తపోభంగం కలుగదనే నమ్మకం కలిగించే భగవత్పాదుక, సత్కర్మ, జ్ఞాన యోగాలను అనుష్ఠించలేని బుద్ధి మాంద్యంకల జనులు తనను సేవించి ఉజ్జీవించడం కోసం శ్రీరంగధామ మందు దేవతగా వెలసి ఉంది.

వ్యాఖ్య :- అజ్ఞానులూ సేవింపదగిన దేవత పాదుక.

సుమతులనే కాదు, మందమతులనూ తరింపజేయడం ఆశ్చర్యకరమే. శార్దూల విక్రీడిత వృత్తం. కవి, కావ్యనామాంకితమైన

'మహాచక్ర బంధం.'

లక్షణం :- "కోణషట్కసమాక్రాంత మండలీనవమాత్మకే।
చక్రే నేమీతరాయాంతు మండల్యాం యత్రకుత్రచిత్।
మండలీగతి రిత్యేవ యద్వివక్షిత ముచ్యతే।
తుర్యపాదశ్చ నేమిస్థస్తన్మహాచక్రముచ్యతే॥"

ఉద్ధారం :- ఒకదానిలోపల ఒకటి చొప్పున పది వృత్త రేఖలను గీయాలి. తొమ్మిది మండలాలుగల నాభి నుంచి నేమివరకు ఆరు రేకులు గల మూడు వీథుల నేర్పరచాలి. ప్రతివీథి యందు నాభితోపాటు పందొమ్మిది గదులలో, నేమి నుంచి పందొమ్మిది అక్షరాలను వ్రాయగా మూడు వీథులలో మూడు పాదాలు పూర్తి అవుతాయి. మూడు పాదాలలోని పదవ అక్షరం నాభిలో శ్లిష్టాక్షరం అవుతుంది. మూడవ పాదంలోని చివరి అక్షరం మొదలు ప్రదక్షిణగానేమి ఉన్న మండలంలోని గదులలో నాల్గవ పాదంలోని అక్షరాలను, మూడు పాదాల ఆద్యంతాక్షరాలు శ్లిష్టంగా, వ్రాయగా శ్లోకం పూర్తి అవుతుంది. మూడవ పాదాంతాక్షరంతో నాల్గవ పాదం యొక్క మొదటి, చివరి అక్షరాలు శ్లిష్టమవుతాయి.

మూడవ మండలంలో 'వేఙ్కటనాథీయం' అనీ, ఆరవ మండలంలో "పాదుకాసహస్రం" అనీ కవి, కావ్యనామోద్ధారమూ ఉంది.



942. శ్రీ సంవేదన కర్మకృద్వసు తవస్యామృద్ధధైర్యస్ఫుట(ః)
శ్రీపాదావని! విస్తృతాసి సుఖినీ త్వం గేయయాతాయనా,
వేదాంతానుభవాతిపాతి సుతను స్సాంద్రేడ్యభావప్రథేఽ
జ్కస్థాచాచ్యుత దివ్యదాస్యసుమతిః ప్రాణస్థ సీతాధన॥ 32

**అర్థం :-** శ్రీ, సంవేదన, కర్మకృత్+వసు=త్రయీరూపవేదం తెలియ జేసే కర్మలను ఆచరించే వారి ధనమైనట్టి; (నపుంసక 'వసు' శబ్దం యొక్క సంబోధన రూపం) సాంద్ర+ఈడ్య, భావ, ప్రథే=ఘనమైన స్తుతింపదగిన ధర్మంతో కూడిన, ప్రసిద్ధి కలిగినట్టి; ప్రాణస్థసీతా ధన=ప్రాణంవలె ఉన్న సీతమ్మకు సంపత్తైనట్టి; శ్రీపాదావని=సంపత్కరమైన ఓపాదుకా! గేయ, యాత+అయనా=గానయోగ్యమైన సంచారమార్గం కలిగినట్టి; వేదాంత+అనుభవ+అతిపాతి, సుతనుః=వేదాంతమందలి అనుభవాన్ని అతిక్రమించే శీలంకల మంచి రూపం కలిగినట్టి; అంక, స్థా=(భగవంతుని యొక్క) బిరుదువలె ఉన్నట్టి; అచ్యుత దివ్యదాస్య సుమతిః=భగవంతునికి చేసే ఉత్కృష్టమైన కైంకర్యమందు శోభనమైన బుద్ధిని కలిగి యున్నట్టి; చ=మరియు; సుఖినీ=నిరతిశయసుఖం కలిగి ఉన్న; త్వం=నీవు; విస్తృతా=(నానా వతారాలయందు బహురూపవతిగా) వ్యాపించిన దానవై; అసి=ఉన్నావు. ఋద్ధ, ధైర్య,స్ఫుటః=సమృద్ధమైన ధైర్యంచేత వికసితబుద్ధి కలిగిన నేను; తవ=నీకు; స్యామ్=(శేషభూతుడనై) ఉంటాను. (ఇది 'భారద్వాజ' వారి వ్యాఖ్యాను సారమైన అర్థం)

**తా॥** వేదబోధిత ధర్మానుష్ఠాతలకు ధనంగా ఉన్నట్టి, స్తుతింపదగిన భావంచేత జగత్ప్రసిద్ధి పొందినట్టి, ప్రాణంలాగ ఉన్న సీతాదేవికి సంపత్తు వలె ఉపాదేయమైన ఓ శ్రీపాదుకా! నీ సంచారమార్గం కీర్తనీయం. వేదంతశాస్త్రం బోధించే నీ అనుభవాన్ని మించిన చక్కని రూపం కలిగి యున్నట్టి, శ్రియఃపతి' అనే బిరుదు ఉన్న భగవంతునికి శ్రీదేవిలాగా సమీపమందున్నట్టి, అచ్యుతునికి చేసే దివ్యదాస్య మందు శోభించే ప్రజ్ఞకలిగి, నిరతిశయసుఖాన్ని పొందేనీవు, భగవంతుని అనేకావతారాలకు తగినట్లు విస్తరించిన నానా రూపవతివి. నిన్నాశ్రయించిన ధైర్యంతో ఉన్న నేను మాత్రం నీ సొత్తునే సుమా!

వ్యాఖ్య :- భగవదవతారానురూపయైన పాదుకాదేవికి తాను దాసుడని కవి ప్రకటించాడు.

"అయనం వర్త్మ" (అమరం) పాదుకా సంచారమార్గాన్ని లోకులు స్తుతిస్తుంటారు.

ఈ శ్లోకంలో మొదటి పాదంలోని పదాలకు అన్వయభేదాన్ని చూపించారు శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్య స్వామి వారు. "ధైర్యస్స్ఫుటశ్రీపాదవని" ఒకటే పదం. ఇక్కడ 'ట' కారం విసర్గతో ఉంటే, ఈ శ్లోక గర్భమందున్న మరొక శ్లోకంలోని 'విసర్గరహిత టకారం" కుదురదు. ద్వితీయ పాదమందున్న మొదటి అక్షరమైన 'శ్రీ'కి శావత్తూ (శ) కుదురదు కదా!

హేస్ఫుట, శ్రీ,పాదావని=వికసితకాంతి గల ఓపాదుకా! శ్రీ సంవేదన కర్మకృత్=వేదంబోధించే కర్మలను చేయునట్టి; ఋద్ధధైర్యః=వృద్ధిని పొందే ధైర్యం కలిగిన నేను; తవ=నీ యొక్క; వసు=సొత్తుగా; స్యామ్=ఉంటాను.

ఇది 'అనుష్టుప్' శ్లోకగర్భితమైన "శార్దూల విక్రీడిత వృత్తం"

"చతురంకాష్టార చక్రబంధం" ఇది

అంకచతుష్టయం :-

"శ్రీశ్రీవేఙ్కటనాథేన, వేదాన్తాచార్యతావతా।

కవివాది మృగేన్ద్రేణ, కృతా పాదావనీనుతిః॥"

(చతుష్పాది.)



లక్షణం :- "కోణాష్టక సమాక్రాంత నవమండలచక్రగే।

చతుర్వీథీ గతే పద్యే మండలేషు యథేప్సితమ్॥

పద్యం పద్య ద్వయం వాపి యథాశక్తి సముద్ధరేత్।

మండలీ గతిరి త్యేత దష్టారం చక్రముచ్యతే॥

ప్రస్తారం :- పది వృత్తరేఖలు కలిగిన తొమ్మిది మండలాలున్న చక్రం చిత్రించాలి. దానియందు ఎనిమిది రెకులు గల నాలుగు వీథులను ఏర్పరచాలి. ప్రతివీథిలో నాభితోపాటు పందొమ్మిది గదులుంటాయి. నేమి ఉన్న మండలం నుంచి ఆరంభించి, నాలుగు వీథులలో నాలుగు పాదాల అక్షరాలను దిగ్విదిక్కుల యందు వ్రాయాలి. ప్రతిపాదంలోని దశమాక్షరం నాభిస్థానమందు శ్లిష్టమవుతుంది. 'శార్దూల వృత్తం' (శ్లోకపాదాలు) నాలుగు వీథుల యందు పూర్తి అవుతుంది. దీనిలోని మొదటి మండలంలో ప్రాదక్షిణ్యంగా "శ్రీశ్రీవేఙ్కటనాథేన" మూడవ మండలంలో "వేదాన్తా చార్యతావతా" ఆరవ మండలంలో "కవివాది మృగేంద్రేణ" ఎనమిదవ మండలంలో "కృతా పాదావనీనుతిః" అని నాలుగు పాదాల 'అనుష్టుప్' శ్లోకం ఉంది. ఇది గర్భకవిత. కవినామ, స్వరూప, గుణ, క్రియాబోధకమైనది.

*943. కనక పీఠనివిష్టతనుస్తదా*
*సుమతిదాయినిజానుభవస్మృతా।*
*విధి శివప్రముఖైరభివందితా*
*విజయతే రఘుపుంగవపాదుకా॥-33*

**అర్థం** :- తదా=అధికారకాలంలో; కనకపీఠ, నివిష్టతనుః=స్వర్ణ సింహాసనమందు ఉంచబడిన స్వరూపం కలిగిన; సుమతి-స్మృతా। సుమతిదాయి=మంచిబుద్ధిని ఇచ్చే; నిజ=తనవిషయమై; అనుభవ=దర్శనమూ; స్మృతా=స్మరణమూ కలిగిన; విధి, శివ, ప్రముఖైః=బ్రహ్మరుద్రాదులచేత; అభివందితా=నమస్కరింపబడిన; రఘుపుంగవపాదుకా=శ్రీ రాఘవుని పాదుక; విజయతే=విశేషంగా ప్రకాశిస్తుంది.

**తా॥** అయోధ్యానగర కనకమయ సింహాసనమందు ఉండి అధికారాన్ని నిర్వహించినప్పుడు స్వీయసాక్షాత్కారం చేతనూ, స్మృతిచేతనూ చక్కని బుద్ధిని ప్రసాదించ కలిగిన, బ్రహ్మరుద్రాదుల చేత నమస్కరింపబడిన శ్రీరామచంద్రస్వామి పాదుక; విశేషంగా ప్రకాశిస్తుంది.

వ్యాఖ్య :- శ్రీరాముని పాదుక రాజ్యాన్ని పాలించినప్పుడు బ్రహ్మాదిదేవతల చేతనూ వందనీయయై ప్రకాశించింది.

రఘువంశరాజుల స్వర్ణమయ సింహాసనమందున్న శ్రీరాముని పాదుకను మనుజులూ, దివిజులూ దర్శించారు, స్మరించారు, నమస్కరించారు. ఇది భిన్న వృత్తమున్న అనులోమ గోమూత్రికాబంధరచనలో మొదటి శ్లోకం ద్రుతవిలంబిత వృత్తం.

*944. దీనగోపీజని క్లిష్టభీనుత్సదా*
*రామపాదావని! స్వానుభావస్థితా।*
*ఏధి మేఽవశ్య ముత్తారభావశ్రితా*
*తేజసా తేన ఘుష్టిం గతాపాలికా ॥-34*

అర్థం :- హే రామపాదావని=ఓ రామపాదుకా! దీనగోపీజని, క్లిష్ట, భీ,నుత్=దీనులైన గోపికల సంసారాన్నీ, కష్టాలనూ, భయాన్నీ పొగొట్టినట్టి; సదా=ఎల్లప్పుడు; స్వ+అనుభావ, స్థితా=స్వీయ మహిమ యందు ఉన్నదానవు; ఉత్తార భావశ్రితా=తరింపజేసే కారణాన్ని పొందినట్టి; తేన=ఆలాంటి; తేజసా=కాంతిచేత; ఘుష్టిం=ప్రసిద్ధిని; గతా=పొందినట్టి నీవు; అవశ్యం=తప్పకుండా-నిజంగా; మే=నాకు, పాలికా=ఏలికవై; ఏధి=ఉండుము.

తా॥ ఓ శ్రీరామపాదుకా! శ్రీకృష్ణావతారంలో దీనులైన గోపికలకు (చింతయంతి, రాధలాంటి వారికి) పునర్జన్మనూ, కంసునిలాంటి దర్జనుల వల్ల కలిగే పీడనూ, ఇంద్రాదుల వల్ల కలిగే భయాన్నీ పోగొట్టిన దానవు. నిత్యం నీ మహిమయందే ప్రతిష్ఠితవు. సంసారం నుంచి తరింపజేసే కారణభూతవు. అలాంటి అనిర్వాచ్యమైన తేజస్సు చేత ప్రసిద్ధిని పొందిన నీవు నాకు అవశ్యంగా రక్షకురాలవై ఉండుము.

వ్యాఖ్య :- ఆశ్రితుల సంసార బంధాన్ని తొలగించి కాపాడేది పాదుకాదేవి.

నుత్- "నుద-ప్రేరణే" ధాతువునకు 'క్విప్' ప్రత్యయం. ఉత్తార-"తారయతి" అనే ధాతువునకు 'కరణ' మందు 'ఏరచ్' ప్రత్యయం. 'ఘుష్టి' శబ్దం- "ఘుషిర్-విశబ్దనే" ధాతువు వల్ల స్త్రీలింగమందు 'క్తిన్' ప్రత్యయం. 'ఏధి'- "అస-భువి" ధాతువు యొక్క 'లోట్' మధ్యమ పురుషైక వచనం.

ఇది స్రగ్విణీ వృత్తం. 943 ద్రుతవిలంబిత వృత్తం కదా! వేర్వేరుగా ఉన్న ఈ రెండు వృత్తాలతో, పూర్వార్థంలోనూ, ఉత్తరార్థంలోనూ ఒక అక్షర భేదం చేత-ప్రతి రెండవ అక్షరాన్ని శ్లిష్టంగా కూర్చి-"అనులోమ గోమూత్రికాబంధం" చిత్రింపబడింది.




(శ్లో 943,944) "భిన్న వృత్తానులోమ గోమూత్రికాబంధం"

*945.* ధామని రాకృత తామసలోకా
ధాతృముఖైర్వీన తానిజ దాసైః।

*పాపమశేష మపాకురుషే మే*
*పాదు!విభూషిత రాఘవపాదా॥-35*

**అర్థం** :- హేపాదు=ఓపాదుకా!ధామ నిరాకృత తామస లోకా=తేజస్సుచేత నిరాకరింపబడిన తమోగుణమయులైన జనులు కలిగినట్టి; నిజదాసైః=(తన) నీ దాసులైన; ధాతృముఖైః=బ్రహ్మాదులచేత; వినతా=నమస్కరింపబడినట్టి; విభూషిత రాఘవపాదా=అలంకరింపబడిన శ్రీరాముని చరణాలు కలిగిన నీవు; మే=నాయొక్క; పాపం=దురితాన్ని; అశేషం=పూర్తిగా; అపాకురుషే=పోగొట్టుము.

**తా॥** ఓ పాదుకాదేవీ! ఆసుర ప్రకృతి కలవారిని స్వీయతేజస్సుచేత నిరసించినట్టి, నీకు దాసులైన చతుర్ముఖ బ్రహ్మాదులచే నమస్కరింపబడినట్టి, శ్రీరాముని పాదాలను అలంకరించిన నీవు, నా పాపాన్ని పూర్తిగా పోగొట్టుము.

వ్యాఖ్య :- మహాతేజస్విని శ్రీరామపాదుక పాపహారిణి.

ఇది "దోధక వృత్తం" (దోధకవృత్తమిదం భభభాద్గౌ!!)

భిన్న వృత్తమున్న ప్రతిలోమ గోమూత్రికాబంధంలో మొదటి శ్లోకమిది. ప్రతిలోమంగా వ్రాసే శ్లోకం తర్వాతది.

*946. కృపానఘత్రాత సుభూరదుష్టా*
*మేధ్యా రుచా పారిషదామభూపా।*
*పాదావని! స్త్యాన సుఖైర్నతృప్తా*
*కాంత్యా సమేతా ధికృతాఽనిరోధా॥-36*

**అర్థం** :- హేపాదావని=ఓపాదుకా! కృపా+అనఘ,త్రాత, సుభూః=దయచేత దుఃఖం (దోషం) లేకుండా రక్షింపబడిన పుణ్యభూమికల్గిన; అదుష్టా=దోషరహితయైన; రుచా=కాంతిచేత; మేధ్యా=పరిశుద్ధయైనట్టి, పారిషదా=పరిషత్తునందు సాధువైనట్టి; భూపా=భూమిని పాలించునట్టి; స్త్యాన సుఖైః=అధిక సుఖాలచేత; న, తృప్తా=తృప్తి లేని దానవు; (కాబట్టి) కాంత్యా=భగవచ్చరణ సంగమేచ్ఛతో; సమేతా=కూడుకొన్నట్టి; అధికృతా=అధికారయుక్తవైనట్టి; అనిరోధా=అడ్డులేని నీవు; ఆమ=రమ్ము.

**తా॥** ఓపాదుకాదేవీ! ఆర్యావర్తంమొదలైన పుణ్యభూమిని బాధపడకుండా కాపాడునట్టి; నిరవద్యవైనట్టి, పావన రత్నకిరణకాంతి కలిగినట్టి, సాధుసభా పరిష్కారికయైనట్టి, అర్చావతారమందు భూలోకాన్ని రక్షించునట్టి, భగవంతుని పాదాల సంగమం వల్ల కలిగే అధిక సుఖాలతో తృప్తిపడని దానవు కాబట్టి భగవత్పాదాల యందు నిత్య సంశ్లిష్టవైనట్టి, కోసలదేశ రక్షణ సమయాన అధికారయుక్తవైనట్టి, అప్రతిహత సంచారంగల నీవు పూజా సమయాల్లో సన్నిధానానికి రమ్ము.

వాఖ్య :- గుణగరిష్టయైన పాదుకాదేవి పూజనీయ.

"పరిషది సాధుః"- పారిషాదా। ణో౽పీష్యతే" అని సాధ్వర్థమందు పరిషచ్ఛబ్దానికి 'ణ' ప్రత్యయం- "ఆమ"- 'అమ-గత్యాదిషు' అని ఆఙ్ పూర్వకమైన 'అమ' ధాతువు యొక్క 'లోట్' మధ్యమ పురుషైక వచనం.

పారిషద+అమ, భూపా=తనను చేరిన భరతుడు మొదలైన సభాజనులను ఆశ్రయించిన సకల సంపత్సమృద్ధి గల భూపతులు కలది-పాదుక-అని ఒకే పదంగానూ చెప్పవచ్చును. ఇది, ఉపజాతి వృత్తం. (ఉపేంద్రవజ్రా, ఇంద్ర వజ్రావృత్తాల సంకీర్ణం)

మ దా త మ లో ధా ము ర్వి తా జ సై
ధా ని కృ తా స కా త్ర శై న ని దా
రా తా ధి మే ల్యోం ప్తా ర్న సు స్తా వ పా 2

ప శే మ కు షే పా వి షి రా వ దా
పా మ ష పా రు మే దు భూ త ఘ పా
భూ దా రి చా ధ్యా స్తా ర సు త్రా న కృ

'945'వ శ్లోకాన్ని అనులోమంగా వ్రాయాలి '946'వ శ్లోకాన్ని ప్రతిలోమంగా వ్రాయాలి. (బేసి) అయుగ్మాక్షరాలు శ్లిష్టాలు. కాబట్టి '946'వ శ్లోకం భిన్నవృత్తం, ప్రాతిలోమ్యం (తలక్రిందు) గా వాచ్యమానం.

*947. సారస సౌఖ్యసమేతాఖ్యాతా పదపాభువి స్వాజ్ఞా।*
*సాహసకార్య వనాశాధీరా వసుదానవ న్యాసా॥-37*

**అర్థం** :- సారస సౌఖ్య సమేతా=పద్మాలచే సుఖంకలిగి యున్న; సు+ఆజ్ఞా=చక్కని ఆజ్ఞను చేసే; సాహసకారి+అవన+ఆశా=పిడివాదం చేసే భరతుణ్ని కాపాడే కోరిక కలిగిన; ధీరా=ధైర్యం కలిగియున్న; వసుదా=ఐశ్వర్యాన్ని ఇచ్చునట్టి; నవన్యాసా=కొత్త సన్నివేశాలు కలిగిన; పదపా=పాదుక; భువి=భూలోకమందు; ఖ్యాతా=ప్రసిద్ధమయినట్టిది.

**తా॥** పూజలో సమర్పింపబడిన తామర పూవులచే సుఖవతియైన, హితమైన ఆజ్ఞనొసగునట్టి, సాహసకారియైన భరతుణ్ని రక్షించే ఇచ్ఛకల్గిన, ధీరయైన, ధనదాయినియైన, కొత్త కొత్త, నవరత్నా లమరియున్న పాదుకాదేవి భూలోకంలో పేరు గాంచినట్టిది.

వ్యాఖ్య :- పాదుక, ఆశ్రితులను రక్షించే అధ్యవసాయం కలది.

సార ససౌఖ్య సమేతా-సారమైన సౌఖ్యంతో కూడిన భగవంతునితో చేరియుండేది, పాదుక-అన్న అర్థమూ ఉంది. 'భరతుడు సాహసకారి' అనడానికి "శ్రీరామచంద్ర స్వామి అయోధ్యకు తిరిగి రానంతదాకా పర్ణశాల

ముందు ప్రాయోపవేశం చేస్తాను."- "శేష్యేపురస్తాచ్ఛాలాయా యావన్న ప్రతియాస్యతి" రామాయణం ప్రమాణం.

ఆర్యాభేదశ్లోకమిది. భిన్న వృత్తానులోమ ప్రతిలోమంగా ఉన్న రెండు శ్లోకాలలో ఇది మొదటి శ్లోకం. అనులోమంగా ఉన్న ఈ శ్లోకంలోని ఉత్తరార్థం, తర్వాత ఉన్న ప్రతిలోమశ్లోకానికి పూర్వార్థమవుతుంది.

*948. సాన్యావనదా సువరా ధీశానా వర్యకాసహసా।*
*జ్ఞాస్వా విభుపాదపతాఖ్యాతా మేసఖ్యసౌ సరసా॥-38.*

**అర్థం** :- సాన్యా=బాగాభజింపదగిన; అవనదా=రక్షణనిచ్చే; సహసా=శీఘ్రంగా; సువరా=సుఖంగా వరింపదగిన; అధీశానా=ఈశ్వరియైన, వర్యకా=శ్రేష్ఠమైన సుఖం కలిగిన; జ్ఞా=జ్ఞానమున్న; స్వ+అ=తనవాడైన విష్ణువు కలది; విభు, పాదపతా, ఖ్యాతా=శ్రీరంగనాథుని చరణాలను రక్షిస్తున్నదవడం చేత ప్రసిద్ధమైన; అసౌ=ఈ పాదుక, మే=నాకు; సరసా=స్నేహంతో కూడిన; సఖీ=హితాహితాలను ఉపదేశించే అప్తురాలు.

**తా॥** ఆశ్రితులకు భజింపదగినదై శీఘ్రంగా రక్షించేదీ, సుఖంగా కోరదగినదీ, స్వయంగా మంచి సుఖం కలదీ, సర్వజ్ఞయైనదీ, భగవంతుణ్ని వశపరచుకొన్నదీ, మనకందరకు ప్రభ్వియై, భగవత్పాద రక్షణమనే తన్మయత్వం చేత ప్రసిద్ధి పొందినదీ అయిన ఈ పాదుక వాత్సల్యంతో నాకు యుక్తాయుక్తాలను బోధించే అప్తురాలు.

వ్యాఖ్య :- శ్రీరంగనాథుని పాదుక హితాహితో పదేష్ట్రియైన వాత్సల్యవతి.

"షణ-సంభక్తౌ" ధాతువు. కర్మార్థకమందు "ఋహలోఃణ్యత్" వల్ల "సాన్యా" పదం ఏర్పడింది. "వృఙ్-వరణే" ధాతువు. 'సు' పూర్వక 'ఖల్' ప్రత్యయం వల్ల "సువరా" పదం నిష్పన్నం. వర్యం కం యస్యాఃసా=వర్యకా. ఆర్యాభేద వృత్తమిది.

(947)పూర్వశ్లోకాన్నే ప్రతిలోమంగా పఠింపదగిన శ్లోకమిది.

*949. తారస్ఫార తర స్వర రసభరరా సా పదావనీ సారా।*
*ధీర స్వైరచరస్థిర రఘుపురవాస రతిరామ సవా॥-39.*

**అర్థం** :- ధీర-సవా। ధీర=దృఢ బుద్ధికల; స్వైరచర=ఇష్టమైనట్లు సంచరించే; స్థిర=చలించని; రఘుపురవాస=అయోధ్యానగరవాసమందు; రతి=అభిలాషగల; రామ=శ్రీరాముడు; సవా=ప్రేర్యుడుగా కలిగిన; తార-భరరా। తార=ఉచ్చైస్తరమైన; స్ఫారతర=అధికమైన; స్వర=నాదం చేత; రస భర=పూర్ణానందాన్ని; రా=ఇచ్చునట్టి, సా=ఆ, పదావనీ=పాదుక; స+ఆరా=గమనంతో కూడింది.

**తా॥** ధీరుడైన స్వేచ్ఛాచారియైన సాకేతనగరమందు నివసించే ఆసక్తి గల శ్రీరాముణ్ని ప్రేరేపింప కలిగిన, తారస్థాయి గల తన గొప్ప నాదంచేత సంపూర్ణానందాన్ని ప్రసాదించే పాదుక ఆశ్రితులను కాపాడడానికి అంతట సంచరిస్తుంది.

వ్యాఖ్య :- శ్రీరంగనాథుని పాదుక ఆశ్రిత రక్షణకోసం సంచరించే శీలవతి.

"షూజ్-ప్రేరణే" ధాతువుకు 'ఏరచ్' ప్రతయం వల్ల "సవా" పదం - "స్ఫారం భూయశ్చ భూరిచ" (అమరకోశం). "ఋ-గతౌప్రాపణేచ" అనే ధాతువుకు భావార్థక మందు "ఘఞ్" ప్రత్యయం చేరడం వల్ల "ఆరం" పదం। "ఆరేణ సహితా=సారా"। ఆర్యావృత్తం.

"పాదుకా యుగళ గర్భకర్ణిక మష్టదళ పద్మబంధం" ఇది.

అష్టదళపద్మబంధ చిత్రమందే పాదుకాయుగళాన్ని కర్ణికగా వేదాంత దేశికులు చిత్రించినారు. ఒక చిత్రబంధమందు మరొక చిత్రాన్ని నిబంధించడం అపూర్వం. పాదుకాబంధం చిత్రకవితలో ఇంతకు ముందు లేదు. ఈ ప్రజ్ఞ నాన్యతో దర్శనీయం.

ఉద్ధారం :-




అష్టదళ పద్మమందు రెండు పాదుకలను కర్ణికగా చిత్రించాలి. కర్ణికలో 'ర' అక్షరాన్ని వ్రాయాలి. మొదటి, మూడవ పాదాలలోని 1,3,5,7. అక్షరాలను క్రమంగా ఎనిమిది దిగ్దళాలలో వ్రాయగా, కర్ణిక యందున్న రేఫం వాటికి రెండవ అక్షరంగ శ్లిష్టమవుతుంది. రెండవపాద ప్రథమాక్షరమైన కర్ణికారేఫానికి కుడి ప్రక్కన ఉన్న పాదుక యందు ద్వితీయ, తృతీయ, పంచమాక్షరాలను, చిటికెన వ్రేలునందు షష్ఠాక్షరాన్నీ, తర్వాత అంగుష్ఠం నుంచి నాలుగు వ్రేళ్ళల్లోనూ క్రమంగా నాలుగక్షరాలను-పదావనీ-వ్రాయాలి. మళ్ళీ కనిష్ఠికలోని అక్షరమూ, పంచమాక్షరమూ శ్లిష్టమవుతాయి.

అలాగే ఎడమపాదుక యందు నాల్గవ పాదమందలి ద్వితీయ, తృతీయ, పంచమాక్షరాలను వ్రాసి, దాని చిటికెన వ్రేలు నుంచి బొటనవ్రేలు వరకు క్రమంగా (6 నుంచి 10) అయిదక్షరాలను-సరతిరామ-వ్రాయాలి. కనిష్ఠకలోని అక్షరమూ, పాదుక మీది పంచమాక్షరమూ వ్యుత్క్రమంగా శ్లిష్టమవుతాయి. పది అంగుళాల్లో క్రమంగా "సరతి

రామపదావనీసా'' వాక్యముంటుంది. ఈ శ్లోకరచనతో పాదుకా యుగళ సన్నివేశం దేశికోపజ్ఞకం.

*950. చరమ చరంచ నియంతు*
*శ్చరణా వనిదం పరేతరా శౌరేః।*
*చరమ పురుషార్థ చిత్రౌ*
*చరణావని! దిశసి చత్వరేషు సతామ్॥-40*

**అర్థం** :- హే చరణావని=ఓపాదుకాదేవీ! అనిదం పరేతరా=అదేఅభిప్రాయం కలదానివై; చరం=జంగమాన్ని; అచరం, చ=స్థావరాన్నీ; (ఈ రెండింటిని కూడా) నియంతుః=నియమించే; శౌరేః=శ్రీరంగనాథుని యొక్క; చరమ పురుషార్థ, చిత్+త్రౌ=చివరి పురుషార్థమైన మోక్షం యొక్క జ్ఞానాన్ని రక్షించే; చరణౌ=పాదాలను; సతాం=యాథాత్మ్య జ్ఞానం కలవారియొక్క; చత్వరేషు=గృహాంగణాల యందు; దిశసి=ఇస్తున్నావు-ప్రదర్శిస్తున్నావు.

**తా॥** ఓ పాదుకాదేవీ! శ్రీరంగనాథుని పాదప్రదానమే ముఖ్యమైన ఉద్దేశ్యం కలదానివై చరాచరాలను రెంటినీ నియమించే శీలంకల శ్రీరంగనాథుని మోక్షజ్ఞానాన్ని కాపాడే పాదాలను సజ్జనుల ముంగిళ్ళలోనికి తెచ్చి ప్రదర్శిస్తుంటావు.

వ్యాఖ్య :- పాదుకానుగ్రహం వల్ల సత్పురుషులు ముంగిళ్ళలోనే శ్రీరంగనాథుణ్ని సేవిస్తారు.

భగవంతుని పాదాలను సేవించేడమే మోక్షం. ''చితీ-సంజ్ఞానే''. ''త్రైజ్-పాలనే'' ధాతువుల వల్ల ఇక్కడ ''చిత్ర'' శబ్దం నిరూపితం. భగవత్పాద దర్శన సేవనాదులన్నీ పాదుకాధీనమని ప్రకటిస్తూ, ఈ ''చిత్ర'' ప్రదర్శనం పాదుకాదేవి చేత చేయబడుతుందని (వర్ణించి) ముగించారు దేశికులు. ఆర్యావృత్తం.

"పాదద్వయ భాగద్వయావృత్తి యమకమ్" ఇది. మొదటి పాదంలోనూ, మూడవ పాదంలోనూ 'చరమ' పదావృత్తి, రెండవ, నాల్గవ పాదాలలో 'చరణావని' ఆవృత్తి; నాలుగు పాదాలలోనూ 'చర' అనే రెండక్షరాల ఆవృత్తి సంభవించడం వల్ల ఇది యమకానుప్రాసల సంకరంకదా!

**చిత్ర పద్ధతి సమాప్తం.**

# 31. నిర్వేద పద్ధతి

*951. ప్రపద్యే పాదుకాందేవీం పరవిద్యామివ స్వయమ్।*
*యామర్పయతి దీనానాం దయమానోజగద్గురుః॥-1*

**అర్థం** :- జగత్+గురుః=చరాచరప్రపంచానికి ఆచార్యుడైన శ్రీరంగనాథుడు; దయమానః=కృపాళువై; దీనానాం=గతిలేనివారికి; పరవిద్యాం, ఇవ=పరభక్తిని వలె; దేవీం=క్రీడాపరురాలైన, సకల గుణాలచే ధీప్యమానయైన; యాం=ఏ పాదుకను; స్వయం=తానే; అర్పయతి=ప్రసాదించునో; (తాం=ఆ) పాదుకాం=పాదుకాదేవిని; ప్రపద్యే=శరణం పొందుతున్నాను.

**తా॥** జగదాచార్యుడైన శ్రీరంగనాథ భగవానుడు సంసారబంధం చేత ఖిన్నులైన వారికి దయాళుడై పరవిద్యను వలె, సర్వగుణాలచే ప్రకాశిస్తున్నఏ పాదుకను సమర్పిస్తున్నాడో, ఆ పాదుకాదేవిని ప్రపత్తి చేస్తున్నాను.

**వ్యాఖ్య** :- పాదుకాదేవిని ప్రపదన పూర్వకంగా కవి స్తుతించే శ్లోకం.

'చిత్ర పద్ధతి'లో నలుభైశ్లోకాల చేత పాదుకాదేవి మంగళమూర్తినీ, గుణాలనూ వర్ణించారు. బంధకవిత్వం అంటే శబ్దాలను ఏర్చికూర్చి చిత్రించడం ప్రజ్ఞాపాటవాలకు నికషోపలమే, చమత్కారజనకమే. అయినా, అక్షర నియమబద్ధమైన గతులలో సాగే చిత్రకవిత్వం సరసంగా ఉండదని విజ్ఞులమాట. కాబట్టి, చిత్ర కవితా భ్రమవల్ల కలిగిన ఖేదంతో తన అపరాధాన్ని కవి, పాదుకాదేవికి నివేదించుకొంటూ స్తుతించే ఈ పద్ధతి 'నిర్వేద పద్ధతి'.

మానవుడు శాస్త్రం వల్ల పొందవలసిన విషయాలు మూడు. తత్త్వం, హితం, పురుషార్థం. ఇంత వరకు తత్త్వం-పాదుకాదివ్య మంగళ స్వరూప గుణవైభవం-చిత్రితం. ఈ పద్ధతిలో మనమందరం హితాన్ని, పురుషార్థాన్ని పొందడం కోసం, దేశికులు పాదుకాదేవిని ప్రార్థిస్తున్నారు.

ఈశ్లోకం లో పాదుకాదేవి పరవిద్యగా ఉపమింపబడింది. పరవిద్యను బోధించే వాడు ఆచార్యుడు.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యోవైవేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (శ్రుతి) "తేనే బ్రహ్మహృదాయ ఆది కవయే" (భాగవతం) తొలుత శ్రీమన్నారాయణుడు చతుర్ముఖ బ్రహ్మను సృజించాడు. అతనికి వేదాలనూ ఉపదేశించాడు. కాబట్టి, వేద సంప్రదాయ ప్రవర్తకుడై జగత్తుకే గురువుగ భజనీయుడైన వాడు భగవానుడే.

సంసారతాపత్రయం వల్ల ఖిన్నులైన ఆశ్రితజనులకు ఆచార్యులు భగవత్కృపా పరతంత్రులై పరవిద్యను ఉపదేశిస్తారు. 'విద్య' అంటే జ్ఞానం. ఇది రెండువిధాలు.

"ద్వేవిద్యేవేదితవ్యే, పరాచైవా పరాచ, తత్రాపరా-

అధపరా। యయా తదక్షర మధిగమ్యతే" (ముం. ఉప)

"ఆగమోత్థం వివేకాచ్చ, ద్విధా జ్ఞానం తథోచ్యతే" (స్మృతి.) శ్రీభాష్యంలో భగవద్రామానుజులు ఈ విషయాన్నే "అదృశ్యత్వాధి కరణ" మందు "బ్రహ్మ విషయే పరోక్షా పరోక్షరూపేద్వేజ్ఞానే ఉపాదేయే" అని విశదీకరించారు.

ముముక్షువు పరబ్రహ్మ విషయమై మొదట వేదశాస్త్రశ్రవణం వల్ల కలిగే పరోక్షజ్ఞానాన్ని పొందవలెను. ఇది అపరవిద్య-తర్వాత; బ్రహ్మసాక్షాత్కారానికి కారణమైన ఉపాసన అనే దర్శన సమానాకార భక్తిజ్ఞానాన్ని-పరవిద్యను-పొందవలెను. కాబట్టి "పరవిద్య" అంటే పరభక్తి, 'భక్తి' అంటే ప్రీతిపూర్వకమైన నిరంతర ధ్యానం లేదా ఉపాసన.

"ప్రీతి పూర్వమనుధ్యానం భక్తిరిత్యభిదీయతే"

ప్రత్యక్షంగా పరబ్రహ్మను దర్శించడానికి హేతువైన భక్తి. "దర్శనంతు పరాభక్తిః"

సదాచార్యుడు ఉపదేశించిన పరవిద్య ఆశ్రితులను-శిష్యవర్గాన్ని-ఉజ్జీవింపజేస్తుంది. జగద్గురువైన శ్రీరంగనాథుడు భక్తుల శిరస్సు నందు సమర్పించిన తన పాదుక-శఠారి-భక్తులకు ముక్తినిస్తుంది. కాబట్టి శ్రీవేదాంతదేశికులు పాదుకాదేవిని గూర్చి ప్రపత్తి చేశారు.

"భగవత్ప్రవృత్తి నివర్తక స్వప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః" భగవంతుని (రక్షణ) ప్రవృత్తిని అంటే ప్రయత్నాన్ని ఆటంక పరచే (జీవుడు) తనను తాను రక్షించుకొనే ప్రయత్నాన్ని మానుకోవడమే 'ప్రపత్తి' యొక్క నిర్వచనం కదా! శ్రీరంగనాథస్వామి దయాళుడై పాదుకను సమర్పిస్తుంటే, ఆపాదుకయే తనకు ఉపాయం-శరణం-అనే అధ్యవసాయంతో పాదుకను ప్రార్థించడం భక్తిరూపాపన్న జ్ఞానం కలవారి లక్షణం. ఉపమాలంకారం, వాక్యార్థ హేతుక కావ్యలింగాలంకార సంకీర్ణం. అనుష్టుబ్ఛందం.

***952.*** *అపిజన్మని పాదుకే। పరస్మి*
*న్నన ఘైఃకర్మభిరీదృశోభవేయమ్।*
*య ఇమే వినయేన రంగభర్తు*
*స్సమయేత్వాం పదయోస్సమర్పయంతి॥-2*

**అర్థం :-** హే పాదుకే=ఓ పాదుకా! రంగభర్తుః=శ్రీరంగనాథుని యొక్క; పదయోః=చరణాలయందు; సమయే=తగిన సమయంలో; యే=ఎవరైతే; ఇమే=వీరు; వినయేన=నమ్రతతో; త్వాం=నిన్ను; సమర్పయంతి=సమర్పింతురో; (అహం=నేను) పరస్మిన్=తర్వాతదైన; జన్మయందు (మోక్షరూపమైన భవిష్యజ్జన్మయందు); అనఘైః=దోషరహితమైన; కర్మభిః=అర్చన రూపమైన కర్మలచేత; ఈ దృశః=వీరివంటివాడను; అపిభవేయం=అగుదునా?

తా॥ ఓ పాదుకాదేవీ! శ్రీరంగనాథస్వామి చరణాలయందు లీలాసంచార వేళల్లో నీ పరిచారకులు వినయంగా నిన్ను సమర్పిస్తుంటారో, తర్వాత నేను మోక్షరూపమైన జన్మయందు ప్రతిబంధకంలేని సేవారూపకర్మలచేత నీ పరిచారకుల వంటివాడను అవుతానా?

వ్యాఖ్య :- పరజన్మలో పాదుకార్చన పరుడను కావాలని కవి ఆకాంక్ష.

పాదుకాదేవిని సేవించడం, తలమీద ధరించడం, భగవత్పాదాల యందు సమర్పించడమనే కైంకర్యమే ఉత్తమపురుషార్థం. ఇలాంటి మోక్షఫలాన్ని పొందడానికి తగిన ఉపాయాన్ని తానిదివరకు అనుష్ఠించలేదు. తన దుష్కర్మలే హితాన్ని అనుష్ఠించకుండా ప్రతి బంధకాలైనాయి. ఇక మీద సత్కర్మలను అనుష్ఠించి మోక్షఫలాన్ని పొందవలెనని కవికేసరి ఆశయం.

వైకుంఠంలో నిత్యులకూ, ముక్తులకూ, భగవంతుని వలె స్వరూపాన్ని పొంది, భగవత్కైంకర్యం భగవంతుని ఆనందంకోసమే చేసే అనుభవం ఉంటుంది. దీన్ని 'ముక్తైశ్వర్యం' అంటారు.

పరమాత్మని పట్ల రక్తిగలవారికి ప్రాకృతిక విషయాల మీద విరక్తి కలుగుతుంది. "పరమాత్మనియోరక్తః విరక్తోఽపరమాత్మని." పరమభక్తాగ్రేసరులైన శ్రీమదాచార్యుల వారికి ముక్తానుభవం పరిపూర్ణంగా ఉంది. అయినా, భగవంతునికి కైంకర్యం చేసే విషయమై ఇతోధికమైన ఆదరాతిశయంతో, భవిష్యత్కాలాన మోక్షరూపమైన జన్మయందు పాదుకా పరిచారకుడుగా ఉండాలని ప్రార్థిస్తున్నారు.

పరవిద్య (పరబ్రహ్మోపాన) వల్ల భగవదనుభవం సంపూర్ణంగా కలుగునట్లే, పాదుకాస్తోత్రం వల్ల కూడా భగవత్పాదాలకు పాదుకలను సమర్పించే నిత్యసూరుల, ముక్తపురుషుల వంటి అనుభవం తనకూ అవశ్యంగా కలుగుతుందనే మహావిశ్వాసం కలవారు శ్రీమద్వేదాంతదేశికులు.

"స ఏకధా భవతి, ద్విధాభవతి, త్రిధాభవతి" (ఛాం.ఉప)

నిత్యసూరులు, ముక్తపురుషులు అనేకరూపాలను ధరించి, అనేక విధాలుగ భగవంతునికి కైంకర్యం చేస్తారని ఉపనిషత్తు చెబుతుంది.

"ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్" నిత్యసూరులూ, ముక్తులూ స్వేచ్ఛా గృహీత దేహులై ఆ, ఈ లోకాల్లోనూ భగవంతుణ్ని సేవించడానికి సంచరిస్తారని (భృగువల్లి) మరొక ఉపనిషత్తు చెబుతుంది. 'తిరువాయి మొళి'లో (5-9-1) 'మానేయ్‌నోక్కు' పాశురంలోని 'తేనార్ శోలైకళ్‌శూళ్' అన్నచోట 'నంబిళ్ళై' వారి వ్యాఖ్య ఇలా ఉంది.

"ఆహృత సహజదాస్యాః సూరయఃస్రస్తబంధాః
విమల చరమ దేహాఇత్యమీ రంగధామ్ని।
మహిత మనుజ తిర్యక్ స్థావరత్వాః శ్రయంతే

సునియత మితి హస్మ్రపాహురేభ్యోనమస్స్పాత్॥'' (1-33)

ఏనాడూ సంసారబంధం లేకుండా, భగవత్కైంకర్యమే సహజ సిద్ధంగా ఉండేవారు నిత్యసూరులు. సంసారబంధం నుంచి విడివడిన వారు ముక్తపురుషులు. పూర్వజన్మలలో చేసిన పుణ్యకర్మల వల్ల పాపరాశి నశించి పవిత్రదేహులై భగవద్భక్తిని పొంది, అదే చివరిజన్మగా కలవారు ముముక్షువులు. ఈ నిత్యులూ, ముక్తులూ, ముముక్షువులూ శ్రీరంగక్షేత్రానికి వచ్చి మానవులై, పశువులై, పక్షులై, చెట్లు-చేమలై స్వామిని సర్వదాసేవిస్తుంటారు, అని ఐతిహాసికులు చెప్పినారు. ఇట్టి రూపధారులైన మహనీయులకు నమస్కారమని శ్రీపరాశరభట్టరు 'శ్రీరంగరాజస్తవం' చేశారు.

"రామావతారత్తిలుమ్ ఒరులక్ష్మణాదికళ్, వానరత్వంగళై
యడైందార్‌కళ్, విభీషణాదికళ్ పత్తిక్కిడన్దార్‌కళ్'' (ఈడువ్యాఖ్య)

శ్రీరామావతారంలో లక్ష్మణాది నిత్యసూరులూ, వానరాది ముక్తపురుషులూ, విభీషణాది ముముక్షువులూ స్వామికైంకర్య నిష్ఠాగరిష్ఠులైనారు కదా! అలాగే, దేశికులు మోక్షానంతరం భగవంతునిలాగా ఇష్టమైన రూపాన్ని ధరించి శ్రీరంగధామ మందు ముక్తైశ్వర్యమైన భగవత్కైంకర్యం చేయకోరుతున్నారీ శ్లోకంలో. ప్రేయో౭లంకారం. ఔపచ్ఛందసికం

**953.** *పరివర్తయితా పితామహాదీన్*
*త్వమివానం తమసౌ వహత్యనేహా*
*అధునా౭పి నశౌరి పాదుకే! త్వా*
*మనఘాలంబన మభ్యుపైతి చిత్తమ్॥-13*

**అర్థం** :- హేశౌరి పాదుకే=ఓ భగవత్పాదుకా! పితామహ+ఆదీన్=తాతలు మొదలైన వారిని/బ్రహ్మాదులను; పరివర్తయితా=క్రమంగా మారుస్తున్న; అసౌ=ఈ; అనేహా=కాలం, త్వం, ఇవ=నీవలె; అనంతం=అంతంలేకుండా/ భగవంతుణ్ని; వహతి=ప్రవహిస్తుంది/వహిస్తుంది.

అధునా, అపి=ఇప్పటికి కూడా, చిత్తం=మనుస్సు; త్వాం=నిన్ను; అనఘ+ఆలంబనం=రమణీయమైన ధ్యాన విషయంగా; న,అభి+ఉప+ఏతి=చక్కగా పొందుతు లేదు.

**తా॥** ఓ శౌరి పాదుకా! బ్రహ్మాదులను కల్పభేదం చేత మారుస్తూ, నీవు భగవంతుణ్ని వహిస్తూ సంచరిస్తున్నట్లే, తాతలముత్తాతలను దొరలించు కొంటూ, ఈ కాలం ముగింపు లేకుండా గడచిపోతున్నది. అయినా, ఇప్పటికీ నా మనస్సు శుభాశ్రయంగా నిన్ను పొందుతు లేదు.

వ్యాఖ్య :- పాదుకాదేవిని నిశ్చల మనస్సుతో ధ్యానించే కాలమెప్పుడు వస్తుందో? అని కవికేసరి నిర్వేదం.

ఎందరో బ్రహ్మలు పుట్టి అధికారం నడిపినారు, మారిపోయినారు. కాలం అనంతంగా దొరలిపోతున్నది.

ఇంతకాలం గడచినా, నా మనస్సు మారుతులేదు.

"పరమేష్ఠీ పితామహః" "కాలోదిష్టోఽప్యనేహాపి" (ఉభయత్ర అమరకోశం)

పితామహాదులను మారుస్తున్న కాలమూ, భగవంతుణ్ని వహించి సంచరిస్తున్న ఓ దేవీ! నీవూ, నా మనస్సును ప్రవృత్తి మార్గం నుంచి నివృత్తి మార్గానికి మార్చలేరా? మనోనిగ్రహం కలిగి, నిన్ను ఉపాసించేకాలం ఇకనైనా నీ అనుగ్రహంచేత కలిసివస్తే మేలు; లేనిచో స్వాధీనమనస్కుడను కాని నాకెంత కష్టం దాపరిస్తుందో కదాఃఅయ్యో! నేనేమిచేయాలి? అని విన్నవించుకొంటున్నారు దేశికులు.

శ్లేషతోకూడిన ఉపమాలంకారం. ప్రేయోలంకారం కూడా ఉంది. ఔపచ్ఛందసికం. (ససజగగ-సరభయ)

*954. కమలాధ్యుషితే నిధౌనిరీహే*
*సులభే తిష్ఠతి రంగకోశమధ్యే।*
*త్వయి తత్ప్రతిలంభనే స్థితాయాం*
*పరమన్విచ్ఛతి పాదుకే! మనోమే॥-4.*

**అర్థం** :- హే పాదుకే=ఓ పాదుకాదేవీ! కమలా+అధ్యుషితే=లక్ష్మీదేవి అధిష్ఠించిన/కమల+అధ్యుషితే=రాగి 'పాత్రయందు ఉంచబడిన; నిరీహే=పూర్ణకామమైన/కోరికను పెంచే; సులభే=సుఖంగా పొందదగిన/త్రవ్వకుండా లభ్యమయ్యే; నిధౌ=శ్రీరంగనాథుడనే నిధి; రంగకోశమధ్యే=శ్రీరంగవిమానం నడుమ/దాచబడిన స్థలమందు; తిష్ఠతి=ఉంటున్నప్పుడు; త్వయి=నీవు; తత్+ప్రతిలంభనే=ఆ నిధిని ప్రత్యక్షంగా తెలిపి పొందించే విషయమై; స్థితాయాం=ఉంటున్నప్పుడు; మే=నా యొక్క; మనః=హృదయం; పరం=మరొకదాన్ని; అను+ఇచ్ఛతి=వెదకుతున్నది.

**తా॥** ఓపాదుకాదేవీ! లక్ష్మినివసించిన, ఆశనుదీర్చే, అనవధిక పురుషార్థమనే భూషాణం శ్రీరంగవిమానం యొక్క నడుమ ఉండగా, ఆ పురుషార్థాన్ని ప్రత్యక్షంగా జ్ఞాపకంచేస్తూ అందిస్తుండగా నాచిత్తం, రాగిబిందెలో నిక్షిప్తమై కోరికలను పెంచే, త్రవ్వకుండా ప్రాప్తమయ్యే, గుప్తస్థలమందున్న క్షుద్ర నిధిని వెదుకుతున్నది. అయ్యోనేనేమి చేయాలి?

వ్యాఖ్య :- ఉత్తమ పురుషార్థమనే నిధిని కాకక్షుద్రనిధినికోరే మనస్సును గూర్చి కవి ఆవేదన.

సాక్షాత్తుగా లక్ష్మి ఉన్ననిధి శ్రీరంగనాథుడు. "కమలం సలిలే తామ్రే" (విశ్వని) 'కమల' శబ్దానికి ఉన్న నానార్థాలలో 'రాగిలోహం' కూడా ఉంది.

"కోశోఽస్త్రీకుడ్మలేఽప్యాధే గుహ్యేఽండే శాస్త్రదివ్యయోః। గృహే

దేశే పుస్తకౌఘేపేశ్యామసి పిధానకే॥ "(నానార్థరత్నమాల)" 'కోశం' అంటే అనేకార్థాలున్నాయికదా!

నిధి కన్న భగవత్సన్నిధి సుఖమని పాదుక-శఠారి-నెత్తిమీదికెక్కి చూపుతూ, తెలియజేస్తున్నప్పటికీ మనస్సు

వశమందుండక, క్షుద్రమైన నిధి-ద్రవ్యం-కోసం ప్రాకులాడుతున్నది. అయ్యో! ఏమీ తోచకున్నది కదా! అని నిర్వేదం.

విషాదాలంకారం (ఇష్యమాణ విరుద్ధార్థ సంసిద్ధిస్తు విషాదనమ్). ఔపచ్ఛందసికం (ససజగగ-సరభయ)

*955. యద్యప్యహం తరలధీస్తవ నస్మరేయం*
*నస్మర్తు మర్హతి కథం భవతీ స్వయంమే।*
*వత్సే విహారకుతుకం కలయత్యవస్థా*
*కానామకేశవ పదావని! వత్సలాయాః॥-5*

**అర్థం** :- హేకేశవ పదావని=ఓ భగవత్పాదుకా!తరలధీః=చెంగలించే బుద్ధిగల; అహం=నేను; యది+అపి=ఏవిధంగానైనా; తవ=నీయొక్క; న,స్మరేయం=చింతన చేయువాడను కాను. భవతీ=నీవు; స్వయం=స్వయంగా; మే=నాయొక్క; స్మర్తుం=స్మరణ చేయడానికి, కథం=ఎట్లు? న+అర్హతి=తగవు. వత్సే=లేగదూడ; విహారకుతుకం= లీలాసంచారకుతూహలాన్ని; కలయతి=చేస్తుండగా; వత్సలాయాః=దోషమే భోగ్యమైన రుచిగల ధేనువు యొక్క; అవస్థా=అనిర్వచనీయ సంభ్రమస్థితి; కా, నామ=ఏమనవలెను. (చెప్పరానిది కదా!)

**తా॥** ఓ భగవత్పాదుకా! చపలమతినైన నేను లాగైనా నిన్ను స్మరించలేను. నీవు నన్ను ఎందుకు స్మరించవు? దూడ ఆవునుంచి దూరంగా పోయి స్వేచ్ఛగా గంతులు వేస్తుంటే, కన్నప్రేమ గల ఆవుచూచి అమితానంద స్థితిని పొందుతుంది కదా!

వ్యాఖ్య :- పాదుక, దోషాన్ని భోగ్యంగా ఆస్వాదించి ఆనందించే ఆవుగా, దృష్టాంతీకరింపబడింది.

పాదుకచేస్తున్న ఉపకారాన్ని స్మరించారు, పై శ్లోకంలో, దేశికులు, అయినా, మనస్సు చంచలమైనది కదా! మనస్సు స్వేచ్ఛగ తిరుగుతూ భగవంతుణ్ని స్మరించదు. అయితే పాదుకాదేవి చపల మతులను వాత్సల్యంతో చూచి నిగ్రహించక అనుగ్రహించడం సామాన్యం. ఆవు లేగదూడ పుట్టగానే దాని కశ్మలమంతా నాలుకతో నాకి, దేహాన్ని నిర్మలంగా చేసి పాలనిచ్చి దూడను పోషిస్తుంది. దోషాన్ని భోగ్యంగా-రుచిలేనిదాన్ని రుచికరంగా ఆస్వాదించి, పుష్టికరమైన తన క్షీరాలను ధారవోసి పెంచడమే ధేనువుకున్న నైసర్గిక లక్షణం. ఇదే మాతృవాత్సల్యం కదా! దూడ అర్థించదు, బలవర్ధకమైన తల్లిపాలు త్రాగి, తల్లిని తలవక, దూరంగా పోయి ఇష్టమున్నట్లు గంతులు వేస్తూతిరుగుతుంటే కన్నప్రేమతో ఆవు తనబిడ్డ ఎటుపోతుందో అన్న బెంగతో దూడ వెంటపోయి చూస్తూ ఆనందిస్తుంది. అంతే కానీ, దూడను తలవక, నిశ్చింతగా నుండదుకదా గోవు! కాబట్టి, పాదుకాదేవి కూడా ఆవులాగా, తననుస్మరించని సంతానాన్ని వాత్సల్యంతో కటాక్షించేలాగా, కటాక్షించాలని ప్రార్థించారు దేశికులు. దృష్టాంతాలంకారం. వసంత తిలకావృత్తం.

*956. మాతర్ముకుంద కరుణా మపినిహ్నువానాత్*
*కింవాపరం కిమపి కిల్బిషతో మదీయాత్।*

*గాఢంగృహీత చరణా గమనాపదేశాత్*
*తత్ప్రేరణ ప్రణయినీ తవచేన్నలీలా ॥-6*

**అర్థం :-** హేమాతః=ఓతల్లీ! గమన+అపదేశాత్=సంచారం యొక్క మిష వల్ల; గాఢం=దృఢంగా; గృహీతచరణా=గ్రహింపబడిన పాదాలు గల; తత్+ప్రేరణప్రణయినీ=ఆభగవంతుని రక్షణోద్యోగాన్ని ప్రవర్తింపజేసే ప్రేమగల; తవ=నీ యొక్క; లీలా=క్రీడ; న,చేత్=లేకపోతే, ముకుంద కరుణాం, అపి=మోక్షదాతయైన భగవంతుని కారుణ్యాన్ని కూడా, నిహ్నువానాత్=మరగు పరచే; మదీయాత్=నాదైన; కిల్బిషతః=పాపంకంటే; పరం=శ్రేష్ఠమైన కిం, అపి+ఏవస్తువైనా, కిం,వా=ఏది? ఉండునా?

**తా॥** ఓ జననీ! సంచారమనే మిషతో గట్టిగా పాదాలను పట్టుకొని భగవంతుణ్ని మాదగ్గరకు తెచ్చి దర్శనం చేయించే నీ హేలలేకపోతే, మోక్షమిచ్చే భగవత్కృపను కూడా కల్గనీయక కప్పిపుచ్చే, నా పాపం కంటే బలమైన వస్తువేదైనా ఉందా? లేదు. అని కవి ఆవేదన.

వ్యాఖ్య :- పాదుకాకృపవల్ల పాపిష్ఠులకూ పరమ పురషార్థం లభిస్తుంది.

పాదుకాదేవి మనలను దయతో చూడకపోతే, భగవత్కృపకు ప్రతిబంధకంగా ఉన్న మన పాపానికే "జయం" కలిగేది. నిజంగా, బలంగ ఉన్న మన పాపాలకు ప్రాయశ్చిత్తమేలేదు కదా! పాదుకాదేవి ఎంత దయామయియో! భగవత్సన్నిధికి వెళ్ళక, దేవుని దర్శింపక, పూజించక, కేవలం వీధిలో తిరుగాడే జంతువులం మనం. వాస్తవంగా, అన్నపానాలింగనాదులచే కాలం గడుపుతున్న మనపాపమే భగవంతుడు మనలను కటాక్షించకుండా నిగ్రహించడానికి కారణం. అయినా, పాదుకాదేవి భగవద్రక్షణ ప్రయత్నాన్ని ప్రేరేపించక మానదు. తననాశ్రయించిన వారిని రక్షిస్తానని ఎదిరిచూసేవాడు భగవంతుడు. "ఇక్కడ ఎదిరిచూడడం ఎందుకు? లోరక్షకుడవుకదా! స్వామీ! అలాగా బయల్దేరిలోకాన్ని చూడడం మేలు" అని పాదుకాదేవి భగవంతుని కాళ్ళను దృఢంగా పట్టుకొని విహారమనే వ్యాజంతో వీధిలోకి భగవంతుణ్ని కొనివచ్చి, మనలను భగవంతుడు చూచే రీతిగా చేస్తుంది. భగవంతుని దృష్టి పడగానే మనపాపాలన్నీ పంచబంగాళమవుతాయి. పరమపురుషార్థం మనకు దక్కుతుంది.

ఇలాగా, పాదుకా లీలలేకపోతే మన పాపమే ప్రబలమై విజయాన్ని సాధించి స్థిరంగా నిలిచేదికదా! పాదుకాదేవి తల్లి కాబట్టి, అద్భుతమైన తన లీలచేత పాపాత్ములను కూడా భగవంతుని కృపకు పాత్రులను చేస్తుంది. పాదుకాలీల బలీయసి కదా!.

సంభావనాలంకారం. వసంత తిలకావృత్తం.

**957.** *క్షీబాఽసి కాంచనపదావని! కైటభారేః*
*పాదారవింద మకరంద నిషేవణేన,*
*దేవి! త్వదంతికజుషః కథ మన్యథా మే*
*దీనాక్షరాణి నశ్రుణోషి దయాధికాత్వమ్॥-7*

**అర్థం** :- హేకాంచన పదావని=ఓ బంగారుపాదుకా! కైటభ+అరేః=కైటభుడనే రాక్షసునికి శత్రువైన శ్రీరంగనాథుని యొక్క; పాద+అరవింద మకరంద నిషేవణేన=చరణాలనే తామర పూలతేనియను పానంచేయడం చేత; క్షీబా=మత్తురాలవై; అసి=ఉన్నావు. అన్యథా=లేకపోతే; హేదేవి=ఓ దేవీ! దయా+అధికా=దయచేత అధికురాలవైన; త్వం=నీవు; త్వత్+అంతిక జుషః=నీ దగ్గర వర్తించే; మే=నా యొక్క; దీన+అక్షరాణి=దైన్యవాక్కులను; కథం=ఎలా; న, శ్రుణోషి= వింటులేవు?

**తా॥** ఓ కాంచన పాదుకాదేవీ! భగవత్పాద పద్మాల మకరందపానం చేత మత్తతో ఉన్నావు. అలాకాకపోతే, దయాపూర్ణవైన నీవు, నీ సన్నిధిలో సేవించుకొంటూ ఉండే నా దీన వాక్యాలను ఎందుకు వింటులేవు?

**వ్యాఖ్య :- పాదుకాదేవి తన విన్నపాన్ని వింటు లేదని కవి ఉపాలంభన.**

మకరందాన్ని ఆస్వాదిస్తే మత్తుగా ఉంటుంది. ఇంద్రియాలకు గ్రహణశక్తి తగ్గుతుంది. "మత్తేశాండోత్కటక్షీబాః" (అమరం) భగవత్పాదారవిందాల సౌగంధ్య సౌకుమార్యాదిగుణాలను అనుభవించడం వల్ల, మధుపానం చేసినట్లు, మత్తెక్కి ఉన్నది పాదుకాదేవి, అని స్వతంత్రతతో కవి అధిక్షేపిస్తున్నాడు.

గత శ్లోకంలో "మోక్షప్రదుని కృపను మరుగుపరచడం" అన్నమాట కూడా సాహసంతో కూడిందే. పాదుకా "ప్రేరణ ప్రణయిని" కదా! భగవంతుణ్ని వీధిలోకి మోసుకొనివచ్చి పామరజనులకూ సేవింపచేసేది పాదుక, అని వర్ణితం, అయితే, ఆప్రేరణ ప్రణయం ఆచార్యుల ఆశయానికి అనుగుణంగా లేదట. "త్వదంతికజుషః" పాదుకాదేవి నిండుదయకలదికదా! అయితే, పాదుకాదేవిని దగ్గరగా ఉండి సేవించుకొనే దేశికులకు భగవత్పాదారవిందమకరందాన్ని ఆస్వాదించే భాగ్యం కలిగించలేదు. "ఏకస్స్వాదునభుంజీత". మధురవస్తువును ఒక్కరే అనుభవించకూడదుకదా! దీనుడు-గతిలేనివాడు దగ్గర ఉండగా, గతిశీలయైన బంగారు పాదుక-ఒక్కతె-మకరందపానం చేయడం పాడియా? బిక్కుబిక్కుమని చూస్తూ, అమ్మా!అమ్మా! అంటూ విలపిస్తుంటే, శక్తి హీనుని మొర శక్తియుక్తయైన పాదుక చెవికెక్కడంలేదుకదా! మకరంద పానభోగసామ్యాన్ని ప్రసాదించుమని కవిహృదయం.

అర్థాపత్త్యలంకారం. వసంతతిలకావృత్తం.

*958. మాతస్త్వ దర్పిత భరస్య ముకుందపాదే*
*భద్రేతరాణి యదినామ భవంతి భూయః।*
*కీర్తిః ప్రపన్న పరిరక్షణ దీక్షితాయాః*
*కిం నత్రపేత తవకాంచన పాదరక్షే॥-8*

**అర్థం** :- హేమాతః! కాంచన పాదరక్షే=ఓ తల్లీ! కనకపాదుకా! ముకుందపాదే=భగవంతుని చరణమందు; త్వత్+అర్పిత భరస్య=నీచేత సమర్పింప జేయబడిన ప్రపత్తి కలవానికి; భూయః=మరల; భద్ర+ఇతరాణి=అశుభాలు; యది, నామ, భవంతి=ఒకవేళ కలిగినట్లైతే; ప్రపన్న పరిరక్షణ దీక్షితాయాః=ప్రపన్నులను కాపాడే దీక్షకలిగిన; తవ=నీ యొక్క; కీర్తిః=యశస్సు; కిం=ఏమి; న,త్రపేత=సిగ్గుపడదా?

**తా॥** ఓ జనని! కాంచనపాదుకా! మోక్షదాతయైన శ్రీరంగనాథుని పాదాలయందు నీవు భరన్యాసం చేయించిన నాకు మళ్ళీ అశుభాలు కలిగినట్లైతే ప్రపన్నుల రక్షించే వ్రతమున్న నీ కీర్తికి సిగ్గుచేటు కాదా?

వ్యాఖ్య :- స్తుతికర్త తనకున్న విశ్వాసాన్ని విన్నవించే శ్లోకం.

భగవత్పాదాలయందు భారంవేసి నిర్భరుడైనవాడు ప్రపన్నుడు. ఒక్కసారి ప్రపత్తి చేసిన వ్యక్తికి పూర్వాఘాలు-సంచితకర్మలు-నశిస్తాయనీ, ఉత్తరాఘాలు-ఆగామికర్మలు-తామరాకుపై నీరు అంటలేనట్లు తగులవు, అని శాస్త్రం.

ప్రపత్తి చేసిన తర్వాత ఉత్తరకాలాన ఎప్పుడైనా ప్రామాదికంగా చేసే పాపం వల్ల అమంగళం, అశుభం ప్రపన్నునికి జరిగితే ఆకష్టం, నష్టం ఎవరు భరించాలి? భగవత్పాదులంటే ఆచార్యులే కదా! ఆచార్యో పదిష్టుడై భగవద్భక్తి కలిగి ఉన్నప్పుడు కీడు కలిగించే దోషం సంభవిస్తే, ఆదోషం పాదుక-ఆచార్యుని-దే అని ఉల్లాసమూ, తనకు తగులుతుందో అనే భయమూ ఉంటుంది. శరణా గతికి ఉన్న షడ్విధ లక్షణాల్లో 'గోప్తృత్వ వరణం, ఆత్మనివేదనం' దృఢమైన అధ్యవసాయం కలవి. ఏ పాపమూ తనకు తగిలి ఫలించకుండా తనను రక్షించవలసిందని పాదుకకు విన్నవిస్తున్నారు. పామరులకుండే నమ్మకాన్ని తనదిగా ప్రకటిస్తూ అద్భుతంగా సందేహాన్ని తీర్చడం ఆచార్య లక్షణం. ఉల్లాస భేదాలంకారం. వసంతతిలకావృత్తం.

*959. దౌవారిక ద్విరసన ప్రబలాంతరాయై*
*ర్దూయే పదావని! దురాఢ్య బిలప్రవేశైః ।*
*తద్రంగధామ నిరపాయ ధనోత్తరాయాం*
*త్వయ్యేవ విశ్రమయ మంక్షు మనోరథంమే॥-9*

**అర్థం :-** హేపదావని=ఓ పాదుకాదేవి! దౌవారిక-రాయైః।దౌవారిక=ద్వారపాలకులనే; ద్వి రసన=రెండునాలుకలుగల సర్పాలచేత; ప్రబల=గొప్ప; అంతరాయైః=విఘ్నాలు కలిగిన; దురాఢ్య బిల ప్రవేశైః=దుష్టధనికుల (ప్రభువుల) గృహాలనే పుట్టలోనికి చేసే ప్రవేశాల చేత; దూయే=కలవర పడతున్నాను, తద్రంగ-రాయాం। తత్=అందువల్ల; రంగధామ=శ్రీరంగ విమానమందున్న భగవంతుడనే; నిరపాయ=అక్షయమైన; ధన=ధనంచేత; ఉత్తరాయాం=ఉత్కృష్టమైన; త్వయి, ఏవ=నీయందే; మే=నాయొక్క; మనోరథం=కోరికను; మంక్షు=శీఘ్రంగా; విశ్రమయ=పరిసమాప్తి చేయుము.

**తా॥** ఓపాదుకాదేవీ! ద్వారపాలకులనే సర్పాలచే గొప్ప అడ్డంకులు గల దుష్టధనికుల ఇండ్లు అనే పుట్టల్లోకి ప్రవేశించడం చేత నేను చాల శ్రమపడుతున్నాను. కాబట్టి, శ్రీరంగధామమనే నిరపాయమైన ధనం చేత ఉత్కృష్టమైన నీయందే నా కోరికను విశ్రమింపజేయుము.

వ్యాఖ్య :- భగవత్పాదుకయందే తన మనస్సును స్థిరంగా నిల్చునట్లు చేయాలని ప్రార్థన.

ధనం లేనిదే జీవితం సుఖమయంకాదని దుష్టధనికుల ఇండ్లల్లోకి పోవడం సమంజసమా! ధనికుల

భవనాలు పాముపుట్టలు. పుట్టల్లో ఉండే విషధరులెట్టివో ఐశ్వర్యవంతులట్టివారు. వారి భవనాలను కాపలాకాసే వ్యక్తులూ పాములే. పాములకు రెండునాలుకలున్నట్లే ద్వారపాలకులకూ రెండు నాలుకలు ఉంటాయి. రెండు నాలుకలుండడం అంటే అసత్యవాదులని అర్థం. ఒక మాట పలికిన వెంటనే అదికాదని మరొక మాటను పలుకడం. కల్లబొల్లి మాటలతో విషయాన్ని విషమయం చేస్తారు. ద్వారపాలకులు భవనంలోకి ప్రవేశించనీయక అనేకాటంకాలను కల్పిస్తారు. ఏదో విధంగా శ్రమపడి ధనికుల ఇండ్లల్లో ప్రవేశిస్తే, ఆ ధనికులు ఐశ్వర్యమదంతో పాముల్లాగా బుసకొడుతారు.

తమనుస్తుతించడం లాంటి మనకు ఇష్టంలేని పనులను చేయుమంటారు పాములు మనశరీరంపైన కాటువేసి తమ కోరల్లోని విషాన్ని ఎక్కించి రక్తచలనాన్ని ఆపివేసినట్లే, దుష్టప్రభువులు ధనం మీద ఆశను రేకెత్తించి, తలలూపించి, భగవద్ధ్యాన్యానికి, ప్రాణుల సద్గతికీ భంగం కలుగజేస్తారు. ధనతృష్ణచేత జీవితం నరక ప్రాయమవుతుంది.

"పాంబోడు ఒరుకూరయలే ఎయిన్నార్‌పోల్". పాములున్న ఇంట్లో తప్పించుకొనిపోయే దారిలేక జీవిస్తున్న వానిలాగా, పంచేంద్రియాలతో కూడిన శరీరంతో గిజగిజలాడుతున్నాను అన్నారు (పరకాలమునులు) తిరుమంగై ఆళ్వారు. కాబట్టి శ్రీరంగరాజసన్నిధినే పెన్నిధిగా భావించి, తృప్తిగా ఉన్న పాదుకాదేవి యందే తన మనస్సును, క్షుద్ర పురుషార్థాల నుంచి మరల్చి, స్థిరంగా నిలుచునట్లు చేయుమని కవి ప్రార్థిస్తున్నాడు. రూపకాలంకార ప్రాణిత కావ్యలింగాలంకారంతో సంకీర్ణమైన ప్రేయోఽలంకారం. వసంతతిలకావృత్తం.

శ్రీవేదాంతదేశికులు వారు యధార్థంగా జీవితంలో ధనతృష్ణలేకుండా, వైరాగ్యంతో ప్రవర్తించారు. ఒకప్పుడు సతీర్థులైన శ్రీ విద్యారణ్యస్వామి వారు దేశికుల వైభవాన్ని విని సమ్మానించడానికి విజయనగరం నుంచి లేఖను వ్రాసి పంపారు. దేశికులు దానికి సమాధానంగా "వైరాగ్య శ్లోకపంచకం" వ్రాసి పంపినట్లు ఐతిహ్యం. అందులో ఒక శ్లోకమిట్లున్నది.

"దురీశ్వరద్వార బహిర్వితర్దికా దురాసికాయై రచితోఽయమంజలిః।

తదంజనాభం నిరపాయమస్తిమే ధనంజయ స్యందనభూషణం ధనమ్॥"

'దుష్టప్రభువుల యొక్క గృహద్వారాలకు వెలుపలనుండే అరుగుల మీద వేచియుండే దుస్థితికి నాకైమోడ్పు (నమస్కారం).

నల్లని కాంతి కలిగి, అర్జునుని రథానికి భూషణమైయున్న శ్రీకృష్ణ భగవానుడనే అపాయంలేని ధనం నాకు ఉంది.

ఇంకొకటి :- జ్వలతు జలధిక్రోడక్రీడత్ కృపీడభవప్రభా
భవపటుతర జ్వాల మాలాకులో జఠరానలః।

తృణమపివయం సాయం సంపుల్లమల్లిమతల్లికా
పరిమళ ముచా వాచా యాచామహేన మహీశ్వరాన్॥

'సముద్రం నడుమ విహరించే బడబాగ్ని కాంతి కంటె అధికమైన జ్వాలా పరంపరలచేత వ్యాకులమైన ఉదరాగ్ని మండితే మండుగాక. కాని సాయంకాలాన వికసించిన మంచి మల్లె పూవుల పరిమళాన్ని వెదజల్లే వాక్కులచే రాజులను మేము గడ్డిపరకనైనా యాచించ' మన్నారు.

శ్రీదేశికస్వామి యొక్క ధనవిరక్తికి, రజోగుణస్వభావం కలిగిన భూపతులను యాచింపలేని, విశుద్ధ వైరాగ్యానికి ఆశ్చర్యపడి,

"విద్యారణ్యో వివిధం వేంకట సూరే ర్విశోధ్య వైరాగ్యమ్।

యం విష్ణో రవతారం మేనే, సేవే తమాగమాంత గురుమ్॥"

'వేదాంతదేశికులది సాక్షాత్తుగా విష్ణువు యొక్క అవతారమని శ్రీవిద్యారణ్యస్వామి వారు గుర్తించారట.

*960. వ్యాముహ్యతాం త్రివిధ తాపమయే నిదాఘే*
*మాయా విశేషజనితాసు మరీచికాసు।*
*సంస్పృష్ట శౌరి చరణా చరణావని! త్వం*
*స్థేయా స్వయం భవసి నశ్చరమే పుమర్థే॥-10*

**అర్థం:-** హే చరణావని=ఓ పాదుకాదేవీ! త్రివిధ తాపమయే=ఆధిభౌతికాధ్యాత్మికాధి దైవికాలు అనే మూడు తాపాలతో నిండిన, నిదాఘే=గ్రీష్మకాలమందు; మాయావిశేష జనితాసు=ప్రకృతి యొక్క గుణభేదం చేత కలిగిన; మరీచికాసు=ఎండమావులందు; వ్యాముహ్యతాం=భ్రమించే; నః=మాకు; సంస్పృష్టశౌరి చరణా=స్పృశింపబడిన భగవత్పాదాలుగల; త్వం=నీవు; స్వయం=స్వయంగా; చరమే=చివరి; పుం+అర్థే=పురుషార్థమందు; స్థేయా=నిశ్చిత స్థితిని కలిగిస్తున్నదానవై; భవసి=ఉంటున్నావు.

**తా॥** ఓ పాదుకాదేవీ! తాపత్రయ ప్రచురమైన ఎండకాలంలో ప్రకృతిగుణాలచే కలిగిన ఎండమావుల్లో భ్రమించే మాకు, నీటిని చూపుతున్నట్లు, భగవచ్చరణాలను స్పృశించిన నీవు స్వయంగా మోక్షవిషయ దర్శనాన్ని కలిగిస్తుంటావు.

వ్యాఖ్య :- భగవత్పాదమే పరమపురుషార్థమని పాదుకాదేవి ప్రదర్శిస్తుంది.

'మాయ' అంటే ప్రకృతి వల్ల కలిగేపని "మాయాదంభేక్రియాయాంచ". (విశ్వని) ప్రకృతి ఎప్పుడూ మారే స్వభావం కలది. తత్ఫలితంగా, ఎండ, వాన, చలి ఆయాప్రదేశాల్లో కలుగుతాయి. గ్రీష్మర్తువులో తాపం అధికమవుతంది. దాహం తీర్చుకోవడానికి జంతువులు ఎండమావులను చూచి నీళ్ళే అనుకొని భ్రమించి, పరిభ్రమించి అలసిపోతున్నప్పుడు చల్లని పానీయ ప్రదేశాన్ని ప్రదర్శించే వారు ఆప్తులు.

రజస్తమోగుణాల ప్రభావం వల్ల భ్రమ జనిస్తుంది. ఒక వస్తువును చూచి మరొక వస్తువుగా భావించడమే భ్రమ. సదసద్వివేకాన్ని-మంచి చెడ్డలను తెలుసుకొనే శక్తిని-పోగొట్టి, వ్యామోహాన్ని కలిగించడం ప్రకృతి లక్షణం. ప్రకృతి జన్యగుణాలచే ప్రభావితులైన సంసారులకు భౌతికంగా, మానసికంగా, దైవికంగా బాధలు కలుగుతాయి.

సంసారమే గ్రీష్మం. శబ్ద స్పర్శరూపరసగంధాలు అనే ఇంద్రియ విషయాలే ఎండమావులు. వివేకం లేనందువల్ల విషయాభిరుచుల కోసం పరితప్తులవుతారు సంసారులు. తాపత్రయాన్ని శమింపజేయడానికి "ఇదొ! పలురకాల పరిభ్రమించకండి. ఇక్కడ ఉంది పరమ, చరమపురుషార్థం. మీరు సేవించండి" అంటూ పాదుకాదేవి, శ్రీరంగనాథుని పాదాలను స్వయంగా నిర్దేశించి, ప్రదర్శిస్తూ మనకు నిశ్చితస్థితిని కలిగిస్తుంటుంది.

రూపకాలంకారంతో కూడిన గమ్యోత్ప్రేక్ష. వసంతతిలకావృత్తం.

*961. అచ్ఛేద్యయా విషయవాగురయానిబద్ధాన్*
*దీనాన్ జనార్దన పదావని! సత్పథస్థా౹*
*ప్రాయః క్రమేణ భవతీ పరిగృహ్య మౌళౌ*
*కాలేన మోచయతి నఃకృపయా సనాథా౹౹-11*

**అర్థం:-** హేజనార్దన పాదావని=ఓ భగవత్పాదుకా! భవతీ=నీవు; కృపయా సనాథా (సతీ)=దయతో కూడిన దానవవుతూ; అచ్ఛేద్యయా=ఛేదింపరాని (దృఢమైన/అ+ఛేద్యయా=అకారవాచ్యుడైన విష్ణువుచేత ఛేదింపదగిన); విషయ వాగురయా=శబ్దాది విషయాలనే వలచేత; నిబద్ధాన్=కట్టబడిన; దీనాన్=కష్టపడుతున్న; నః=మమ్ములను; మౌళౌ=తలయందు; పరిగృహ్య=పట్టుకొని; సత్‌పథస్థా=మంచి (నక్షత్ర) మార్గంలో ఉంటూ; ప్రాయః=బహుశః; కాలేన=సమయం చేత; క్రమేణ=వరుసగా (పర్యాయంగా) మోచయతి=సంసారం (విషయాలనే వల) నుంచి విడిపిస్తుంటావు.

**అర్థం:-** ఓ జనార్దన పాదుకా! నీవు కృపాళువై దృఢమైన శబ్దస్పర్శాది విషయాలనే వలచేత బద్ధులమై కష్టపడుతున్న మమ్ములను శిరస్సున పట్టుకొని ఆకాశంలో ఉంటూ, కాలక్రమంగా బహుశః విషయవాగుర (సంసారం) నుంచి విడిపిస్తుంటావు.

వ్యాఖ్య :- పాదుకాదేవి సంసారబంధం నుంచి విడిపిస్తుంది.

మనం సుఖహేతువులని ఆశించే గృహారామక్షేత్రకామినీ చందనకుసుమాది భోగ్య విషయాలన్నీ దుఃఖహేతువులే.

"వస్త్వేకమేవ దుఃఖాయ సుఖాయేర్ష్యాగమాయచ౹--
తదేవ ప్రీతయే భూత్వాపునర్దుః ఖాయ జాయతే౹౹" (వి.పు.)

నిత్యపరిణామాస్పదమైన ప్రకృతిలో ప్రతివస్తువు సుఖదుఃఖ మిశ్రమమే కాని సుఖైకతానం కాదని పరాశరమహర్షి సూక్తి.

"ఉణ్ణిలా వియవైవరాల్" అనే తిరువాయ్ మొళిలో పంచేంద్రియాలు భోగ్యవస్తువుల కోసం ప్రాణులను పట్టిపీడించే విషయం విషాదమయంగా వివరింపబడింది. గత శ్లోకంలో జీవి, తాపశమనార్థం ఎండమావులనుచూచి నీరని భ్రమించి ఉరకలు పెట్టే మృగం-లేడి-లాంటివాడన్న విషయం గమనీయం. లేళ్ళకు పిక్కబలం అధికం. అవి ఆహారాది ప్రలోభాలకు లొంగిపోయి ఉచ్చులో చిక్కుపడే స్వభావమూ అధికమే. క్షణంలో తప్పించుకొని పోయే వాటి చురుకుతనం, ఆశాపాశం ముందు పనికి రాకుండా పోతుంది. వివేకమున్న జీవుడు కూడా ప్రకృతి గుణాలకులోనై విషయాల వలలో చిక్కుపడి దుఃఖపడుతుంటాడు. సత్పథస్థయైన పాదుకాదేవిని-శఠారిని-మనం తలమీద ధరించగానే, మనం విడువదలచుకొన్నా తాను మనలను విడనాడదు. కాలక్రమంగా మనలను సంసార బంధం నుంచి విడిపించే దయా మూర్తి పాదుకాదేవి. బద్ధజీవులకూ ఊర్ధ్వగతిని కల్పిస్తుందని ఉత్ప్రేక్షాలంకారం. వసంతతిలకా వృత్తం.

*962. సంవాహికా చరణయోర్మణిపాదరక్షే!*
*దేవస్య రంగవసతేర్దయితా ననుత్వమ్।*
*కస్త్వాం నివారయితు మర్హతి యోజయంతీం*
*కాంతేషు తద్గుణ గణేషు మమాపరాధాన్॥-12*

**అర్థం:-** హేమణిపాదరక్షే=ఓ మణిమయపాదుకా! రంగవసతేః=శ్రీరంగ మందు నివసించే; దేవస్య=శ్రీరంగరాజు యొక్క; చరణయోః=పాదాలను; సంవాహికా=భరించే, త్వం=నీవు; దయితా, నను=వల్లభవుకదా! కాంతేషు=శోభించే; తత్+గుణగణేషు=ఆ దేవుని గుణసమూహాలయందు; మమ=నా యొక్క; అపరాధాన్=దోషాలను; యోజయంతీం=ఘటింపజేసే; త్వాం=నిన్ను; కః=ఎవ్వడు; నివారయితుం=అడ్డుపెట్టడానికి; అర్హతి=సమర్థుడు?

**తా॥** ఓ మణిమయపాదుకా! శ్రీరంగరాజు పాదాలకు ఉపచారం చేసే నీవు ఆయనకు ప్రియమైన నాయికవుకదా! అంతట ప్రకాశించే శ్రీరంగపతిగుణ గణాలయందు నాదోషాలను భోగ్యంగా సమకూర్చే నిన్ను అడ్డుపెట్టడానికి ఎవడు సమర్థుడు?

వ్యాఖ్య :- భగవంతుని కల్యాణగుణాల చేత జీవులదోషాలను క్షాళనం చేయించే ఘటకురాలు పాదుకాదేవి.

జీవుడు నేరాలనుచేస్తాడు. నేరాలకు తగినదండనను జగత్పతి విధిస్తాడు. ఇది శాస్త్ర మర్యాద. వాత్సల్య వతియైన పాదుకాదేవి భగవత్పాద సంవాహనం చేసే ప్రియతమ నాయిక. కాబట్టి ఆ సర్వేశ్వరుడు అపరాధులను శిక్షింప దలచినప్పుడు, ఆయన కాళ్ళు పట్టుకొని అపరాధులను కరుణించుమని ప్రార్థిస్తుంది.

"స్వామీ! లోకంలో పాపాలను చేయని వాడెవడండీ" అంటుంది పాదుక- "పాపానికి తగినంత శిక్షను విధించడం ప్రభుధర్మంకదా!" అంటాడు దేవుడు. "ధర్మం కూడా సూదిమొన కంటె సూక్ష్మంగానూ, దబ్బనం కంటె స్థూలంగానూ ఉంటుంది కదా! "ననమేయం కదాచన" ఎప్పుడూ తలవంచను-అనే దుష్టుణ్ని దండించండి.

"తవపరిచరేయం చరణయోః" నీ కాళ్ళు పట్టుకొంటాను-అని వేడుకొనే అపరాధిని క్షమించకపోతే 'దయాపయోనిధి' అనే నీ బిరుదుకు ప్రయోజనమేమి?

రోగముంటేనే కదా ఔషధంతో ప్రయోజనం! అసంఖ్యాకమైన నీ కల్యాణ గుణాలలో 'దయ, క్షమ' అనే గుణద్వయం ఒకే నాణానికి ఉన్న రెండు ప్రక్కలు కదా! నీ దయను ప్రవహింపజేస్తే దోషాలు దొర్లిపోతాయి. వెంటనే 'క్షమ, తళుక్కుమని గుణాలను ప్రకాశింప జేస్తుంది. 'శరణాగతవత్సలః' అన్న నీ పేరునే "తస్యనామ మహద్యశః" అని వేదం ప్రతిపాదిస్తున్నది కదా!" అని భగవంతునితో వినయంగా వివదిస్తూ, పాదుకాదేవి తన పురుషకారంతో దోషులకూ భగవత్సాన్నిధ్యాన్ని ఘటింప జేస్తుంది. ఆ ఘటకురాలును అడ్డుకొనే సామర్థ్యం ఎవ్వరికీ లేదు.

ఈ శ్లోకంలో పాఠభేదముంది.

"మాతః స్వయం గుణగణేషు" పాఠంలో 'గుణగణాలెవ్వరివో' తెలియడంలేదు. సరి! 'ఓ తల్లీ! నాదోషాలను గుణాలనుగా మార్చివేసే ఘటకురాలవు' అని తాత్పర్యం.

వాక్యార్థహేతుకమైన కావ్యలింగాలంకారం. వసంతతిలక.

***963.*** *కింవా భవిష్యతి పరం కలుషైక వృత్తే*
*రేతావతాఽప్యను పజాత మనేహసామే।*
*ఏకం తదస్తి యదిపశ్యసి పాదుకే! తే*
*పద్మాసహాయ పదపంకజ భోగసామ్యమ్॥-13.*

**అర్థం:-** హే పాదుకే=ఓ పాదుకాదేవీ! కలుష+ఏక, వృత్తేః=పాప (కృత్య)మే ముఖ్య వ్యాపారంగా గల, మే=నాకు; ఏతావతా=ఇంత; అనేహసా=కాలంచేత; అనుపజాతం=ఫలించనిది, పరం=వేరే; కిం, వా=ఏదైనా; భవిష్యతి=ఉండగలదా? యది=ఒకవేళ; పశ్యసి=నీవు కటాక్షిస్తే; తత్=ఆ కలుగబోయేది; తే=నీ యొక్క; పద్మాసహాయ, పదపంకజ భోగసామ్యం=లక్ష్మీనాథుని పాదపద్మాల యందలి సుఖానుభవంతో సమానమైనది; ఏకం=ఒకటి; అస్తి=కలదు.

**తా॥** ఓపాదుకాదేవీ! పాపైకనిరతుడనైన నాకు ఇంతకాలం కలుగనిదీ, దుఃఖాన్ని మించిన వేరొకటి ఏముంటుంది? నీవు కటాక్షిస్తే, నీకు శ్రీరంగనాథుని చరణ కమలాల స్పర్శవల్ల కలిగే ఆనందానుభవంతో సమానమైన ఆనందానుభవం నాకు కలుగవలసిందొకటి ఉంది.

వ్యాఖ్య :- భగవత్పాద పద్మభోగసామ్యం కావాలని కవి విజ్ఞప్తి.

సంసారం అనాది. కాబట్టి తన పుణ్యపాపాల ఫలంగా, జీవుడు మారి మారి అనేక జన్మలనెత్తుతూ గర్భ నరకాది దుఃఖాలనెన్నింటినో అనుభవిస్తుంటాడు. ఇక దుఃఖానుభవం కంటె వేరైనదేముంటుంది?

"అభూత పూర్వం మమభావికింవా సర్వం సహేమే సహజం హిదుఃఖమ్"

'దుఃఖం నాతోనే పుట్టిందికదా! ఇంతకుముందు కలుగని, నూతనమైన అనుభవం ఏముంది? కష్టాలనన్నిటినీ సహిస్తున్నాను" అన్నారు శ్రీయామున మునులు స్తోత్రరత్నం'లో. నిజంగా, తనకు కాసినకాయలను మోయలేని తీగ ఉంటుందా? కష్టాలను సహించడం సహజమే కదా!

శ్రీరంగనాథుని చరణ కమలాలను ధరించడం వల్ల కలిగే సుభానుభవం పాదుకాదేవికి మాత్రమే ఉంది. ఈ అనుభవం జీవులకు కొత్తదేమరి. అదెలా కలుగుతుంది? అంటే, పాదుకాదేవి కటాక్షిస్తే, భగవత్పద పంకజభోగసామ్యం జీవులకూ కలుగుతుంది; కటాక్షించకుంటే కలగదు, అన్నారు దేశికులు.

ఆక్షేపాలంకారం. వసంతతిలకావృత్తం.

***964.*** *వివిధ విషయ చింతాసంతతాభిశ్చిరంమాం*
*జనిత కలుషమిత్థం దేవి! దుర్వాసనాభిః।*
*పదసరసిజ యోస్త్వం పాదుకే! రంగభర్తుః*
*పరిమళ పరివాహైః పావనైర్వాసయేథాః॥-14.*

**అర్థం:-** హేదేవి, పాదుకే=ఓ పాదుకాదేవీ! త్వం=నీవు, వివిధ-తాభిః; వివిధ=పలురకాల; విషయ=ఇంద్రియాలకు గోచరించే వస్తువుల యొక్క; చింతా=ఆలోచనలచేత; సంతతాభిః=నిబిడమైన; దుర్వాసనాభిః=హేయమైన విషయాల అనుభవం వల్ల కలిగే దృఢ సంస్కారాలచే/దుర్గంధాలచే; చిరం=చాలాకాలంగా; ఇత్థం=ఇలాగా కనబడుతున్న; జనిత కలుషం=ఉద్భవించిన పాపరాశికల; మాం=నన్ను; రంగభర్తుః=శ్రీరంగరాజు యొక్క; పదసరసిజయోః=పాదార విందాల యందలి; పావనైః=పరిశుద్ధమైన; పరిమళ పరివాహైః=సౌరభప్రవాహాల చేత; వాసయేథాః=సంస్కరింపుము/ పరిమళింపజేయుము.

**తా:-** ఓ పాదుకాదేవీ! అనేక విషయాలను నిరంతరం స్మరించడం వల్ల దట్టంగా పట్టిన దుర్వాసనలచేత చాలా కాలం నుంచి ఇలాగా పాపరాశి సంభవించిన నన్ను శ్రీరంగనాథుని పాదకమలాల యందలి పావన పరిమళ పరివాహాలచే పరిమళింపజేయుము.

వ్యాఖ్య:- భోగసామ్యం అక్షయమని వర్ణితం.

జీవుడు ఇంద్రియాలకున్న శబ్దాది విషయాలపైన మనస్సును ఎల్లప్పుడు నిల్పడం వల్ల దుర్వాసనా వాసితుడవుతాడు. ప్రతిజన్మలోనూ పాపకర్మలను చేస్తూ దుష్టసంస్కార దూషితుడవుతున్నాడు. తరుగని సుఖానుభవం కలుగాలంటే, దుర్వాసనాదూషితునికి ఎలా కలుగుతుంది?

దీనికి సమాధానమిది :- సుందరసుకుమార సువాసనాభరితమైన వస్తువుతో చేరిన హేయవస్తువుకు దుర్వాసనపోయి సువాసన ఏర్పడుతుంది కదా! 'వాసన' అంటే సంస్కార మని అర్థం.

'సంస్కారోనామ సంస్కారస్య గుణాధానేన వాస్యాద్దోషా పనయనేనవా''. (శంకరభాష్యం) (మలహరణం, గుణాధానమే సంస్కారం)

''నల్లమణముళ్ళదొన్రైనణ్ణి యిరుప్పదర్కు నల్లమణముండామ్'' (ఉపదేశ రత్నమాల-69) మంచి వాసన గల వస్తువుతో కూడిన మరొకవస్తువుకు కూడా మంచి వాసన ఉంటుంది, అన్నారు మణవాళమామునులు. పాదుకాదేవి దయతో పావనమైన, నిరంతరం పరిమళం ప్రవహించే భగవత్పాద సరోజాలతో జీవునికి సంబంధ మేర్పరచిన వెంటనే, దుర్గంధం పోతుంది. సౌగంధ్యమేర్పడుతుంది. ఈ భోగసామ్యం అక్షయం.

తద్గుణాలంకారం. మాలినీ వృత్తం.

*965. శరణ మధిగతస్త్వాం శార్ఙ్గిణః పాదరక్షే!*
*సకృదపి వినియుక్తం త్వత్సపర్యాధికారే,*
*పునరపి కథమేనం హస్తముత్తానయేయం*
*ధనమద ముదితానాం మానవానాం సమాజే॥-15*

**అర్థం:-** హేశార్ఙ్గిణః పాదరక్షే=ఓ భగవత్పాదుకా! త్వాం=నిన్ను; శరణం=రక్షకంగా, అధిగతః=పొందిన నేను; సకృత్; అపి=ఒక్కసారి; త్వత్+సపర్యా+అధికారే=నీ పూజాకార్య మందు; వినియుక్తం=ఉపయోగించిన; ఏనం=ఈ, హస్తం=చేతిని; ధన మద ముది తానాం=ధన మదం చేత సంతోషించిన; మానవానాం=మనుష్యుల యొక్క; సమాజే=సమూహమందు; పునః+అపి=మళ్ళీ; కథం=ఎట్లు; ఉత్తానయేయం=చాచేది?

**తా॥** ఓ భగవత్పాదుకా? నీ శరణాగతుడనై నీ పూజకు ఒక్కసారి వినియోగించిన ఈ చేతిని ధనమదంతో ఆనందించే మానవుల ఎదుట మళ్ళీ ఎలాచాచెదను? చాచలేను.

వ్యాఖ్య :- శరణాగతులకు పునర్జన్మ ఉండదు.

పూర్ణశరణాగతులకు భోగసామ్యం అవశ్యంగా కలుగుతుంది. ఒక్కసారి పాదుకార్చన చేస్తే శాశ్వతమైన ఐశ్వర్యం లభిస్తుంది. ప్రకృతి బద్ధులైన వారు సుఖంగా బ్రతుకాలనీ, ధనం కోసం ధన మదాంధుల యెదుట చేయిచాచి బిచ్చమెత్తుకొంటారు. ఇది కించిద్భోగం కదా! బిచ్చమెత్తడానికి సిగ్గువిడిచి చేయిచాచడం ఎంతహీనం? ఇహలోకంలో ఎలాగూ సుఖపడరు. ఈ జన్మలోనైనా ప్రయత్నించలేదు, కాబట్టి, పరలోకంలోనూ సుఖం పొందే అవకాశం ఉండదు. ఉభయభ్రష్టులౌతారుకదా!

''పాణిద్వంద్వ! సమర్చయ! ''పాదుకార్చన కోసం చేతులను ఉపయోగించాలి. బద్ధాంజలులై శరణాగతిచేయాలి. తత్ఫలితంగా, పుట్టకలేని వారై, పూర్ణభోగసామ్యాన్ని అనుభవించే దశను, సార్వభౌముడైన భర్తగల పాదుకాదేవి ప్రసాదిస్తుంది, అని దేశికుల వారి ఆశయం. కావ్యలింగాలంకారం. మాలినీవృత్తం.

*966. యది కిమపిసమీహే కర్మకర్తుం యథావత్*

*ప్రతిపదముపజాతైః ప్రత్యవేయాం నిమిత్తైః।*
*అవధిరసి యది త్వం తత్రనైమిత్తికానాం*
*శరణ మిహనకింమే శౌరి పాదావని!స్యాః-16.*

**అర్థం:-** హేశౌరిపాదావని=ఓ భగవత్పాదుకా! కిం, అపి=ఏదైనా, కర్మ=కర్మను; యథావత్=శాస్త్రవిహితంగా; కర్తుం=చేయడానికి; యది, సమీహే=కోరితినేని; ప్రతిపదం=క్షణం క్షణం;(వెన్వెంట). ఉపజాతైః=ఉత్పన్నమయ్యే; నిమిత్తైః=(మంత్ర, తంత్రలోప) నిమిత్తాలచేత, ప్రత్యవేయాం=ప్రత్యవాయదోషాన్ని పొందుతాను. తత్ర=ఆ నిమిత్త స్థానమందు; త్వం=నీవు; నైమిత్తికానాం=(స్థాలిత్య నిమిత్తంగా విధింపబడిన) ప్రాయశ్చిత్తాలకు; అవధిః=అంతిమస్థానం, అసి=ఉన్నావు. యది=అయితే; ఇహ=ఈ కర్మభూమి యందు; మే=నాకు; శరణం=రక్షకంగా; న,స్యాః,కిం=ఉండకూడదా ఏమి?

**తా॥** ఓ భగవత్పాదుకా! శాస్త్రరీతిగా నేను ఒక కర్మను చేయగోరితే, వెంట వెంట స్వరాక్షర పదవృత్తలోప నిమిత్తంగా ప్రత్యవాయదోషం నాకు కలుగుతుంది.కాబట్టి, నీవు ప్రాయశ్చిత్తాత్మికవైయున్నప్పుడు కర్మవిషయమై నాకు రక్షకంగా ఉండవలదా? ఉండవలసిందే.

**వ్యాఖ్య :- కర్మఫలం పాదుకాధీనం. కాబట్టి పాదుకా శరణవరణమేమేలు.**

శాస్త్రవిహితమైన నిత్యకర్మను అవశ్యంగా అనుష్ఠించవలసిందే. శాస్త్రరీతిగా ఆచరింపజాలకున్నా యథాశక్తి ఆచరించడం వల్ల హానిలేదు. ఫలాన్ని ఆశించిచేసే (కామ్య) కర్మలను యథావిధిగా ఆచరించడం అత్యావశ్యకం.మంత్ర తంత్రాలలో మార్పుగానీ, లోపం గానీ జరిగితే కీడుకలుగుతుంది. స్థాలిత్యదోషం పోవడానికి ప్రాయశ్చిత్త కర్మను ఆచరించాలి.

"ప్రాయశ్చిత్త ప్రసంగేతు సర్వపాపసముద్భవే।
ప్రాయశ్చిత్తిరియం సాఽత్ర యత్పునః శరణం వ్రజేత్॥"

ప్రాయశ్చిత్తకర్మను ఆచరించినప్పుడు కూడా దోషం సంభవిస్తే, ఆ దోషపరిహారంకోసం-సాంగతాసిద్ధికై-మరొక (ప్రాయశ్చిత్త) కర్మను అనుష్ఠించడం అవసరం. ఇలాగా, పరంపరగా ప్రాయశ్చిత్తాల అనవస్థను పరిహరించడానికి ప్రతినిధిగా స్మరింపబడేది పాదుకాదేవియే కదా! అంతదూరం పోయి చివరకు శరణాగతి చేయడం కంటే, మొదలే ఆ కామ్యకర్మను చేయకుండా, శ్రద్ధతో "శ్రీకృష్ణపాదుకాభ్యాం నమః" అని భగవత్పాదాభరణమైన పాదుకాదేవిని శరణు పొందడం శ్రేయస్కరంకదా!

సంభావనాలంకారం. మాలినీవృత్తం.

*967. అంతర్లీనైరఘపరికరైరావిలాచిత్తవృత్తిః*
*శబ్దాదీనాం పరవశతయా దుర్జయానీంద్రియాణి।*

*విష్ణోః పాదప్రణయిని! చిరాదస్యమే దుఃఖసింధోః*
*పారంప్రాప్యం భవతి పరయావిద్యయావాత్వయావా ॥-17.*

**అర్థం:-** విష్ణోః పాదప్రణయిని=భగవత్పాదాల యందు భక్తి యున్న ఓపాదుకాదేవీ! మే=నా యొక్క; చిత్తవృత్తిః= మనోవ్యాపారం; అంతః+లీనైః=లోపల ఇమిడియున్న; అఘపరికర్మైః=పాపవాసనల చేత; ఆవిలా=కలుషితమయింది. ఇంద్రియాణి=చెవులు మొదలైన ఇంద్రియాలు; శబ్ద=ఆదీనాం=శబ్దం, స్పర్శమొదలైన విషయాలకు; పరవశతయా=వశపడి ఉండడం చేత; దుర్జయాని=జయింపరానివి. చిరాత్=చాలాకాలం నుంచి ఉన్న; అస్య=ఈ; దుఃఖసింధోః=దుఃఖరూపమైన సంసారసాగరం యొక్క; పారం=ఆవలిగట్టు (నిశ్శ్రేయసాన్ని); పరయా, విద్యయా, వా=పరభక్తి (ఉపాసన) చేతనైనా, త్వయా, వా=నీచేతనైనా; ప్రాప్యం=పొందదగినదై; భవతి=ఉన్నది.

**తా॥** భగవత్పాద భక్తురాలా! ఓపాదుకాదేవీ! నా మనస్సు యొక్క వ్యాపారం లోన తగిలియున్న పాపవాసనలచేత కళంకితమయింది. ఇంద్రియాలు విషయాలకులోబడి నిగ్రహింప రానివైనాయి. కాబట్టి, చాలకాలం నుంచి అనుభవిస్తున్న ఈ సంసార సముద్రం యొక్క ఉత్తర తీరమైన నిశ్శ్రేయసాన్ని పరభక్తియైనా, నీవైనా చేర్చవలసి ఉంది.

వ్యాఖ్య :- కర్మజ్ఞానానుష్ఠాన యోగ్యతలేని వ్యక్తికి పాదుకాదేవియే ఉపాయమని స్తుతించే శ్లోకం.

భగవత్పాదుకా శరణా గతి వల్ల ప్రతివ్యక్తికి ఫలం సిద్ధిస్తుంది. అయితే, ఆయాకర్మలను విధించే శాస్త్రాలన్నీ వ్యర్థమైపోతాయి. మోక్షఫలం పొందడానికి విధింపబడిన కర్మలను ఎందుకు అనుష్ఠించకూడదు? సాంసారిక అనుభవాల నుంచి తరించడానికి ఏవేవి ప్రతిబంధకాలో, వాటిని నివారించుకోవడానికి శాస్త్రాల్లోనూ, ఉపనిషత్తుల్లోనూ వేర్వేరు ఉపాయాలు-సాధనాలు-చెప్పబడి యున్నాయి. ఆయాసాధనాలను తెలుసుకొని ఆచరించాలి. కాలక్రమంగా ఫలం కల్పింపబడుతుందికదా! అనవచ్చు. అదివాస్తవమే.

కానీ, మనస్సు దుర్వాసనా దూషితమయింది. శబ్దాది విషయాలకు వశమైన ఇంద్రియాలు శమదమాదులను సాధింపలేని విధంగా అదుపు తప్పిఉన్నాయి. ఆంతరబాహ్యేంద్రియాలను నిగ్రహించే శక్తిలోపించడం వల్ల కర్మజ్ఞాన భక్తియోగాలను అనుష్ఠింపలేము. కాబట్టి, సంసారులకు దుఃఖనివృత్తి అయ్యేది పరవిద్య చేతనా?పాదుకా శరణవరణం చేతనా? అని ఆలోచిస్తే, సర్వప్రాయశ్చిత్తంగా చెప్పబడిన పరవిద్యోపాసన కూడా శక్తి హీనునికి అశక్యమే కదా! అందువల్ల, పాదుకాదేవియే సర్వదా మనకు శరణమని ఆచార్యుల హృదయం.

పూర్వార్థం చేత విషయాన్ని సమర్థించడం వల్ల ఇది 'కావ్యలింగాలంకారం'. మందాక్రాంతావృత్తం.

*968.* *గోమాయూనాం మలయపవనే తస్కరాణాం హిమాంశౌ*
*దుర్వృత్తానాం సుచరిత మయే సత్పథేత్వత్సనాథే,*
*తత్త్వజ్ఞానే తరళమనసాం శార్ఙ్గిణః పాదరక్షే!*
*నిత్యోద్వేగో భవతి నియతే రీదృశీ దుర్వినీతిః-18*

**అర్థం:-** శార్ఙ్గిణః, పాదరక్షే=ఓ భగవత్పాదుకా! గోమాయూనాం=గుంటనక్కలకు; మలయపవనే=మలయ పర్వతం నుంచి వీచె గాలియందు; తస్కరాణాం=దొంగలకు; హిమ+అంశౌ=శీతకిరణుడైన చంద్రుని యందు; దుర్వృత్తానాం=దుశ్చరితులకు; సుచరితమయే=సదాచార పూర్ణమైన; త్వత్+సనాథే=నీతోకూడిన సత్+పథే=సన్మార్గ మందు; తరళ మనసాం=చపలచిత్తులకు; తత్త్వజ్ఞానే=ఆత్మయాథాత్మ్య నిర్ణయమందు; నిత్య+ఉద్వేగః=శాశ్వత భయం; భవతి=ఉంటుంది. నియతేః=విధియొక్క; దుర్వినీతిః=చెడ్డపోకడ; ఈ దృశీ=ఇలాంటిది.

**తా॥** ఓ భగవచ్చరణావనీ! నక్కలకు మలయ మారుతం వీస్తే భయం. దొంగలకు చంద్రుడు ప్రకాశిస్తే భయం. 'నీవేగతి' అనే సదాచారమయమైన సత్పురుషుల మార్గమంటే దురాచారులకు భయం. చపలచిత్తులకు తత్త్వజ్ఞాన విషయమై భీతి ఎల్లప్పుడు ఉంటుంది.

**వ్యాఖ్య:-** జనులందరికి ఆహ్లాదం కలిగించే వాళ్ళు కొందరికి భయం కలిగించడం విధి దుర్విలాసమే.

స్వగత స్వీకారం, పరగతస్వీకారం అని రెండు పద్ధతులున్నాయి. జితేంద్రియులై కర్మజ్ఞాన యోగాలను అనుష్ఠించి సిద్ధిని పొందడం స్వగతస్వీకార పద్ధతి. వివేకమెంత ఉన్నా "నన్ను నేను రక్షించుకోలేను, భగవంతుడే నన్ను రక్షించాలి" అని అకించనత్వం, అగతికత్వం పాటించడం పరగత స్వీకారపద్ధతి.

ఈ రెండు పద్ధతులున్నప్పుడు మొదటి పద్ధతిని విడిచి పెట్టే దృష్టి ఎందుకు? వివేకాదులకు మూలమైన "ఇంద్రియాలను జయించడం" ఆవశ్యకమేకదా! "ప్రపన్నులకు శాస్త్రవిహితమైన నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానం అవశ్యంగా లేదు" అనే బుద్ధి కొందరికి ఉంది. ఈ దుష్ప్రవృత్తిని విడువడం శ్రేయస్కరం, అని వాదిస్తే సమాధాన పరచే శ్లోకమిది.

వసంతకాలంలో దక్షిణ దిక్కునుంచి వీచే పిల్లతెమ్మెర ప్రాణులన్నింటికి ఆనందాన్ని కలిగిస్తే, గోమాయువుల (నక్కల) కు భయాన్ని కలిగిస్తుంది. సమస్తజనులకు ఆహ్లాదాన్ని కలిగించే చంద్రుడు చోరులకు మాత్రం భయాన్ని కలిగిస్తాడు. దుర్మార్గులు సన్మార్గంలో సంచరించడానికి వెరుస్తారు. చపలచిత్తులకు తత్త్వబోధకలిగినా, అది చాలాకాలం నిలవదు.

"యత్ర నిర్లిప్త భావేన సంసారే వర్తతే గృహే।
ధర్మం చరతి నిష్కామః, తత్రైవరమతేహరిః"

సంసారి నిర్లిప్తమనస్కుడై నిష్కామకర్మను ఆచరిస్తే, కంసారి ఆచోటనే రమిస్తాడు, అని ఆప్తవాక్యం. అయితే, నిర్లిప్త భావమూ, నిష్కామకర్మనిష్ఠా ఎందరికి సంభవిస్తుందో చెప్పరానిదే. విధి బలీయం కదా!

అందరి అదృష్టం-నియతి-ఒక్కరీతిగానే ఉంటుందా? ఉండదు కదా! కాబట్టి "అత్యంత అకించనుణ్ణి" అని పాదుకాదేవితో విజ్ఞాపన చేసుకోవడం ప్రాజ్ఞలక్షణం.

దీపకాలంకార ప్రాణిత అర్థాంతరన్యాసాలంకారం. మందాక్రాంతావృత్తం.

969. కాలేజంతూన్ కలుషకరణే క్షిప్రమాకార యంత్యాః
ఘోరం నాహం యమపరిషదో ఘోషమాకర్ణయేయమ్।
శ్రీమద్రంగేశ్వర చరణయో రంతరంగైఃప్రయుక్తం
సేవాహ్వానం సపదిశ్రుణుయాం పాదుకాసేవకేతి॥-19

**అర్థం:-** కలుష కరణే=కలత చెందే ఇంద్రియాలు కలిగిన; కాలే=(చరమ) కాలమందు; జంతూన్=ప్రాణులను; క్షిప్రం=శీఘ్రంగా; ఆకారయంత్యాః=పిలిచే; యమ పరిషదః=యమభటుల సముదాయం యొక్క; ఘోరం=భయజనకమైన; ఘోషం=పెద్ద ధ్వనిని; అహం=నేను; న,ఆకర్ణయేయం=వినలేను. శ్రీమత్+రంగ+ఈశ్వర, చరణయోః=శ్రీరంగనాథుని పాదాలకు; అంతరంగైః=సమీపమందు ఉండే పరిజనుల చేత; ప్రయుక్తం=ఉచ్చరింపబడిన; 'పాదుకాసేవక' ఇతి=పాదుకాసేవకుడా! అనే; సేవా+ఆహ్వానం=సేవకోసమైన పిలుపును; సపది=వెంటనే; శ్రుణుయాం=వినవలెను (నేను).

**తా॥** ఇంద్రియాలు క్షోభపడుతూ ఆయువు ముగిసే కాలానత్వరగా రమ్మని పిలిచే యమభటుల భయానక శబ్దాన్ని నేను వినజాలను కానీ, శ్రీమద్రంగేశ్వరుని పాదపద్మసన్నిధిలో ఉండే అంతరంగికులచే పిలువబడే 'పాదుకాసేవకా!' అనే కైంకర్యార్థమేర్పడిన పేరును త్వరగా నేను వినాలి.

వ్యాఖ్య :- భగవత్పాదకమల సేవను ప్రసాదింపుమని కవి విజ్ఞాపన.

నరక మార్గం నుంచి తప్పించడానికి భగవన్నామ సంకీర్తనాది పద్ధతులెన్నో ఉన్నాయి. కాయికంగా, మానసికంగా చేసే సేవకన్నా, భగవద్భాగవతాచార్యులను నోరారస్తోత్రంచేస్తూ తాము తరించడమే కాక ఇతరులనూ తరింపజేసే వాచికసేవ ఎంతో మిన్నకదా! అయినా, ఈ పద్ధతులనూ, ఉపాయాలనూ అణచివేసే క్రూరమైన, ఘోరమైన ఉపాయాలు ప్రతిక్షణం ప్రాదుర్భవిస్తుంటాయని ప్రాజ్ఞులు భయపడుతారు.

"తిమింగిలతితద్గిలో గిలతి తద్గిలస్తద్గిలమ్". 'తిమి' అనే చేపనుమింగే 'తిమింగిల' మనే చేపను కూడా మింగే 'తిమింగిల గిలమూ' ఉంటుందన్నట్లూ, అసంభావితాన్నీ సంభావింపజేసే ఆపదల క్రూరత్వం చెప్పరానిది.

కాబట్టి, ఇంద్రియాలు శిథిలమై, ప్రాణోత్కర్షణ జరిగే సమయంలో యమభటుల భర్త్సనం వినడానికి ప్రపన్నులే కాదు, ఎవ్వరూ అపేక్షింపరు.

పాదుకానుగ్రహం వల్ల భగవంతుడే సంసారబంధాన్ని తెంచి తన పాదపద్మ కైంకర్య సామ్రాజ్యాన్ని ప్రసాదింపతలచి, పంపిన తన పరిచారకులు వచ్చి "ఓ పాదుకాసేవకా! శ్రీరంగనాథుడు నిన్ను త్రిపాద్విభూతికి పిలిచికొని రమ్మని మమ్మాజ్ఞాపించాడు. కాబట్టి, శ్రీమన్నారాయణుని పాదుకా శిరోధారణం కోసం శీఘ్రంగా రమ్ము" అనే ముక్తి భాజుల ఆహ్వానాన్ని ప్రాథమికంగా అపేక్షిస్తారు ప్రపన్నులు.

యమునికి వశమయ్యే ప్రసక్తి తనకు ఉండకున్నా, దేశికులవారు నిర్వేదాతిశయం వల్ల, పాదుకాదేవితో అతిఘోరమైన అనిష్టాన్ని తొలగించడమే కాక అత్యుచ్ఛ్రేయస్సునూ కలిగించుమని విన్నవించుకొన్నారు.

ప్రేయో2లంకారం. మందాక్రాంతావృత్తం.

*970. పాషాణకల్పమంతే*
*పరిచిత గౌతమ పరిగ్రహన్యాయాత్।*
*పతిపద పరిచరణార్హం*
*పరిణమయ ముకుందపాద రక్షిణి! మామ్॥-20*

**అర్థం:-** హేముకుంద పాదరక్షిణి=మోక్షమిచ్చే భగవంతుని పాదాలను రక్షించే ఓ పాదుకాదేవీ! అంతే=మరణకాల మందు; పాషాణకల్పం=శిలనుపోలియుండే; మాం=నన్ను; పరిచిత గౌతమ పరిగ్రహ న్యాయాత్=పూర్వం (పాదంచేత) స్పృశింపబడిన గౌతమర్షియొక్క పత్నియైన అహల్య యొక్క దృష్టాంతంవల్ల/అహల్యను అనుగ్రహించిన విధంగా; పతిపద పరిచరణ+అర్హం=భర్త/జగత్పతి యొక్క పాదసేవకు యోగ్యునిగా; పరిణమయ=(మార్చుము) చేయుము.

**తా॥** ఓ ముకుంద పాదుకా! పూర్వకాలంలో (రామపాదుకవైన) నీవు, గౌతముని భార్యయైన అహల్య పాషాణంగా పడియున్నప్పుడు ఆ రాతిని తాకి నాతిగా మార్చి ఆమెను ఆమె భర్త యొక్క పాదసేవకు యోగ్యురాలను చేశావు. అలాగే, మరణసమయంలో పాషాణసదృశంగా పడియుండే నన్ను జగత్పతియైన భగవంతుని పాదపద్మాలకు కైంకర్యం చేయడానికి యోగ్యునిగా మార్చి కూర్చుము.

వ్యాఖ్య :- భగవచ్చరణ పరిచరణ యోగ్యుడగునట్లు తనను అప్రాకృత శరీరయుక్తునిగా చేయుమని పాదుకాదేవితో కవిప్రార్థన.

మరణకాలాన ఇంద్రియాలు శిథిలమవుతాయి. కరణకళేబరం చైతన్యం లేని బండరాయిలాగా పడియుంటుంది. పుత్రకళత్రాదులు "నారాయణ" అనుమని చెవిలో తాము గొంతురాపడునట్లు అరచినా, ఆయన 'నార' అనడు 'పీచు' అనడుకదా! సామాన్యులకు అంత్యకాలంలో భగవన్నామాన్ని స్మరించడం అత్యావశ్యకం. కానీ జీవితమంతా భగవద్గుణాను సంధానంతో గడిపే ప్రపన్నులకు అంతిమ స్మృతి అవసరం లేదని సంప్రదాయ రహస్యం.

"తతస్తం మ్రియమాణంతు కాష్ఠపాషాణ సన్నిభమ్।
అహంస్మరామి మద్భక్తం, నయామి పరమాంగతిమ్॥"

'కర్రలాగా, రాయిలాగా అచేతనుడైపడి మరణిస్తున్న నాభక్తుణ్ని నేనే స్మరించి పరమపదానికి తీసుకొని పోతాను' అని భగవంతుడే వరాహావతారంలో అన్నాడు, శ్రీరంగనాథుని చరమశ్లోకం కూడా అలాగేఉంది.

"మామేవానుస్మరన్వత్వం త్వామహం సంస్మరామిచ।
ఉపాయమపవర్గస్య రహస్యమపిమేశ్రుణు॥
సర్వకర్మాణి సంత్యజ్య సర్వకర్మఫలానిచ।
శరణం మాంప్రపద్యస్య సర్వబంధవిముక్తయే॥"

అర్చారూపియైన శ్రీరంగనాథస్వామిని సర్వదా స్మరిస్తే, ఆ స్వామి భక్తుణ్నీ స్మరిస్తాడు. సర్వకర్మఫలాలను వదలి ప్రపత్తిచేస్తే, పుణ్యపాపబంధాలు తెగిపోయి మోక్షానందాన్ని పొందగలడని అర్థం.

"లౌకికమొల్లక నన్నాలోకించుప్రపన్నులకును లోబడి, కరుణా
లోకనముల పోషింతును; నాకాశ్రిత రక్షణములు నైసర్గికముల్".

"శరణమాగుంతనతాళడై న్దార్కెల్లాం మరణమానాల్ వైకుందం కొడుక్కుంపిరాన్" (తి.వామొళి.) తనను శరణుజొచ్చిన వారికి భగవంతుడు వారిదేహావసానమప్పుడు మోక్షమొసగును, అన్నారు ఆళ్వార్లు. భర్తయైన గౌతముని శాపంచేత పాషాణ రూపాన్నిపొందిన అహల్యకు శ్రీరామచంద్రస్వామి తన పాదధూళి స్పర్శచేత నిజరూపాన్ని కల్పించాడు. ఆమె పవిత్రురాలై, పతిసేవకు యోగ్యమైన భాగ్యవతి అయింది. దేశికులు అహల్య చరిత్రను దృష్టాంతంగా చూపి తనకోరికను పాదుకాదేవితో విన్నవించుకొన్నారు.

చరాచరప్రపంచమంతా స్త్రీప్రాయమే. "ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" (గీత) "పతిం విశ్వస్య" అనే శ్రుతి ప్రకారంగా పరమాత్ముడు జగత్పతి.సర్వశేషికదా!

దేహవియోగ కాలంలో కఫవాత పిత్తాదులచే కంఠం అవరుద్ధమై భగవంతుణ్ని స్మరించలేక, ఇంద్రియాలు సన్నగిల్లి కాయం కట్టెచరచుకపోయినట్లుగా ఉన్నప్పుడు, ముకుందుని పాదాలను రక్షించే పాదుకాదేవియే తనను స్మరించి, భగవత్పాదారవిందాలకు సేవచేయడానికి అర్హమైన అప్రాకృత శరీరం కలవానిగా చేయవలెనని దేశికులు ప్రార్థించారు.

'గౌతమి', 'పాషాణకల్ప' అనే పదాల ప్రయోగం వల్ల ఒక వ్యంగ్యార్థం భాసిస్తున్నది. న్యాయశాస్త్రమని పేరున్న తర్కశాస్త్రానికి రచయిత గౌతమ మహర్షి. ఉపనిషత్సిద్ధాంతానికి వ్యతిరేకంగా వ్యాఖ్యానం చేయబడిన ఆ న్యాయశాస్త్రాన్ని వేదాంత సిద్ధాంతానికి అనుగుణంగా పరిష్కరిస్తూ దేశికులు "న్యాయపరిశుద్ధి" అనే గ్రంథాన్ని రచించారు. వీరు "కవితార్కిక కేసరి" బిరుదాంచితులు కదా!

గౌతమీయ న్యాయశాస్త్రరీతిగా "పాషాణకల్పోమోక్షః" అనే విషయం సుప్రసిద్ధం. జీవునికి జన్మసంబంధం చేత ఏర్పడే తాపత్రయరూపమైన దుఃఖపరంపరకు ఆత్యంతిక విధ్వంసం కలిగే స్థితి ఈ తర్కశాస్త్రంలో నిర్వచింపబడింది. జ్ఞానోత్పత్తికి హేతువైన శరీరేంద్రియాలు తొలగిపోతాయి. జీవాత్మకు జ్ఞానం స్వాభావిక నిత్యధర్మం. అచేతనమే కాబట్టి, ఆ స్థితి కలుగడమే 'పాషాణకల్పోమోక్షః' అని వ్యవహారం. మళ్ళీ దుఃఖ మేర్పడదు కాబట్టి అదే ఆనంద రూపం. "ఆగంతుక చైతన్య గుణయోగీ ఆత్మా" అని వారి సిద్ధాంతం.

ఈ పాషాణస్థితి దేశికులచే అపేక్షితంకాకున్నా, ఒకవేళ తనకు అశాస్త్రప్రకారం పాషాణకల్పస్థితి ఏర్పడితే, అది కూడా భగవత్పాదసేవకు యోగ్యంగా పరిణమించాలని దేశికులు ప్రార్థించారు. (ఈ శ్లోకానికి మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శ్రీ.న.చ. రఘునాథాచార్యుల వారు, ఇలా వ్యంగ్యార్థమున్నదని అనుగ్రహించారు.) ఉపమాలంకారం. ఆర్యావృత్తం.

నిర్వేదపద్ధతి సమాప్తం.

# 32. ఫలపద్ధతి

*971. ఉపాఖ్యాతాం తథాత్వేన వసిష్ఠాద్యైర్మహర్షిభిః*
*ఉపాయ ఫలయోః కాష్ఠాముపాసే రామపాదుకామ్॥-1*

**అర్థం:-** ఉపాయఫలయోః=శరణాగతికీ, మోక్షప్రాప్తికీ; కాష్ఠాం=పరమావధియైన; వసిష్ఠ+ఆద్యైః=వసిష్ఠమహర్షి మొదలైన; మహర్షిభిః=మహర్షులచేత; తథాత్వేన=ఆప్రకారంగానే; ఉపాఖ్యాతాం=చెప్పబడిన; రామపాదుకాం= శ్రీరామపాదుకను; ఉపాసే=సేవిస్తాను.

**తా॥** భగవత్పాదకయే ఉపాయానుష్ఠానానికీ, మోక్షఫలానికీ సీమాభూమి. వసిష్ఠాది మహర్షులు కూడా ఉపాయఫలకాష్ఠ రూపంగా చెప్పిన శ్రీరామపాదుక(ల)ను సేవిస్తుంటాను.

**వ్యాఖ్య :- భగవత్పాదుకయే ఉపాయోపేయాలకు పరమావధి.**

శాస్త్రవిధిగా ఉపాయాన్ని అనుష్ఠించి దానిచేత పొందదగిన ఫలాన్ని ఈ పద్ధతిలో దేశికులు చెబుతున్నారు. ముముక్షువులు ఫలాన్ని పొందగోరి అనుష్ఠించే శరణాగతియే 'ఉపాయం'. పాదుకాశరణవరణం కన్న మరొక సాధనానుష్ఠానం ఆపైన లేదు. కాబట్టి, ఉపాయానుష్ఠనానికి పరాకాష్ఠగా నిలిచేది పాదుకాదేవి.

భగవంతుని పాదకమలసేవ చేయడమే ఫలం. అదేమోక్షం. ఉపేయమంటే పొందదగిన ఫలమని అర్థం. ఫలప్రాప్తికి మించింది మరొకటి లేదు. కాబట్టి, భగవత్కైంకర్యనిష్ఠకు కూడా పరాకాష్ఠగా నిల్చేది భగవద్విశిష్టపాదుకయే అని ఋష్యాదులు వక్కాణించారు.

"ఏతేహి సర్వలోకస్యయోగక్షేమం విధాస్యతః"

"ఈ శ్రీరామపాదుకలే సకలలోకాలకు యోగక్షేమాలను కలిగిస్తాయి" అని వసిష్ఠమహర్షి చిత్రకూట ప్రాంతంలో నిర్దేశించారు. ఆపాదుకలనే భరతుడు శిరసావహించి చెప్పగా, భరద్వాజ మహర్షి ఆమోదించాడుకదా! పాదుకా ప్రభావాన్ని వాల్మీకి మహర్షి శ్రీమద్రామాయణంలో మొట్టమొదట విశదీకరించాడు.

విశ్వామిత్రుని వెంట మిథిలకు రామలక్ష్మణులు పోతున్నప్పుడు, నిర్జనమైనా, రమ్యమైన ఆశ్రమం రీతిగా ఉన్న ప్రదేశాన్ని చూచి, శ్రీరాముడే "శ్రోతుమిచ్ఛామి భగవన్ కస్యాయం పూర్వ ఆశ్రమః"? అని అడిగాడు. అప్పుడు విశ్వామిత్రుడు "హన్త! తే కథయిష్యామిశ్రుణు" అయ్యో! నీకు చెబుతాను వినుమన్నాడు. రాముడడిగేదాకా విశ్వామిత్రుడు ఆ సంగతిని మరచినట్లే ఉందికదా! రాముని సంచారం ఆయన పాదుకలకు అధీనమైనదే కాబట్టి కాసేపు ఆగాడు. కథను విన్నాడు. విశ్వామిత్రుడు "తదాగచ్ఛ మహాతేజః!" అని "తారయైనాం మహాభాగాం" అని నిర్దేశిస్తూ ఆశ్రమంలో ప్రవేశించిన వెంటనే ప్రవేశించారు రామలక్ష్మణులు. రజోదుష్టయైన అహల్య రామపాదుకారజః

స్పర్శచేత పవిత్రురాలైనది. అహల్యాగౌతములు రామచంద్రస్వామిని పూజించారుకదా! పాదుకలను ధరించిన పాదాలయందు రజః ప్రసక్తి ఉండదు. పాదుకలను పాదాలుగా "ఆర్యపాదావిమౌ" అన్నట్లు పాదుకాధూళిని కూడా పాదధూళిగా అధ్యవసించడం, అనుసంధించడం ఆర్షమే. రాముడే తన సంకల్ప బలంతో అహల్యను పరిశుద్ధురాలను చేశాడని వాల్మీకి మహర్షి అనలేదు. అప్పటికి సీతాదేవి ప్రసక్తియే లేదు. కాబట్టి, శ్రీరాముని చరణకమలాలకు రక్షణ కల్పించే పాదుకాదేవి, ఒక్కతే అహల్యాశాప విముక్తికోసం స్వామికి సహాయురాలయింది. (282వ శ్లోకం గమనీయం). అందుకే, నిర్వేద పద్ధతిలో చివర "పరిచితగౌతమ పరిగ్రహన్యాయాత్ పతిపద పరిచరణార్హం పరిణమయ" అని ప్రార్థించి ఈ పద్ధతిలో మొదట, భగవత్పాదుకలు మాత్రమే శిరోధార్యాలనీ, ఆపాదుకా సేవయే పరమ పురుషార్థమనీ, పాదుకాదేవిని దేశికులు ఉపాసిస్తున్నారు.

కావ్యలింగాలంకారం. అనుష్టుప్ ఛందం.

*972. నివిశేయ నిరంతరం ప్రతీత*
*స్త్రిదశానాం విభవం తృణాయమత్వా।*
*సవిధే తవదేవి! రంగభర్తుః*
*పదలీలా కమలం సముద్వహంత్యాః ॥-2*

**అర్థం:-** హేదేవి=ఓ పాదుకాదేవీ! (అహం=నేను;) ప్రతీతః=పాదుకా సేవకుడని ప్రసిద్ధుడనై; త్రిదశానాం=దేవతల యొక్క; విభవం=ఐశ్వర్యాన్ని; తృణాయ=గడ్డిపరకగా; మత్వా=తలచి; రంగభర్తుః=శ్రీరంగపతి యొక్క; పద లీలాకమలం=పాదం అనే విలాస పద్మాన్ని; సముద్వహంత్యాః=ధరించిన; తవ=నీయొక్క; సవిధే=సమీపంలో; నిరంతరం=ఎల్లప్పుడు; నివిశేయ=ఉంటాను.

**తా॥** ఓ పాదుకాదేవీ! నేను పాదుకాసేవకుడనే ప్రసిద్ధిని పొందిన వాడనై, దేవతల విభవాన్ని తృణప్రాయంగా భావించి, శ్రీరంగపతి పాదమనే లీలా కమలాన్ని ధరించిన నీ దగ్గర సర్వకాల సర్వావస్థలయందు చేరి ఉంటాను.

వ్యాఖ్య :- 'ఫలం' అంటే 'ఇది' అని విశదీకరించే శ్లోకం.

స్వర్గంలోని ఇంద్రాది దేవతలు అనుభవించే సకలభోగాలన్నీ అల్పములూ, అస్థిరములూను, "ఏతేవైనిరయాస్తాత స్థానస్య పరమాత్మనః।"అన్నట్లు శాశ్వతమైనవి కావు. వైకుంఠానుభవం శాశ్వతమైనదని కించిద్భోగ హేతువైన దేవతల ఐశ్వర్యాన్ని ముముక్షువు నిరాదరిస్తాడు. శ్రీరంగపతి పాదమే కమలం. కమలాన్ని లీలగా ధరించేది లక్ష్మీదేవి. భగవత్పాద లీలాకమలాన్ని ధరించిన ఐశ్వర్యదేవతా సన్నిధిలో సర్వదా దాస్యం చేస్తూ ఉండడమే మోక్షఫలానుభవం. "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా" (శ్రుతి) ముక్తునికి, సర్వవిషయాల మీద విరక్తి కలిగి, పరబ్రహ్మ యొక్క కల్యాణ గుణభోగ్యతకే ప్రాధాన్యముండేది ఫలదశ. భగవత్కైంకర్య సామ్రాజ్యానుభవాన్ని భంగ్యంతరంగా చెప్పడం వల్ల 'పర్యాయోక్తి' అలంకారం. వృత్తం ఔపచ్ఛందసికం.

*973. కిమహం మణిపాదుకే! త్వయా మే*
*సులభే రంగనిధౌ శ్రియాసనాథే।*
*కరణాని పునః కదర్థయేయం*
*కృపణద్వారదురాసికాదిదుఃఖైః॥ -3*

**అర్థం:-** హేమణిపాదుకే=ఓ రత్నపాదుకా! త్వయా=నీ చేత; మే=నాకు; సులభే=సుఖంగా దొరికే; శ్రియా=లక్ష్మీదేవితో; సనాథే=కూడిన; రంగనిధౌ=రంగ విమానమందలి భగవంతుడనే నిధి (మూలధనం) ఉండగా; పునః=మళ్ళీ; అహం=నేను; కృపణ ద్వార, దుః+ఆసికా, ఆది, దుఃఖైః=లోభుల వాకిళ్ళలో శ్రమపడే దుఃస్థితి మొదలైన దుఃఖాలతో; కరణాని=ఇంద్రియాలను; కిం, కదర్థయేయం=ఎందుకు పీడించాలి?

**తా॥** ఓ మణిపాదుకా! నీ ద్వారా నాకు లక్ష్మితో కూడిన శ్రీరంగేశ్వరుడనే నిధి అనాయాసంగా లభిస్తుంటే, మళ్ళీ లోభులయిండ్ల వాకిళ్ళలో నిలిచి యుండడం, అనువర్తించడం మొదలైన బాధలను అనుభవిస్తూ, నా వాగాదీంద్రియాలను ఎందుకు కష్టపెట్టాలి?

వ్యాఖ్య :- నిధిలభింపగా క్షుద్రులను యాచించడం వ్యర్థమని హితవాక్యం .

"ఒం డొడియాళ్ తిరుమకళుమ్ నీయుమ్." మెరిసే కంకణాలుగల లక్ష్మీదేవి, నీవూ కలిసియున్న అన్నట్లు, సర్వ ఫలసాధనమైన నిధి లక్ష్మీసనాథుడైన శ్రీరంగనాథుని సన్నిధి. పాదుకానుగ్రహంవల్ల ఈ నిధి ఎలాంటి శ్రమ పడకుండా ప్రాప్తిస్తుందికదా! ఇక గత జన్మల్లో లాగాక్షుద్రుల ముంగిళ్ళలో నిలిచి, అయ్యా! అని నోరుతెరచి యాచిస్తూ, చేయిచాచడం నిష్ప్రయోజనం.

లోభులకు దానగుణం అరుదు. ఒకవేళ వారు ఇచ్చినా అదిస్వల్పమే. ధనాశచే ముప్పొద్దులూ లోభుల ముంగిళ్ళకు తిరుగడం వల్ల కాళ్ళుపీకుతాయి. వేచి యుండడం వల్ల కళ్ళువాస్తాయి. ఇంద్రుడవు, చంద్రుడవు అని కొండాడడం వల్ల కొండెనాలుక కూడా ఎండి పోతుంది. ద్వారం గుండా వచ్చిపోయే వారు చూచి" ఎప్పుడీ దరిద్రుడు ఇక్కడే ఉంటాడేమి? అని నిందిస్తుంటే చెవులు చిల్లులు పడుతాయి. గంటలకొద్ది నిలిచియుండే దుఃస్థితి వల్ల దేహం నీరసిస్తుంది. నిట్టూర్పులు సంభవిస్తాయి. కాబట్టి క్షుద్రయాచనతో సర్వేంద్రియాలకు బాధకలిగించడం కంటే సర్వేంద్రియాలను సంతృప్తి పరచే శ్రీరంగనిధిని సులభంగా అందించే పాదుకాదేవిని ప్రస్తుతించడం పరమ పురుషార్థం.

కావ్యలింగాలంకారం.

వృత్తం-ఔపచ్ఛందసికం.

*974. సకృద ప్యనుభూయ రంగభర్తు*
*స్త్వదు పశ్లేష మనోహరం పదాబ్జమ్।*

*అపునర్భవ కౌతుకం తదైవ*

*ప్రశమం గచ్ఛతి పాదుకే! మునీనామ్ ॥-4.*

**అర్థం:-** హేపాదుకే=ఓపాదుకాదేవీ! మునీనాం=మునులకు; అపునర్భవ కౌతుకం=మరుజన్మకూడదనే ఆశ; త్వత్+ఉపశ్లేష మనోహరం=నీ పరిష్వంగం చేత మనోజ్ఞమైన; రంగభర్తుః= రంగపతి యొక్క; పద+అబ్జం= పాదకమలాన్ని; సకృత్+అపి= ఏదో ఒక్కసారి; అనుభూయ=అనుభవించి, పొంది; తదా, ఏవ=అప్పుడే; ప్రశమం=శాంతిని; గచ్ఛతి=పొందుతుంది.

**తా॥** ఓ పాదుకాదేవీ! మునులకు మళ్ళీ జన్మకూడదనే కోరిక, నీ సంశ్లేషచేత అందమైన శ్రీరంగపతి పాదకమలాన్ని ఎప్పుడో ఒక్కసారి సేవించినప్పుడే శాంతిని పొందుతుంది.

వ్యాఖ్య :- ఒక్కసారి భగవత్పాదుకను సేవిస్తే మోక్షేచ్ఛ కలుగదు.

మునులు 'పునర్జన్మ వద్దు' అని ఆశిస్తుంటారు. పాదుకాదేవి ఆశ్రయించిన శ్రీరంగనాథుని చరణ సరోజం ఎంతో మనోజ్ఞంగా ఉంటుంది. ఆపాదాబ్జాన్ని ఒక్కసారి ప్రపత్తి చేస్తేనే ముక్తి లభిస్తుంది. కాబట్టి వారు సకృత్తుగా భగవద్విశిష్టపాదుక(ల)ను సేవించినప్పుడే, వారికి ముక్తిఫలాన్ని పొందే కోరిక శాంతిస్తుంది.

"తులయామ లవేనాపి నస్వర్గం నా పునర్భవమ్।

భగవత్సంగి సంగస్య, కిముతాన్యా ఇహాఽశిషః" (భాగవతం)

భగవంతునితో కలిసి యుండే భాగవతోత్తముల సహవాసానికి స్వర్గాన్ని గానీ, జన్మరాహిత్యాన్ని గానీ ఏమాత్రం సరితూచలేము. ఇక వేరే కోరికలను గూర్చి చెప్పేదేమి?

కించిత్కాలమైనా అనుభవించే పాదుకాసేవ మోక్షాతిశాయిని కదా! పాదుకాసేవాలౌల్యం వల్ల సాత్త్విక జనులు పునర్జన్మను కోరుకున్నా, వారు కాదాచిత్కంగా పాదుకలను ధరించిన భగవత్పాదాలను సేవిస్తే చాలు! మహానందం కలుగుతుంది. మోక్షేచ్ఛ కూడా నివృత్తి పొందుతుంది. 'అతిశయోక్తి' అలంకారం. ఔపచ్ఛందసికం.

*975. అపరస్పర పాతినామమీషా*

*మనిదం పూర్వ నిరూఢ సంతతీనామ్!*

*భరత వ్యసనా దనూన సీమ్నాం*

*దురితానాంమమ నిష్కృతిస్త్వమాసీః॥*

**అర్థం:-** ఓ పాదుకాదేవీ! అపరస్పర పాతినాం=సతతం పడుతున్న; అనిదం పూర్వ, నిరూఢ, సంతతీనాం=అనాది కాలంగా, వేరూని దృఢమై, ఎడతెగక వస్తున్న; భరతవ్యసనాత్=భరతుని దుఃఖంకంటె; అనూన సీమ్నాం=తక్కువలేని-అధికమైన-హద్దు కలిగిన; మమ=నా యొక్క; అమీషాం=ఈ; దురితానాం=దుష్కర్మలకు; త్వం=నీవు; నిష్కృతిః= ప్రాయశ్చిత్తవై (హంత్రివై) ఆసీః=ఉంటివి.

తా॥ ఓ పాదుకాదేవీ! ఎల్లప్పుడు మీద మీద పడుతున్న, ఎంతోకాలం నుంచి వేళ్ళూని ప్రవాహాలకు దొర్లిపోనట్టి, భరతుని దుఃఖం కన్న ఎక్కువ మేరకలిగిన నా ఈ పాపాలను నశింపజేసేదానవు నీవే.

వ్యాఖ్య :- పాదుకాసేవకు ప్రతిబంధకాలైన పాపాలను ఆదేవియే నశింపజేస్తుంది.

సత్త్వగుణవృద్ధిచే పాదుకుసేవ చేసే భాగ్యం కలిగిన మునుల వంటి వారెందరుంటారు? చాల అరుదుగా ఉంటారు. దుష్కర్మలు ఒకటి తర్వాత మరొకటి ఎడతెగకుండా కలుగుతుంటాయి. సంచిత కర్మలనే మొక్కలు బాగా నాటుకొని జన్మలనే ప్రవాహంలో కొట్టుకొనిపోక దృఢంగా నిలిచి ఉన్నాయి. పైగా, ప్రతిజన్మలోనూ చేసిన కర్మలన్నీ పాత కర్మల రాశిలోచేరి మేరమీరి ఉన్నాయి. "మత్పాపమేవ" నా పాపం వల్లనే శ్రీరామచంద్రస్వామి నాకు దూరమయ్యాడని భరతుడు దుఃఖపడుతుంటే, పాదుకాదేవి వచ్చి అతని దుఃఖాన్ని ఉపశమింపచేసింది. భరతుని బాధకంటె ఎన్నోరెట్లు ఎక్కువగా బాధను కలిగించే సకల పాపాలను పాదుకాదేవి ప్రక్షాళనం చేయడమే ఫలం.

"అపరస్పరాః క్రియాసాతత్యే" అనే నిపాతనం వల్ల 'అపరస్పర' శబ్దం సాతత్యార్థకం.

పాదుకా సేవకువిరోధంగా ఉన్న సర్వదుష్కృతాలకు ఆదేవియే నిష్కృతి. ఈ ఫలం తనకూ, మనకూ లభించాలని కవికేసరి ప్రార్థన.

రూపకాలంకారం- 'భరతవ్యసనాదనూనసీమ్నాం' అనే చోట ఉపమాలంకారం. వృత్తం-ఔపచ్ఛందసికం.

*976. త్వదుపాసన సంప్రదాయవిద్భి*
*స్సమయే సాత్వత సేవితే నియుక్తాః।*
*భరతవ్రతినో భవాంబురాశిం*
*కతిచిత్ కాంచన పాదుకే! తరంతి॥-6*

**అర్థం :-** హే కాంచన పాదుకే=ఓ హిరణ్య పాదుకా! సాత్వతసేవితే=భగవచ్ఛాస్త్ర నిష్ఠుల చేత అనుష్ఠింపబడిన; సమయే=ఆచారమందు; త్వత్+ఉపాసన, సంప్రదాయవిద్భిః=నీ పూజయొక్క సంప్రదాయాన్ని తెలిసి యున్న వారిచేత; నియుక్తాః=(ప్రేరితులైన) నియమింపబడిన; భరతవ్రతినః=భరతుని వంటి ఆరాధకులు; కతిచిత్=కొందరు; భవ+అంబురాశిం=సంసారమనే సముద్రాన్ని; తరంతి=దాటుతారు.

**తా॥** ఓ స్వర్ణపాదుకా! శ్రీ పాంచరాత్రాగమనిష్ఠులచే అనుష్ఠింపబడిన ఆచార మందు నీ ఉపాసన సంప్రదాయ నిపుణులు నియమించిన భరతునిలాంటి అర్చకులు కొందరు సంసార సాగరాన్ని తరిస్తుంటారు.

వ్యాఖ్య :- సంసారసాగరతరణోపాయం పాదుకోపాసన.

సాత్వతం :- సంతః అస్యసంతీతి=సత్వాన్. సత్పురుషులు కలవాడు 'సత్వాన్' అంటే భగవంతుడు. సత్వతః ఇమే=సాత్వతాః. సత్వంతునికి సంబంధించినవారు. 'సాత్వతులు' అంటే భాగవతులు. సత్వతః ఇదం=సాత్వతం. అంటే భగవచ్ఛాస్త్రం. దీనికే 'శ్రీపాంచరాత్రాగమం' అని నామాంతరం.

"కమప్యాద్యం గురుం వందే కమలా గృహమేధినమ్।

ప్రవక్తా ఛందసాం వక్తాపాంచరాత్రస్యయః స్వయమ్॥" అనే శ్లోకానికి

"స్వయంగా వేదాలనూ, పాంచరాత్రశాస్త్రాన్నీ ప్రవచించిన ప్రథమాచార్యుడైన లక్ష్మీనాథునికి ప్రణామ" మని తాత్పర్యం. కాబట్టి, శ్రీపాంచరాత్రాగమ ప్రవక్త శ్రీమన్నారాయణుడు.

"సమయాః శపథాచార కాలసిద్ధాన్త సంవిదః" (అమరకోశం)

"సంకేతే సమయః ప్రోక్తో నియమేఽవసరేఽపిచ" (శేషనిఘంటువు)

'సమయ' శబ్దానికి శపథమనీ, ఆచారమనీ, ఇంక అనేకార్థాలున్నాయి. 'సంప్రదాయం' అంటే గురుపరంపరాగతమైన, రహస్యంతో కూడిన ఉపదేశం. (సమ్యక్ సరహస్యం ప్రదీయతే) "అథామ్నాయః సంప్రదాయః"(అమరం) శ్రీరంగాది దివ్యక్షేత్రాల్లో శ్రీపాంచరాత్ర పద్ధతిని అనుసరించి, ఆ సంప్రదాయ నిపుణులు భగవదారాధన చేసే కట్టడిని ఏర్పరచారు.

స్వభోగ్యతా బుద్ధిలేశమైనా లేకుండా భగవత్పాదుకలకు సకలోపచారాలుచేస్తూ, భరతుడు అమితభక్తితో ఆరాధించాడు.

"విష్ణుందేవీర్విభూషాయుధగణ మురగం పాదుకే వైనతేయమ్" అని శ్రీ వైష్ణవారాధనక్రమం. భరతుని వలె, ఆ శాస్త్రజ్ఞులైన అర్చకులు దివ్యపాదుకలను ఆరాధిస్తారు. తత్ఫలితంగా మోక్షఫలాన్ని పొందుతారు.

భగవచ్ఛాస్త్ర ప్రకారం, దివ్యపాదుకలను పూజించే వారికి పుడమి యందు పుట్టుక ఉండదు. ముక్తైశ్వర్యం లభిస్తుంది.

'తరణ' క్రియను ఉపయోగించడానికి సంసారాన్ని సముద్రంగా వర్ణించడం వల్ల, ఇది పరిణామాలంకారం. వృత్తం ఔపచ్ఛందసికం.

*977. అల మచ్యుత పాదుకే!యథావత్*
*భవతీ యచ్చపదం త్వదేకధార్యమ్ ।*
*ఇతరేతర భూషితం తదేతత్*
*ద్వితయం సంవననాయ చేతసో నః॥-7*

**అర్థం:-** హే అచ్యుతపాదుకే=ఆశ్రితులను జారవిడువని భగవంతుని ఓపాదుకా! భవతీ=నీవు; త్వత్+ఏకధార్యం=నీచేతనే ధరింపదగిన; పదం=పాదం; యత్=ఏదో; తత్=అది (పాదం); ఏతత్=ఈ; ద్వితయం, చ=రెండునూ; ఇతర+ఇతరభూషితం = అన్యోన్యంగా అలంకరింప బడుతూ; నః = మా యొక్క; చేతసః = మనస్సులను; యథావత్ = తగినట్లు;

సంవననాయ = వశపరచుకోవడానికి; అలం = సమర్థమైనవే.

**తా॥** ఓ అచ్యుతపాదుకా! నీవూ; నీవు మాత్రమే ధరింపదగిన ఏ పాదంకలదో అది, ఈ రెండూ ఒండొంటితో భూషింపబడుతూ, మా హృదయాలను సముచితంగా వశీకరించుకోవడానికి సమర్థమైనవి.

**వ్యాఖ్య :-** పాదుకలూ, అవి వహించే భగవత్పాదాలూ, ఈ రెండు ఉపాసింపదగినవని కవి హృదయం.

పాదుకలు మాత్రమే భగవత్పాదాలను ధరిస్తాయి. కాబట్టి "మణినావలయం వలయేనమణిః" అన్నట్లు పాదుకలచే పాదాలు, పాదాలచే పాదుకలు అన్యోన్యంగా భూషింపబడుతాయి.

భరతుని వ్రతం కేవలం పాదుకారాధనం కాదు. భగవత్పాదాలను వదలి ఉన్న పాదుకలను మాత్రం, పాదుకలతో కూడిన దివ్యపాదాలను వలె సేవించిన అనుభవం గల తీవ్రవ్రతమే భరతునిది. అందుకే, తన శిరస్సున ధరించిన రాముని పాదుకలను ప్రజలకు ప్రదర్శిస్తూ" ఇవి ఆర్యపాదాలు" (ఆర్యపాదావిమౌ) అన్న అధ్యవసాయం కలవాడు భరతుడు.

గత శ్లోకంలో భరతుని వలె పాదుకార్చన చేసిన వారు భవాంబురాశిని తరిస్తారనీ, అది సాత్వతసేవితాచారం అనడం వల్లనూ 'పాదుకా విశిష్ట భగవత్పాదారాధన' యే అని భావం.

"యా మాలంబ్య సుఖేనేమం దుస్తరం త్రిగుణోదధిమ్।
నిస్తరం త్యచిరేణైవ వ్యక్త ధ్యానపరాయణాః॥" (భగవచ్ఛాస్త్రం.)

'ఉపాసకులు (పాదుకా) దేవిని ఆధారంగా గ్రహించి సత్వరజస్తమోగుణ (సంసార) సముద్రాన్ని సుఖంగా దాటుతున్నారు' అని శ్రియః పతి రూపధ్యాన సందర్భాన తెల్పబడింది.

భగవంతుణ్ని మానవులు సేవించడానికి ఆయన శ్రీపాదయుగ్మమే ముఖద్వార మని 'ఆచార్యహృదయం' (గ్రంథం) వివరించింది. ఎప్పుడు కూడా 'పాదుక' అచేతన మని భావించరాదు.

"స్రగ్వస్త్రా భరణైర్యుక్తం స్వానురూపై రనూపమైః।

చిన్మయైః స్వప్రకాశైశ్చ స్వాన్యోన్య రుచిరంజకైః॥" (పారమేశ్వర సంహిత.)

భగవంతుడు ధరించిన, జ్ఞానమయమైన, స్వయం ప్రకాశమానమైన పూలమాల, పీతాంబరం, ఆభరణాలు మొదలైన వస్తువులన్నీ చేతనకోటిలో చేరినవే కదా! పాదుకాదేవికి లక్ష్మీదేవి యొక్క అవయవ సౌందర్యంతో సమానమైన సౌందర్యం ఉన్నది. దేవేరులందరు లక్ష్మికి అవయవ భూతలే.

**"దేవి! త్వామను నీళయా సహమహీ దేవ్యః సహస్రంతథా**

**యాభిస్త్వంస్తన బాహు దృష్టి భిరివ స్వాభిః ప్రియంశ్లాఘసే" (26)**

అని శ్రీపరాశరభట్టర్ 'శ్రీ గుణరత్నకోశం' లో విశదపరచారుకదా! శ్రీరంగనాథుడు ఉత్సవ సమయంలో ఆసనాభిషేకాలంకారాది మంటపాలకు పాదుకలను ధరించి వెళ్ళుతున్న దివ్యమైన, భవ్యమైన సేవ నాన్యత్ర దర్శనీయం. అన్యోన్యరుచి రంజకంగా ఉండే దివ్యపాదాలు, పాదుకలు సేవించే వారి హృదయాలను ఆకర్షించి వశపరచుకోవడం స్వభావోక్తియే. "వశక్రియా సంవననమ్". "అలంభూషణ పర్యాప్తి శక్తివారణ వాచకమ్". (ఉభయత్ర అమరం). వశీకరణకు హేతువును చెప్పడం వల్ల హేతుమదలంకారం. వృత్తం-ఔపచ్ఛందసికం.

*978. అనన్య సామాన్య తయా మురారే*
*రంగేష్వవాప్తేషు కిరీటముఖ్యైః।*
*పదావని! త్వం నిజమేవ భాగం*
*సర్వాత్మసాధారణతామనైషీః॥-8*

**అర్థం:-** హే పదావని=ఓ పాదుకాదేవీ! మురారేః=మురాసురవైరియైన భగవంతుని యొక్క; అంగేషు=అవయవాలు; కిరీటి ముఖ్యైః= మకుటం మొదలైన ఆభరణాలచేత; అనన్యసామాన్యతయా=ఇతరులకు (వేరే అవయవాలకు) సామాన్యంకాని విధంగా; అవాప్తేషు=పొందిఉండగా; త్వం, ఏవ=నీవే; నిజం. భాగం=స్వీయభాగాన్ని (పాదాలను); సర్వ+ఆత్మ; సాధారణతాం=సకల జీవుల చేత సమానంగా ధరించే ధర్మాన్ని; అనైషీః=పొందించితివి. కలిగించావు.

**తా॥** ఓ పాదుకాదేవీ! భగవంతుని అంగాలయందు కిరీటాద్యలం కారాలు, వేరొక అంగమందునూ, వేరెవ్వరునూ ధరించరాని రీతిగా ఉంటాయి. నీవేమో నీకు అనురూపమైన భాగాన్ని జనులందరు ధరించే రీతిని కల్పించావు.

వ్యాఖ్య :-తానుపొందిన స్థానాన్ని అందరు పొందే రీతిగా చేసిన ఔదార్యవతి పాదుకాదేవి.

కిరీట కేయూరా ద్యాభరణాలు శరీరావయవాలకు అలంకారాలు. ఒక్కొక్క అవయవాన్ని ఒక్కొక్క ఆభరణం శోభింపజేస్తుంది. కిరీటం శోభించేది శిరస్సునందే. చేతులందు శంఖచక్రాలు ఆభరణాలుగా ఉంటాయి. పాదాలకు పాదుకలే అలంకారం. ఆయాఅవయవ భూషణాలస్థాన మందు వేరే అవయవభూషణాలకు అవకాశం ఉండకపోవడమనేది పాదుకలకూ, కిరీటాదులకూ సమానమే.

ఇతర అవయవాలు కిరీటాదులచే ఆశ్రయింప తగినవి కానట్లే భగవంతుని కిరీటాదులు జీవులచే ఆశ్రయింపదగినవి కావు కదా! పాదుకాదేవి మాత్రం తానుఆశ్రయించిన భగవత్పాదాలను సకల జనులు ఆశ్రయించి, శిరోభూషణంగా ధరించే సామాన్యన్యాయాన్ని కల్పించింది.

"పాతకంగల్ తీర్కుం పరమనడి కాట్టుం" అన్నట్లు , పాపాలనన్నిటిని పారదోలి పరిశుద్ధులను చేసే పరమాత్మని పాదాలను తాను ఆశ్రయించి, జీవాత్మలను ఆశ్రయింపజేయడం ఆచార్యపూర్తి లక్షణం. "అనైషీః' 'ణీఞ్-ప్రాపణే' అనే ధాతువు, లుఙ్ మధ్యమపురుషైక వచనం. చేతనునికి అదువరకున్న స్థితి కంటె విలక్షణమైన స్థితిని కలిగించే లక్షణం నేతృత్వం. కాబట్టి పాదుకాదేవి 'నేత్రి' నాయకురాలు. పొందదగిన కామ్యాన్ని అదువరకే పొంది ఉండడం 'పూర్తి'. ఇది తనకోసమే ప్రయత్నించడం కాక చేతన సంరక్షణ కోసమైన స్వకార్యప్రవృత్తి. ఈ

'పూర్తిలక్షణం కలది కాబట్టి పాదుక ఆచార్యాణీ. "తుంజుం పోదువిడాదు తొడర్ కండాయ్". భగవంతుని పాదాలు శరీరానికి దూరంగా ఉన్నా, మనస్సుతో దగ్గరచేరి వాటిని విడువకుండా జీవితం గడపాలనీ, అవి "తిన్‌కళల్" దృఢమైన పాదాలు'. చేతను లొక్కసారి వాటిని ఆశ్రయిస్తే, వారిని అవి విడువ (నీయ) వన్నారు. నమ్మాళ్వార్లు.

శ్రీపరాశరభట్టర్ వారు 'నేతృత్వం' (అష్టశ్లోకి) శ్లోకంలోని 'తనుఖ్యాపనం' అనే పదంతో ద్వయమంత్రంలోని మొదటి "శ్రీమన్నారాయణ చరణౌ" పదాన్ని తెల్పినారు. స్వామి యొక్క దివ్యమంగళ విగ్రహాన్ని ప్రకాశపరచేది అనే అర్థంకల శబ్దం 'తనుఖ్యాపనం'

ఆకలిగొన్న శిశువుకు తల్లి శరీరమందు పొందదగిన స్థానం స్తనయుగ్మమేకదా! శివువుకు స్తన్యమే పోషకం, ధారకం. అలాగే సంసారతప్తుడైన జీవునికి భగవద్దివ్యమంగళ విగ్రహంలోని ప్రాప్యభాగం పాదయుగ్మమే. పాదాలను పట్టుకోగానే భగవద్దయప్రసరించి జీవుని పాపరాశిని మ్రింగుతుంది. పరిశుద్ధుడవుతాడు. దయాదేవికి పాపాలే ఆహారంకదా! పూర్ణాహారమే జీవనహేతువు.

"మయితిష్ఠతి దుష్కృతాం ప్రధానే మితదోషానితరాన్విచిన్వతీ త్వం।

అపరాధగణైరపూర్ణకుక్షిః కమలాకాన్తదయే!కథం భవిత్రీ॥-29

ఓ దయాదేవీ! నీకు రుచించే ఆహారాలలాగా పెద్దపెద్ద; అనేక పాపాలను చాలాసార్లు చేసిన నేను ఉండగా, కొద్దిపాపాలను చేసినవారినే వెదకుతు పోతున్నావు. వారి స్వల్పపాపాలతో నీ కడుపు నిండక నీవెలా జీవిస్తావు? నన్ను రక్షించకపోతే, పూర్ణాహారంలభించక నీవే దయనీయ దశను పొందుతావు" అని దేశికులు దయాదేవితో మాటాడుతున్నట్లే చమత్కారంగా ఆమె మహిమను "దయాశతకం"లో ప్రకటించారు.

రహస్యత్రయం, అంటే మంత్రత్రయం తత్త్వ, హిత, పురుషార్థ నిరూపక ప్రమాణం అన్నారు సంప్రదాయజ్ఞులు. అష్టాక్షరీ మంత్రాన్ని వివరించే ద్వయమంత్రం, ఆచార్యరుచి పరిగృహీతమనీ, అనుష్ఠాన ప్రకాశకమనీ సూచితం. ఆచార్యులు తననాశ్రయించిన శిష్యుని హితంకోరి, ఉద్ధరింపదలచే ఆసక్తితోమంత్రోప దేశం చేయడం, మంత్రానుష్ఠాన విధానాన్ని ప్రకాశపరచడం విధిగానూ సూచింపబడినదని భావం.

"ఏకయైవ గురోర్దృష్ట్యా ద్వాభ్యాంవాఽపి లభేతయత్।
న తత్త్రిసృభి రష్టాభిస్సహస్రేణాపి కస్యచిత్॥" (సుభాషితనీవి)

ఆచార్యుల కటాక్షం (ఒక్కదాని) చేతగానీ, బాహ్యాంతర దృష్టుల (రెంటి) చేతగానీ కలిగే శ్రేయస్సు, మూడుకన్నుల (శివుని)చే గానీ, ఎనిమిదికన్నుల (బ్రహ్మ)చే గానీ, వేయికన్నుల (ఇంద్రుని)చే గానీ కలుగదని దేశికులు విశదీకరించారుకదా!

వ్యంగ్య విలసితమైన ఈ శ్లోకం కిరీటాదులకన్న పాదుకకున్న అతిశయం సర్వప్రశంసనీయమని ప్రబోధిస్తున్నది.

ఆశయమహత్త్వం వల్ల, ఇది ఉదాత్తాలంకారం. ఉపజాతి వృత్తం.

*979. సమాశ్రితానాం మణిపాదుకే! త్వాం*
*విపశ్చితాం విష్ణుపదేఽప్యనాస్థా।*
*కథం పునస్తే కృతినో భజేరన్*
*వాసాదరం వాసవరాజధాన్యామ్ ॥-9.*

**అర్థం:-** హే మణిపాదుకే=ఓ రత్నపాదుకా! త్వాం=నిన్ను; సమాశ్రితానాం=ఆశ్రయించిన; విపశ్చితాం=సర్వజ్ఞులకు; విష్ణుపదే, అపి=భగవత్పాదమందును, వైకుంఠమందు కూడా; అనాస్థా=పట్టింపులేదు. తే=ఆ; కృతినః=ధన్యాత్ములు; వాసవరాజధాన్యాం=అమరావతియనే ఇంద్రుని నగరమందు; వాస+ఆదరం=నివసించే కోరికను; కథం, పునః=మరి ఎలా; భజేరన్=పొందుతారు?

**తా॥** ఓ మణిపాదుకా! నిన్ను ఆశ్రయించిన వేదాంతశాస్త్రజ్ఞులకు (భగవంతుని పాదాలయందు) పరమ పదమందు కూడా పట్టింపు ఉండదు. ఇక ఆ సుకృతాత్ములు స్వర్గలోకవాసాన్ని ఎలా కోరుతారు?

**వ్యాఖ్య :-** సర్వజ్ఞులకు భగవత్పాదుకోపాసనయే పరమపురుషార్థం. పాదుకాభజన చేసేవారికి పరమపద వాసమైనా ఇష్టముండదు.

"నిరంతరం నిర్విశతస్త్వదీయ మస్పృష్టచింతా పద మాభిరూప్యమ్।
సత్యంశపే వారణశైల నాథ! వైకుంఠవాసేఽపినమేఽభిలాషః॥"

"ఓ హస్తిగిరినాథా!వరదరాజా! నేను సత్యంగా చెబుతున్నాను. ఊహింపవనలవికాని నీ రూపసౌందర్యాన్ని అనవరతం అనుభవిస్తున్న నాకు వైకుంఠ వాసమందు కూడా అభిలాషలేదు" అని "వరదరాజ పంచాశత్" స్తోత్రం (49శ్లో) లో దేశికులు చెప్పినారుకదా!

విపశ్చితులు -విద్వాంసులు-ప్రాప్యమైన పాదుకాభజనమే భోగ్యతమం అంటారు. విశేషేణ పశ్యన్ చేతతి ఇతి=విపశ్చిత్. విశేషంగా చూస్తూ తెలుసుకొనే వాడు. లేదా, వివిధం పశ్యంతీచిత్ యస్యసః=విపశ్చిత్. అసంకుచితమైన, సర్వవిషయాలను చూచే జ్ఞానం కలవాడు. కాబట్టి, సర్వజ్ఞులైన మహాత్ములకు అల్పమైన, అస్థిరమైన ఫలం కల్గిన అమరావతీ నగర (స్వర్గ) వాసమందు అపేక్ష ఉండదు.

"వాసుదేవే మనోయస్య జపహోమార్చనాదిషు।
తస్యాం తరాయో మైత్రేయ! దేవేంద్రత్వాదికం ఫలమ్॥" (2-6-43)

'జపహోమార్చనాదులను ఆచరిస్తున్నప్పుడు వాసుదేవునియందే చిత్తమున్నవాడు ఇంద్రాదుల పదవిని కూడా ప్రాప్యవిరోధిగ భావిస్తాడు. అని 'విష్ణుపురాణం'లో పులస్త్యుని, ఇంక వసిష్ఠుని వరప్రసాదం వల్ల లభించిన పరదేవతా పారమార్థ్య జ్ఞానం కలిగిన శ్రీ పరాశర బ్రహ్మర్షి తెలిపాడు. పండితుడు ముక్తి ప్రతిబంధకమైన ఫలాన్ని

కోరడు. కైముత్యన్యాయం వర్ణితం. కావ్యార్థా పత్త్యలంకారం.

ఉపజాతి వృత్తం.

*980. విమృశ్య రంగేశ్వర పాదరక్షే!*
*వారక్రమం నూన మవారణీయమ్।*
*పద్మాగ్రహేఽపి స్పృశతీప్రతీతా*
*స్థూలేన రూపేణ వసుంధరా త్వామ్॥-10.*

**అర్థం:-** హే రంగేశ్వరపాదరక్షే=ఓ రంగరాజపాదుకా! వసుంధరా=భూదేవి; అవారణీయం=అతిక్రమింపరాని; వారక్రమం=దినపద్ధతిని; విమృశ్య=ఆలోచించి; పద్మాగ్రహే, అపి=లక్ష్మీదేవి (తనవంతునాడు) పట్టుకొన్నప్పుడు కూడా; స్థూలేన, రూపేణ=పృథువైన ఆకారంతో; త్వాం=నిన్ను; స్పృశతీ=స్పృశిస్తూ; ప్రతీతా=ప్రసిద్ధమైనది (హర్షిస్తుంది). నూనం=నిశ్చయం.

**తా॥** ఓ రంగేశ్వరపాదుకా! వంతుదిన నియమం అనుల్లంఘనీయమని తలచి, లక్ష్మీదేవి. నీళాదేవి పట్టుకొని సమర్పించే నాడు కూడా, భూదేవి పృథ్వీ రూపంతో నిన్ను స్పృశిస్తూ సంతోషిస్తున్నట్లు ఉంది.

వ్యాఖ్య :- పాదుకలకు భూస్పర్శ సర్వదా ఉండే హేతువు ఉత్ప్రేక్షితం.

భూదేవికి నిత్యం పాదుకా స్పర్శ ఉండాలనే ఆశఉంది. లక్ష్మీ భూనీళామహిషీ మణులలో ఒక్కొక్కదేవి, ఒక్కొక్కనాడు పాదుకలను భగవత్పాదాలకు సమర్పించే నియమం ఉంది. ఈ నియమం-వారక్రమం-మీరరానిదికదా! అయితే, భూదేవి, తన ఆశ ఎలా నెరవేరాలో బాగా ఆలోచించింది.

లక్ష్మీదేవి, నీళాదేవి రూపాల్లాగా భూమి, దేవీరూఫంతోనే ఉంటే తనకు పాదుకా స్పర్శ ఏదో ఒక నాడే వంతు రీతిగా సంభవిస్తుంది. కాబట్టి, ఎవరివంతునాడైనా సరే తనకు పాదుకా స్పర్శలేకుండా ఉండకూడదనుకొని, భూమి పృథ్వీరూపాన్ని దాల్చిందట.

"ఖ్యాతే హృష్టేప్రతీతః" (అమరం)
పృథివికి నిత్యం పాదుకాభోగం ప్రసిద్ధం.

వసుంధర స్థూలరూపంతో ఉండడానికి, తన విమర్శయే హేతువు. హేతూత్ప్రేక్ష. ఉపజాతివృత్తం.

*981. అభిరక్షసి త్వమనపాయనిధిం*
*మణిపాదుకే! మధుభిదశ్శరణమ్।*
*అతఏవ దేవి! తదనన్యధనాః*
*శిరసావహంతి భవతీం కృతినః॥-11*

**అర్థం:-** హేదేవి! మణిపాదుకే=ఓ మణిపాదుకాదేవీ!త్వం=నీవు; మధుభిదః=మధుసూదనుని యొక్క; చరణం=పాదం అనే; అనపాయనిధిం=తరుగని ధనరాశిని; అభిరక్షసి=కాపాడుతున్నావు. అతః, ఏవ=ఇందువల్లనే; తత్+అనన్యధనాః= ఆపాదం కంటె వేరే ధనం లేనట్టి; కృతినః=భాగ్యవంతులు; భవతీం=నిన్ను; శిరసా=తలచే; వహింతి=మోస్తున్నారు.

**తా॥** ఓ మణిపాదుకాదేవీ! నీవు భగవచ్చరణమనే అక్షయనిధిని బాగా రక్షించడం వల్లనే, ఆ, చరణైకధనులైన సుకృతాత్ములు నిన్ను శిరసావహిస్తారు..

వ్యాఖ్య:- భగవత్పాద రక్షకత్వాన్ని బట్టి పాదుకను శిరసావహిస్తారని వర్ణితం.

విష్ణ్వాలయాల్లో భగవత్పాదుకలను-శఠారిని-అర్చకులూ, భక్తులూ తలమీద ధరిస్తారు.

'అచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ'- 'ధనంమదీయం తవపాదపంకజం'- అన్నట్లు అక్షయనిధిగా ఉన్న భగవత్పాదయుగళాన్ని శిరసావహించాలి, కానీ పాదుక(ల)ను ఎందుకు శిరసావహించాలి? అంటే, నిధిని రక్షించే వ్యక్తిని గౌరవించక ఉపేక్షిస్తే, ధనం తరిగిపోయే అపాయం సంభవమే. లోకంలో ధన రక్షకునికి దండం పెట్టడం ధనలోభాయత్తమే. అలాగే, భగవచ్చరణనళిన యుగళిని నిధిగా భావించేవారు. ఆ నిధిని రక్షించే పాదుక(ల)ను నెత్తికెక్కించుకొని స్తోత్రం చేయడం లోకజ్ఞత.

పరబ్రహ్మ సాధర్మ్యం పొందినా, పరబ్రహ్మకు శేషభూతులవడం తొలగిపోనట్లే, పాదుకాభోగసామ్యం లభించినప్పుడు కూడా పాదుక(ల)కు వారి శేషత్వం తరుగదు, తొలగిపోదు.

నిధిని రక్షించే హేతువుచేత పాదుకలను శిరసావహించే సమర్థన వల్ల వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారం ప్రమితాక్షరవృత్తం.

*982. పదయుగమివ పాదుకే! మురారే*
*ర్భవతి విభూతి రకంటకా త్వయైవ।*
*కథమివ హృదయాని భావుకానాం*
*త్వదను భవాదుపజాత కంటకాని॥-12*

**అర్థం:-** హే పాదుకే=ఓ పాదుకాదేవీ! త్వయా+ఏవ=నీచేతనే; మురారేః=భగవంతుని యొక్క; పదయుగం, ఇవ=పాద ద్వంద్వంలాగా; విభూతిః=(లీలా విభూతి) భూమండలం; అకంటకా=ముండ్లు లేనిదిగా/శత్రురహితంగా; భవతి=ఉంటున్నది. భావుకానాం=సత్పురుషుల యొక్క; హృదయాని=హృదయాలు; త్వత్+అనుభవాత్=నీ ధ్యానాదుల చేత; కథం, ఇవ=ఎలాగో; ఉపజాత, కంటకాని=కంటకాలు (పులకాంకురాలు) కలవి అవుతున్నాయి.

**తా॥** ఓ పాదుకాదేవీ! భగవత్పాదయుగళంలాగా భూమండలమూ నీ చేత కంటకరహితంగా ఉంటున్నప్పుడు నిన్ను ధ్యానించే భావుకుల హృదయాలు ఎలా కంటకాలు కలవవుతున్నాయి?

వ్యాఖ్య :- పాదుకా ధ్యాన ధారణాదుల వల్ల కలిగిన ఆనందం చమత్కారంగా వర్ణితం.

కంటకాలను లేకుండాచేసే పాదుకాస్పర్శవల్ల కంటకాలు కలుగడం విరోధం. 'కంటకం' అంటే ముల్లు, పగవాడు, సంతోషం వల్ల కలిగే గగుర్పాటు. "సూచ్యగ్రేక్షుద్ర శత్రౌచరోమహర్షేచ కంటకః" (అమరం) పాదుకలను ధరించడం వల్ల దారిలో ముండ్లనుంచి పాదాలకు బాధ ఉండదు. అలాగే భగవత్పాదుకాధ్యాన ధారణాదుల వల్ల క్షుద్రశత్రువుల నుంచి లోకానికి బాధ ఉండదు. పాదుకల వల్ల ముండ్లరీతిగా పగవారి ముఖభంగమూ అవుతుంది. పాదుక(ల)ను శిరసావహించడం వల్ల భక్తులకు ఆనందం అధికమై కంటకాలు కలుగుతాయి; అంటే పులకలు అంకురిస్తాయి.

శ్లిష్టమైన 'కంటక' శబ్దంవల్ల' విరోధాభాసాలంకారం. పుష్పితాగ్రావృత్తం.

*983. జ్ఞానక్రియా భజన సీమ విదూరవృత్తే*
*ర్వైదేశికస్య తదవాప్తికృతాం గుణానామ్।*
*మౌళౌ మమాసి మధుసూదన పాదుకే! త్వం*
*గంగేవ హంత! పతితా విధినైవ పంగోః ॥-13.*

**అర్థం** :- హేమధుసూదన పాదుకే=ఓ మధుసూదనునిపాదుకా! త్వం=నీవు; జ్ఞాన,క్రియా, భజన సీమ విదూరవృత్తేః=జ్ఞానయోగ, కర్మయోగ, భక్తి యోగాల ఎల్లలకు చాల దూరమందున్నట్టి; తత్+అవాప్తికృతాం=ఆ యోగాలను పొందింపజేసే; గుణానాం=గుణాలకు; వైదేశికస్య=బయటి దేశమందున్న; మమ=నాయొక్క; మౌళౌ=శిరస్సునందు; పంగోః=కుంటివాని యొక్క; మౌళౌ=శిరస్సునందు; విధినా, ఏవ=దైవ వశంచేతనే; పతితా=పడిన; గంగా, ఇవ=గంగానది వలె; అసి=ఉన్నావు. హంత=ఆశ్చర్యం.

**తా॥** ఓ మధుసూదన పాదుకా! మోక్షసాధన కోసం ఏర్పడిన జ్ఞాన, కర్మ, భక్తియోగాలను అనుష్ఠించినవాడను కాను, ఆ యోగత్రయ ప్రాప్తికి కారణాలైన శమదమాదులనే ఆత్మగుణాలూనాయందు లేవు. అయినా దైవవశాన, పంగువు మీద గంగపడినట్లు, నాతలమీద నీవు చేరి ప్రకాశిస్తున్నావు. ఆశ్చర్యమే.

వ్యాఖ్య :- సత్కర్మలూ, సద్గుణాలూ లేని వ్యక్తి తల మీద పాదుకప్రకాశించడం విధి బలీయం.

మహాపురుషులు శమదమాది గుణాల మహిమవల్ల కర్మ, జ్ఞాన, భక్తి యోగాలను అనుష్ఠించి, మోక్షఫలాన్ని పొందడం ఆశ్చర్యం కాదు. కానీ, యోగమూ గుణమూ లేని అకించనునికి కూడా మహాపురుషులకు లభించే ఫలం లభించడం ఆశ్చర్యమే. నడచిపోలేని కుంటివాని తల మీదికి దైవ బలం వల్ల గంగ వచ్చిపడినట్లే," నోత్తనోన్బిలేన్" అన్నట్లు గుణ, యోగరహితుని శిరస్సున పాదుకాప్రవేశం ఆశ్చర్యమే.

ఇది కేవలం పాదుకాదేవ్యనుగ్రహ ఫలితమని కవికేసరి కీర్తించారు. ఉపమాలంకారం. వసంత తిలకావృత్తం.

*984. రంగేశ్వరస్యయదిదం మణిపాదరక్షే!*
*పాదారవింద యుగళం భవతీసమేతమ్।*

పుంసా ముపోషిత విలోచన పారణార్థం
క్షీరం తదేతదిహ శర్కరయాసమేతమ్॥-14.

**అర్థం:-** హే మణిపాదరక్షే=ఓ రత్నపాదుకా! భవతీ సమేతం=నీతో కూడిన; రంగేశ్వరస్య=శ్రీరంగరాజు యొక్క; ఇదం=ఈ (కనబడుతున్న) పాద+అరవింద యుగళం=పాదపద్మద్వయం; యత్=ఏదో; తత్=ఆ ప్రసిద్ధమైన, ఏతత్=ఇది; ఇహ=ఒక్కడ; (శ్రీరంగమందు); పుంసాం=మహాపురుషులకు; ఉపోషిత విలోచన పారణ+అర్థం= ఉపవాసమున్న కన్నులచే పారణచేయడానికి తగిన; శర్కరయా=చక్కెరతో; సమేతం=కూడుకొన్న; క్షీరం=పాలు.

**తా॥** ఓ మణిపాదుకా! నీతో కూడిన శ్రీరంగరాజు పాదకమల యుగళం ఏదైతే కలదో, ఆ ప్రసిద్ధమైన భగవదంఘ్రిజలజ ద్వయం ఈ శ్రీరంగక్షేత్రమందు మానవులకు ఉపవాసమున్న నయనాలచే పారణచేయదగిన, శర్కరతో కూడిన పాలలాగా రుచిస్తుంది.

వ్యాఖ్య :- పాదుకాసమేత భగవత్పాద సౌందర్యం సజ్జనుల మనోనయనాలను ఆకర్షించే వర్ణన.

వేరే ప్రయత్నాల వల్ల పొందలేని సత్ఫలితాన్ని పొందడానికి నిరశన వ్రతాన్ని-ఉపవాసవ్రతాన్ని-ఆచరించడం లోకపరిపాటి. ఉపవాసవ్రతం చేసిన వ్యక్తి వ్రతాంతంలో ఘనపదార్థాన్ని ఆహారంగా తీసుకోవడం అనారోగ్యహేతువు. కాబట్టి, పుష్టికరమైనద్రవ పదార్థాన్ని స్వీకరించడం శ్రేయస్కరం.

'పారణం' అంటే వ్రతంపూర్తియైన తర్వాత ఆహారాన్ని భుజించడం. ఇతర విషయాలను చూడక ఉండడం కన్నుల ఉపవాసవ్రతం. సపాదుకాపాదసేవనం లోచనపారణం. భగవత్పాదసౌందర్యంగానీ, పాదుకాసౌందర్యంగానీ, దేనికదే, ఒక్కొక్కటి భోగ్యంగా ఉంటుంది. ఈ రెండు, ఒండొంటితో కూడినందువల్ల మిక్కిలి భోగ్యంగా ఉండడం నైసర్గికం.

ప్రసిద్ధమైన పాలు, శర్కర దేనికదే నాలుకకు రుచికరం కదా! శర్కర కలిసిన పాలను నోటితోకాక, కన్నులతో ఆస్వాదించడం కవితాశైలి. చక్కెర కలిసిన పాలు ఎలా రుచికరమో, అలాగే పాదుకలతో కూడిన భగవత్పాదద్వయం మహాపురుషులకు పరమానందకరం.

బింబప్రతిబింబ భావంగా రెండు సాదృశ్యవాక్యాలకు ఐక్యారోపణ వల్ల ఇది నిదర్శనాలంకారం.

వసంతతిలకావృత్తం.

985. కామాదిదోషరహితం త్వదనన్యకామాః
కర్మత్రయోదశవిధం పరిశీలయంతః।
పాదావని! త్వదనుషంగ విశేషదృశ్య
మేకాంతినః పరిచరంతి పదం మురారేః॥-15.

**అర్థం:-** హేపాదావని=ఓ పాదుకాదేవీ! త్వత్+అనన్యకామాః=నీ కంటె వేరే ఫలాన్ని కోరలేని; ఏకాంతినః=భాగవతోత్తములు;

త్రయోదశవిధం=పదమూడు విధాలైన; కర్మ=కర్మను; కామ+ఆది, దోషరహితం=ఫలమందు ఆశమొదలైన దోషాలు లేకుండా; పరిశీలయంతః=అనుష్ఠిస్తూ; త్వత్+అనుషంగ, విశేషదృశ్యం=నీ చేరిక చేత బాగా చూడదగిన; మురారేః=భగవంతుని యొక్క; పదం=పాదాన్ని; పరిచరంతి=పూజిస్తారు.

**తా॥** ఓ పాదుకాదేవీ! నిన్ను తప్పవేరే ఫలాన్ని కోరలేని ఏకాంతులు ఫలాశ, సంగ, కర్తృత్వదోషాలు స్పృశించని విధంగా పదమూడు విధాలుగా ఉన్న కర్మను ఆచరిస్తూ, నీ అనుబంధంచేత మిక్కిలి అందాన్ని పొందిన భగవత్పాదయుగళాన్ని పూజిస్తారు.

వ్యాఖ్య :- ఏకాంతులు పాదుకా పరిచర్యచేసే వర్ణన.

ఇతర విషయాల మీద వాంఛలేకుండా, పాదుకావిశిష్టభగవత్పాద సేవయే ఫలమని భావించేవారు ఏకాంతులు. వీరు ఫల, సంగ; కర్తృత్వదోష రహితంగా కర్మను అనుష్ఠిస్తారు. సర్వోత్తమగుణ పూర్తికలిగిన ఏకాంతులు చేసే భగవదారాధనను చూచి ఆనందించడమే (ఒక) ఫలం.

"త్రయోదశ విధంకర్మ కామాది పరివర్జితమ్।

గుణైఃసాంయమికైర్యుక్త మనుతిష్ఠంతి సాధవః॥"

'కామాది దోషరహితమైన చిత్తశుద్ధిగల గుణాలతో కూడిన పదమూడు రకాలైన కర్మను ఆచరించే వారు సాధువులు' అని ఆచార్యులు "శ్రీపాంచరాత్రరక్ష"లో అనుగ్రహించారు.

"వాఙ్మనః కాయజత్వేన తపశ్చ త్రివిధం మతమ్।

దేవ ద్విజ గురుప్రాజ్ఞ పూజనంశౌచ మార్జవమ్॥

అహింసా బ్రహ్మచర్యంచతపఃశారీర మీరితమ్।

అనుగ్రహపరం వాక్యం సత్యం భూతోపకారకమ్॥

స్వాధ్యాయాభ్యసనం చేతి వాచికం కథితం తపః।

సంతోషస్సతతంబ్రహ్మచింతాచాత్మ వినిగ్రహః॥

భావశుద్ధిః సౌమ్యతాచ తపో మానస మీరితమ్।

శ్రద్ధధానైః కృతం సమ్యగఫలాకాంక్షిభిర్నరైః॥

సాత్త్వికం తత్తపోజ్ఞేయం యద్ధి విజ్ఞాన కారకమ్।

సత్కారమాన పూజాదిసిద్ధ్యర్థం రాజసం స్మృతమ్॥

తామసంతు తపస్తత్స్యాద్యత్పరోత్సాదనాదికమ్।

కర్మతద్ద్వివిధం నైవ విజ్ఞానోత్పత్తి కారణమ్॥"

"పాద్మం, జ్ఞానపాదం" అష్టమాధ్యాయమందు చెప్పబడిన విషయం ఇది.

1. కాయిక కర్మ :- (5) ఐదు విధాలు : 1. దేవ, బ్రాహ్మణ, గురు, ప్రాజ్ఞులను పూజించడం. 2. శుచిగా ఉండడం. 3.ఆర్జవం. 4.అహింస, 5. బ్రహ్మచర్యం. ఇవి శరీరంతో చేసే పనులు.

2. వాచిక కర్మ:- (3) మూడు విధాలు: 1. సర్వభూతహితమైన మాట, 2. సత్యభాషణం 3.వేదాధ్యయనం.

3. మానస కర్మ :- (5) ఐదు విధాలు: 1. లభించిన దానితో తృప్తి పడడం. 2.బ్రహ్మమనే పరమార్థచింతన. 3. ఆత్మనిగ్రహం (తననుతాను అణచుకోవడం). 4.చిత్తశుద్ధి. 5.సౌమ్యత (మృదువుగా, శాంతంగా కనబడడం) ఈ కర్మత్రయోదశవిధిని, నిష్కామంతో శ్రద్ధగా చేస్తే 'సాత్త్విక తపస్సు అవుతుంది. కీర్తి, గౌరవం పొందాలని చేస్తే అది 'రాజసం' అవుతుంది. పరులకు కీడు చేస్తే అది 'తామసం' అవుతుంది. 'రాజసం, తామసం' అనే రెండు రకాలైన కర్మవల్ల మోక్షఫలం దొరకదు.

ఏకాంతులయందు గోచరించే భక్తి, పాదుకాభక్తికి అంగమవడం వల్ల ఇది 'ప్రేయో2లంకారం. వసంతతిలకావృత్తం.

*986. మౌళౌస్థితా మఖభుజా మథవాశ్రుతీనాం*
*తద్రంగ రాజచరణావని! వైభవం తే।*
*అస్మాదృశా మపియది ప్రథితం తతఃస్యాత్*
*సౌలభ్యమంబ! తదిదం తవసార్వభౌమమ్॥-16*

**అర్థం:-** హే అంబ! రంగరాజ చరణావని=ఓ తల్లీ! రంగేశపాదుకా! మఖభుజాం=దేవతల యొక్క; అథవా=లేక; శ్రుతీనాం=వేదాల యొక్క; మౌళౌ=శిరస్సునందు; స్థితా=ఉన్నదానవై; తే=నీ యొక్క; తత్=ఆ, వైభవం=(గొప్పతనం) ప్రభావం; అస్మాదృశాం=మాలాంటివారి యొక్క; (మౌళౌ) అపి=శిరస్సున కూడా, ప్రథితం. యది=ప్రసిద్ధమయితే; తతః=అందువల్ల; తత్=మాచేత తెలుసుకోబడిన; ఇదం=ఈ; తవ=నీ యొక్క; సౌలభ్యం=సౌలభ్యగుణం; సార్వభౌమం=ప్రపంచమంత తెలిసినదిగా; స్యాత్=అవుతుంది.

**తా॥** ఓ జననీ! రంగరాజుపాదుకా! నీవు దేవతల శిరస్సుననూ, శ్రుతిశిరస్సుననూ ఉన్నావు. అలాగా ప్రకాశించే నీ వైభవం మాలాంటి వారి శిరస్సున కూడా ప్రసిద్ధమైతే, మేము తెలుసుకొనే నీ సౌలభ్యగుణం యావత్ప్రపంచానికీ తెలుస్తుంది.

వ్యాఖ్య :- పాదుకాసౌలభ్యం ప్రసిద్ధమయ్యే వర్ణన.

శ్రీరంగనగరం సాక్షాత్తుగా వైకుంఠమని తెలిపే సూక్తులు ప్రసిద్ధమైనవే. "కావేరీ విరజాసేయం వైకుంఠం రంగ మందిరమ్। సవాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్॥" (శ్రీరంగమహాత్మ్యం)

ఆర్తత్రాణపరాయణుడైన శ్రీమన్నారాయణుడు దేవేరులతో కలిగే భోగాలయందు మనసుపెట్టక ఆర్తరక్షణమందే ఎల్లప్పుడు అవహితుడుగా, అంటే ఆర్తులమొర వెంటనే తన చెవికి అందడానికి క్షీరసాగరాన శేషశాయియై ఉన్నాడనీ, భక్తుల రక్షణలో వేరొక సహాయమపేక్షింపని ఉపాయపూర్తిగల ఆ పరమ పురుషుని పాదాలను కీర్తించడం శ్రేయస్కరమని కదా శ్రీ గోదాదేవి శ్రీసూక్తి.

"పార్కడలుళ్ పైయత్తుయిన్ఱపరమనడిపాడి" (తిరుప్పావై)

బ్రహ్మాండపురాణంలోని శ్రీరంగక్షేత్రమాహాత్మ్యం "ఆవిర్భూతం మహద్ధామశ్రీరంగం క్షీరసాగరాత్" అని ప్రకటిస్తున్నది.

చతుర్ముఖబ్రహ్మ అనేక సంవత్సరాలు తపస్సుచేయగా క్షీరసాగరం నుంచి శ్రీరంగవిమానం శ్రీరంగనాథుని అర్చామూర్తికూడా ఆవిర్భవించడం వల్ల, బ్రహ్మచేత ఆరాధింపబడినది. శ్రియఃపతి ఆజ్ఞచేత బ్రహ్మఇక్ష్వాకు మహారాజుకు అనుగ్రహించగా, ఆ వంశమందలి ప్రభువులు ఈ విమానాన్నీ, అందుశయనించియున్న శ్రీరంగనాథుణ్ని ఆరాధిస్తూ వచ్చారు.

"సహపత్న్యావిశాలాక్ష్యానారాయణ ముపాగమత్" (రామాయణం)

శ్రీరామచంద్రస్వామి సీతాదేవితో పాటు ఈ విమానంలోని శ్రీరంగనాథుణ్ని ఆరాధించాడని వాల్మీకి శ్రీసూక్తి, శ్రీరామచంద్రుడు ఈ విమానాన్ని విభీషణునికి అనుగ్రహించాడు. వాల్మీకి భగవానుడు 'లబ్ధ్వాకులధనం రాజా" అని సంగ్రహంగా తెలిపాడు. "శ్రీరంగమాహాత్మ్యం"లో "రామేణాక్లిష్టకర్మణా। ఇక్ష్వాకూణాం కులధనమాత్మనోఽభ్యధికం తదా! శ్రీమద్రంగం మహద్ధామ సద్విజం సపరిచ్ఛదమ్। ప్రదత్తం రాక్షసేంద్రాయ ప్రియాయ ప్రియకారిణే॥" అని విస్తారంగా తెలుస్తున్నది. విభీషణుడు లంకకు తీసుకొని పోతుండగా కావేరీనదీ తీరాన మధ్యాహ్న (సమయ)మయింది. ఈ విమానాన్ని అక్కడ నిల్పి, స్నానాదికృత్యాలను నిర్వర్తించుకొని, భగవదారాధన చేశాడు. అక్కడి ప్రభువైన ధర్మవర్మ కోరిక మేరకు ఆనాడు అక్కడ ఉండి, మరునాడు ఈ విమానాన్ని తీసుకొని పోవడానికి ప్రయత్నించాడు. అది కదలలేదు. విభీషణుడు దుఃఖపడుతుండగా శ్రీరంగనాథుడు "తానిక్కడనే ఉండడానికి సంకల్పించి నందువల్ల విమానం కదలలేదు" అని ఆయనను సమాధానపరచి లంకకు పంపినట్లు శ్రీరంగమాహాత్మ్యం వివరిస్తున్నది. "స్వయంవ్యక్తేషుక్షేత్రేషు శ్రీమద్రంగం ప్రశస్యతే" స్వయం వ్యక్త క్షేత్రాలలో శ్రీరంగం గొప్పదని ప్రసిద్ధిపొందింది.

"ప్రపద్యే ప్రణవాకారం భాష్యం రంగమివాపరం।
పరస్యబ్రహ్మణో రూపం శేషిత్వం స్ఫుటమిష్యతే॥" అని

శ్రుతప్రకాశికాచార్యులు శ్రీభాష్యానికి, శ్రీరంగానికీ, ప్రణవానికీ మధ్య గల సామ్యాన్ని వర్ణించారు. శ్రీరంగం ప్రణవాకారం కలదని ప్రశస్తి. ప్రణవంలోనూ, శ్రీభాష్యంలోనూ భగవంతుని శేషిత్వం అర్థం వల్ల స్ఫురిస్తుంటే, శ్రీరంగవిమానంలో ఆదిశేషుని మీద పవళించి యుండడం వల్ల శేషిత్వం స్పష్టంగా ప్రకాశిస్తున్నది.

'పాజ్గోదమ్ శూళ్నద్పువనియుమ్ విణ్ణులగుమ్, అజ్గాదుమ్‌శోరామే ఆళ్గిన్న ఎంబెరుమాన్ తిరువరంగచ్చెల్వనార్ సర్వలోకాలను ఏలాంటి ఉపద్రవం కలుగకుండా పాలించే రాజు శ్రీరంగరాజే; అనిగోదాదేవి శ్రీసూక్తి.

శ్రీమన్నారాయణుడు సృష్ట్యాదిలోనే సకలజనులు ఆరాధించి తరించడానికి నిరుపమానమైన సౌలభ్యాది గుణపూర్తి కలిగిన అర్చారూపాన్ని అనుగ్రహించాడు కదా!

"అర్చావతార విషయే మయాఽప్యుద్దేశతస్తథా।
ఉక్తాగుణానశక్యంతే వక్తుం వర్షశతైరపి॥ అనే ప్రామాణిక

సూక్తివల్ల సౌలభ్యసౌశీల్యాది గుణపూర్తిని అర్చారూపమే కల్గియుంది. కాబట్టి, దివ్యసూరులూ, ఆచార్యులూ, అందరు అర్చామూర్తి విషయంలోనే ప్రపత్తి చేశారు. స్వతస్సిద్ధమైన స్వామిత్వం కలిగియున్న శ్రీరంగనాథుని పాదకమలాలకు అనురూపంగా ఉండి రక్షణ కల్పిస్తూ "స్వామి పాదాలు మనకు లభించునా" అని వెరవకుండా, అందరు వాటిని సులభంగా శిరసావహించే సౌకర్యం కల్పించడమే పాదుకాదేవి సౌలభ్యగుణవైభవం.

"దేవాస్త్రిణవే మరుతఃస్తుతాః" (శ్రుతి.)

"యంబ్రహ్మావరుణేంద్ర రుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవైః" (స్మృతి) అన్నట్లు దేవతలందరు యథాశక్తి భగవంతుని స్తుతించి ఆయన పాదపద్మాలను శిరసావహిస్తారు. శ్రుతులశిరస్సు మీద ప్రకాశించడమంటే వేదాంతశాస్త్రమందు విశేషంగా వర్ణింపబడినదని అర్థం. యజ్ఞయాగాదులలో వేదా ధ్యయనం చేస్తూ, దేవతలనాహ్వానించి, హవిస్సులను వారికి సమర్పించడమూ, భగవదనుగ్రహంగా వారి తలల మీద పాదుక(ల)ను -శఠారిని-సమర్పించడమూ శాస్త్రప్రతిపాదితమైన విషయం. "లోకస్యద్వారమర్చిమత్పవిత్రం" (శ్రుతి) "అడిచ్చియోన్దలమిశై నీయణియాయ్ ఆళియంకణ్ణా ఉన్‌కోలప్పాదమ్". (తి.వా.మొళి. 10.3.6) "ఓ పుండరీకాక్షా! నీ అందమైన పాదాన్ని ఈ దాసుని తల మీద అలంకరింపచేయు" మని నమ్మాళ్వార్లు సర్వేశ్వరుని ప్రార్థించారు.

"యన్మూర్ధ్నిమే శ్రుతిశిరస్సుచభాతి యస్మిన్మనోరథ పథస్సకలస్సమేతి" అని శ్రీయామున మునులు (ఆళవందార్లు) స్తోత్రంచేశారు. ఆచార్యరుచి పరిగృహీతమైన విషయాన్నే, ఉత్తమాధికారులైన దేశికుల వారు, మనం కూడా భగవత్సన్నిధిలో "ఓ రంగరాజ పాదుకాదేవీ! మా శిరస్సున కూడా నీవు ప్రకాశించి నీ సౌలభ్యవైభవాన్ని ప్రపంచానికి ప్రకటించు" మని అనుసంధించే రీతిగా శాస్త్రార్థాన్ని అనుగ్రహించారు. సంభావనాలంకారం. వసన్తతిలకావృత్తం.

*987. స్వప్నేఽపిచేత్త్వ మసిమూర్ధనిసన్నివిష్టా*
*నమ్రస్యమే నరకమర్దన పాదరక్షే।*
*స్థానే తదేతదిహ దేవి! యతః సమాధౌ*
*సంతో విదుస్తమపి తాదృశబుద్ధిగమ్యమ్॥-17.*

**అర్థం:**-హే దేవి! నరకమర్దన పాదరక్షే=ఓ నరకాంతకుని పాదుకాదేవీ! నమ్రస్య=నమస్కరించిన; మే=నాయొక్క; మూర్ధని=శిరస్సునందు; స్వప్నే, అపి=కలలోకూడా, త్వం=నీవు, సన్నివిష్టా, అసి, చేత్=ప్రవేశించితివేని; తత్=అప్రవేశించే;

ఏతత్=ఈస్థితి, ఇహ=ఇక్కడ (నీయందు) స్థానే=యుక్తమే, తగినదే; యతః=ఎందుకంటే; సమాధౌ=ధ్యానయోగస్థితి యందు; సంతః=మనుపరాశరాది సత్పురుషులు; తం,అపి=నీతో కూడియున్న ఆ భగవంతుణ్నికూడా, తాదృశబుద్ధిగమ్యం=అలాంటి (స్వప్నమందు చూచిన) బుద్ధిచేత; యోగ బుద్ధిజ్ఞేయునిగా; విదుః=తెలుసుకొంటారు.

**తా॥** ఓ దేవీ! నరకాంతక పాదుకా! నమస్కరించిన నా తలమీద స్వప్నంలోనూ నీవు చేరితివి.అయితే, అలాగాచేరేస్థితి నీ విషయమై సముచితమే. ఎందుకంటే, సత్పురుషులు యోగనిష్ఠయందు నీ సాహచర్యం గల భగవంతుణ్ని కూడా కలలో చూచి తెలుసుకొన్న వాని గానే భావిస్తారు.

వ్యాఖ్య :- స్వప్నంలోనూ పాదుకాదర్శనం ఫల సిద్ధిసూచకమని వర్ణితం.

జాగ్రదవస్థలో అంటే మేల్కొని ఉన్నప్పుడు శ్రీరంగనాథుణ్ని సేవించే సమయాన మాత్రమేకాక, స్వప్నంలో కూడా భగవత్పాదుక, తన శిరస్సును అలంకరించడం న్యాయమే అంటున్నారు దేశికులు.

భగవంతుని సహచారిణియైన పాదుక, పతివ్రతాస్వభావం కలది కాబట్టి, కలలో కూడా కనబడి అనుగ్రహించడం సముచితమే. ఈ ఫలపద్ధతిలో, స్వప్నంలోనూ బుద్ధిగమ్యమనడం వల్ల, పాదుకాసనాథుడైన శ్రీరంగనాథుని దర్శనమవడం ఫలప్రాప్తికి సూచకం.

కొందరు కల అసత్యమంటారు. కలలో కనబడినదేదో, కలలో మాత్రం అది సత్యమే. మేల్కొన్న తర్వాత అది కనబడదు. శరీరం బుద్బుదంలాగా క్షణభంగురం, అంటే నీటిబుగ్గలాగా కొద్దికాలమే ఉండి కనబడకుండా పోతుంది అని అర్థమే. కాని అసత్యమనే అర్థం కాదుకదా!

శ్రుతిస్మృతీతిహాస పురాణాలు మాత్రం కలలు అసత్యాలుకావని బోధిస్తున్నాయి. ఫల సూచకాలు కానివనీ, అసత్యాలనీ తెల్పడానికి ప్రత్యేకంగా "పగటికలలు" నానుడి ఉందికదా! "తస్యవా ఏతస్య పురుషస్య ద్వేఏవస్థానే భవతః; ఇదంచ పరలోకస్థానంచ; సంధ్యం తృతీయం స్వప్నస్థానం". (బృ.ఉ.4-3-9) జీవునికి రెండేస్థానాలున్నాయి. ఈలోకం, పరలోకం. 'సంధ్యం' అంటే మూడవది 'స్వప్నస్థానం' అని శ్రుతిబోధిస్తున్నది. స్వప్నప్రపంచమందు ఉండి జీవుడు, ఈలోకంలోని పాపాలను, పరలోకంలోని సుఖాలను చూస్తాడు, ఇత్యాదిగా విశదపరుస్తుంది శ్రుతి. స్వప్నసృష్టి ఆశ్చర్యకరమైనది. "సృజతే సహికర్తా" పరమాత్ముడే స్వప్న రూపమైన సృష్టిని కలిగించేవాడు, కాని స్వప్నదర్శియైన జీవుడు మాత్రంకాడనీ శ్రుతినొక్కిచెబుతుంది.

"సంధ్యాధికరణం"లో "దేహయోగాద్వా సోఽపి" (బ్ర.సూ.3-2-5) దేహరూపమైన అచిత్పదార్థ సంబంధం వల్లగానీ, సూక్ష్మరూపమైన అచిత్పదార్థ సంబంధం వల్లగానీ జీవుని స్వాభావికమైన స్వరూపానికి సంకోచం కలగుతుందని శ్రీమద్వ్యాసభగవానుని భాషా వైశారద్యం.

"తస్మిన్‌లోకాశ్రితాస్సర్వే తదునాత్యేతికశ్చన" (కఠ-5-8) ఇతి సర్వేషుసుప్తేషు జాగరణం, సర్వలోకాశ్రయత్వ మిత్యాదయోహి పరమ పురుషస్యైవ సంభవంతి. అతఃజీవానాం అల్పాల్పకర్మామగుణ ఫలాను భవార్థం

తావన్మాత్రకాలావసానాన్ తదేకానుభావ్యానర్థానుత్పాదయతి." (శ్రీభాష్యం).

"కఠోపనిషద్వాక్య ప్రకారంగా, జీవులందరు నిద్రిస్తున్నప్పుడు మేల్కొని యుండడమూ, సర్వలోకాలకు తానే ఆశ్రయమవడమూ పరమపురుషునికి మాత్రమే ఉన్నగుణాలు. కాబట్టి జీవులు చేసిన పుణ్యపాపకర్మలకు తగిన ఫలాన్ని అనుభవింప చేయడానికి సర్వేశ్వరుడు, స్వప్నమున్నంత వరకు మాత్రం ఉండేవీ, స్వప్నగతులైన (కలలుగనే) జీవులు మాత్రమే అనుభవింపదగినవైన పదార్థాలను సృజిస్తాడు" అని భగవద్రామానుజులవారు అనుగ్రహించారు. కాబట్టి కలలోకన్నవి అసత్యాలుకావు.

కలలో చూచిన పదార్థాలను బట్టి ఫలాలనుకూడా సూచిస్తుంది, శాస్త్రం.

"దీపంశంఖం తథాయానం శ్రీవృక్షం పాదుకాంతథా।.......
అక్షమాలామేఖలాద్యైః శుభైఃస్వప్నైర్వినిర్దిశేత్। మంత్రసిద్ధిం బహుముఖీమ్" (సుస్వప్నప్రకరణం)

"రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తు పురుషం పరమ్". (మనుస్మృతి) స్వప్నంలో పాదుక కనబడితే శుభసూచకం. అంతేకాదు; అది మంత్ర సిద్ధిసూచకమని కూడా ప్రశస్తి.

"నరకమర్దన పాదరక్షే" సంబోధన గమనార్హం.

యోగానుష్ఠానంలో మునీశ్వరులు పాదుకాసనాథుడైన శ్రీరంగనాథుణ్ని ఉపాసించడానికి అచంచలదీక్షవహిస్తారు. వారికి ధ్యాన యోగనిష్ఠలో భగవంతుడు, స్వప్నంలో కనబడినట్లే, కనబడుతాడు. ఇలాగా కలిగే భగవత్సాక్షాత్కారాన్ని 'దర్శనసమానాకారజ్ఞానం' అంటారు. కాబట్టి, పాదుకాదర్శనం స్వప్నధీగమ్యం.

బాహ్యేంద్రియాలు పనిచేయకుండా, మనస్సొక్కటే పనిచేయడం స్వప్నానికీ, యోగానికీ సమానధర్మమే కదా!

"స్వప్నేఽపిచేత్" అనేచోట "స్వప్నేఽపియత్" అని పాఠాంతరం ఉండి యుంటుందని శ్రీ.ఉ.వీరరాఘవాచార్య స్వామి వారి టిప్పణి.

శ్రీ వేదాన్తదేశికులు సభలో ప్రతిజ్ఞచేసి, ఇంటికివచ్చి , యోగనిద్రను సంకల్పించి శయనించగా, కలలో పాదుకాదేవి దర్శనమయింది. వెంటనే తానుకైమోడ్చి తలవంచడం, పాదుక తనశిరోభూషణంగా ప్రకాశించడం ఆయన మనస్సుకు మాత్రమే గోచరించిన విషయం. మేల్కొన్న తర్వాత, పాదుకానుగ్రహం వల్ల కలిగిన ఉపాయఫలమిది, అని భావించి "శ్రీరంగనాథపాదుకాసహస్ర" రచనకు పూనుకొన్నారు, అని శ్రీ. ఉ.రాఘవాచార్యస్వామి వారు భావించారు. పాదుకాదర్శన మవడం 'పాదుకాసహస్ర' లాభసూచకమని తెలుస్తుంది.

కావ్యలింగాలంకారం. వసంతతిలకావృత్తం.

*988. బద్ధాంజలిః పరిచరన్నియమేన రంగే*
*విశ్రాణితాచ్యుత నిధిం మణిపాదుకే! త్వామ్।*

కస్యాపి కూణితదృశో ధనినఃపురస్తా
దుత్తానయేయ నకదా஽పి కరం వికోశమ్॥-18.

**అర్థం:-** హేమణిపాదుకే=ఓ రత్నపాదుకా! (అహం=నేను); బద్ధాంజలిః=మోడ్చిన చేతులు కలవాడనై (దోసిలొగ్గి); విశ్రాణిత+అచ్యుతనిధిం= ఈయబడిన భగవానుడే అక్షయ నిధిగా కలిగిన; త్వాం=నిన్ను; రంగే=శ్రీరంగవిమానమందు; నియమేన=అవిచ్ఛిన్నంగా; పరిచరన్=పూజిస్తూ; కస్య, అపి=(అనిర్వచనీయధనం కలిగిన) ఎవడో ఒక; కూణిత దృశః=మూసుకపోయిన కన్నులుకల; ధనినః=ధనికుని యొక్క; పురస్తాత్=ఎదుట(ముందు); వికోశం=చాచబడే; కరం=చేతిని; కదా, అపి=ఎప్పుడుకూడా; న, ఉత్తానయేయ= ఎత్తలేను, చాచను.

**తా॥** ఓ మణిపాదుకా! నేను బద్ధాంజలినై, రంగనాథుడనే తరుగని నిధిని ఇచ్చే నిన్ను శ్రీరంగవిమానమందు నియమంగా పూజిస్తూ, మదంచేత కన్నులు మూసుకపోయిన ఒక ఐశ్వర్యవంతుని ముందు చేయిచాచనేచాచను.

వ్యాఖ్య :- భగవత్పాదుకా పరిచర్యచేసే వ్యక్తికి ధనికులను యాచించే ప్రసక్తి ఉండదని వర్ణితం.

పాదుకాదేవి శ్రీరంగనాథుడనే అక్షయనిధిని ప్రసాదిస్తుంది. కాబట్టి, ఆ దేవిని శ్రీరంగమందు బద్ధాంజలియై అవిచ్ఛిన్నంగా అర్చించడమే ఫలం. అక్షయనిధి లభించినప్పుడు మదాంధుడైన ఒక ధనికుని దగ్గరికిపోయి. వానిముందర చేయిచాచి యాచించడమే ఉండదు.

965వ శ్లోకంలో-ధనికుని ముందు చేయిచాచడం స్వరూప విరుద్ధమనీ, 973వ శ్లోకంలో –నిర్విణ్ణుడైన వ్యక్తికైనా ధనవంతులను యాచించే ప్రవృత్తి ఉండకూడదన్నారు. ఇక్కడ (988) పాదుకానుగ్రహం వల్ల అక్షయనిధి లభించినప్పుడు యాచించే దీనదశయే ఉండదని వర్ణించారు దేశికులు.

శ్రీమద్వేదాన్త దేశికులు గృహస్థులు. కటికదారిద్ర్యమనుభవిస్తున్నా జీవితంలో ధనం సంపాదించడానికి ఇష్టపడలేదు. వీరివైరాగ్యం చాల దృఢమైనది. మఠాధిపతులూ, సన్యాసాశ్రమనిష్ఠులూ ఎంతధనాశాపరులో, నర్మగర్భంగా వీరే 'సంకల్పసూర్యోదయనాటకం'లో వెల్లడించారు.

"భిక్షేతి శిష్యజనరక్షణ దక్షిణేతి
శాటీతి శాశ్వత మఠోపధికల్పనేతి।
గ్రంథోప సంగ్రహణ మూల్యమితిబ్రువాణాః
సన్యాసినో஽పి దధతే మహతీం ధనాయామ్॥"

బ్ర.శ్రీ విద్యారణ్యస్వామివారు సన్మానంకోసం రాజసభకు ఆహ్వానించినప్పుడు కూడా, క్షుద్రబహుమానాన్ని తిరస్కరిస్తూ, 'వైరాగ్య పంచకం' వ్రాసి పంపిన అయాచిత వ్రతదీక్షా దక్షులు వేదాన్తదేశికులు.

"ఓ రంగనాథా! నిన్నాశ్రయించి నీకైంకర్యంచేసే నేను ఇంకెవ్వరినీ ఆశ్రయించ"నని 'న్యాసతిలకం'లోనూ విన్నవించారు.

"దాస్యం లాస్యవతానుమత్య మనసా రంగేశ్వర! త్వత్పదే
నిత్యం కింకరవాణ్యహం, నతుపునః కుర్యాంకదర్యాశ్రయామ్।
మీలచ్చక్షుషి వేల్లితభ్రుణి ముహుః దత్తావమానాక్షరే
భీమే కస్యచిదాఢ్యకస్యవదనే భిక్షావిలక్షాందృశమ్॥

ఒక్క 'పాదుకాసహస్రం' లోనే చేయిచాచడం హేయమని ఎన్నోసార్లు విశదపరచారుకదా!

కావ్యలింగాలంకారం. వసంతతిలకావృత్తం.

***989.*** *త్వయ్యర్పితేన చరణేన సదధ్వభాజః*
*పాదావని! ప్రథితసాత్త్వికభావ దృశ్యాః।*
*రంగేశవత్ విదధతే ముహురంగహారాన్*
*రంగే మహీయసి నటాఇవ భావుకాస్తే॥-19.*

**అర్థం** :- హేపాదావని=ఓ పాదుకాదేవీ! త్వయి=నీయందు; అర్పితేన=ఉంచబడిన; చరణేన=పాదంచేత; సత్+అధ్వభాక్=సనార్గమందు నడిచే; ప్రథిత, సాత్త్విక, భావ, దృశ్యః=ప్రసిద్ధమైన సత్త్వగుణమున్న మనస్సుచేత చూడదగిన; రంగేశవత్=శ్రీరంగనాథునివలె; మహీయసి=మహిమగల, రంగే=శ్రీరంగమందు; తే=నీయొక్క; భావుకాః=సేవారసానుభవాన్ని పొందే కింకరులు ; ----1.

మహీయసి=విశాలమైన; రంగే=రంగస్థలమందు; అర్పితేన=వేయబడిన; చరణేన=పదగతిచేత; సత్+అధ్వభాజః=శాస్త్ర పద్ధతిని ఆశ్రయించిన వారై; ప్రథిత, సాత్త్విక భావ; దృశ్యాః=ప్రసిద్ధమైన సాత్త్వికభావాలను ప్రకటించే అభినయాలచేత కనదగిన; నటాః,ఇవ=నాట్యమాడే నటులవలె;----2.

త్వయి=నీ విషయమై; అర్పితేన=సమర్పించబడిన; చరణేన=అనుష్ఠానం చేత; సత్+అధ్వభాజః= సాధుమర్యాదను పాటించే ; ప్రథిత, సాత్త్విక భావ దృశ్యాః=ప్రసిద్ధమైన (ఆనందబాష్పాలు,పులకాంకురాలు మొదలైన) సాత్త్విక భావాలచే కనబడే; బావుకాఃఇవ=రసికులైన ప్రేక్షకులవలె;----3

ముహుః=ఇటు, అటూ, మాటిమాటికి; అంగహారాన్=అవయవాల కదలికలను/నాట్యరీతులను; విదధతే=చేస్తుంటారు.

**తా॥** ఓ పాదుకాదేవీ! గొప్పమహిమకలిగిన శ్రీరంగమందు నీ సేవారసానుభావులు--నీ యందుంచబడిన పాద (ద్వయ)ం చేత సన్మార్గమందునడిచే ప్రసిద్ధ సత్త్వగుణంతో కూడిన మనస్సుచేత, చూడదగిన శ్రీరంగనాథుని వలెనూ;--

విశాలమైన నాట్యయోగ్యస్థలమందు పదగమకాలతో సంచరిస్తూ నాట్యకళారీతులను అనుసరించి సాత్త్వికాభినయాలచేత మనోజ్ఞంగా కనదగిన నటులవలెనూ, --

నీకు సమర్పించే ఆచారంచేత సాధుమర్యాదను పాటిస్తూ రోమాంచేత్యాది సాత్త్వికభావాలచేత తన్మయంగా కనబడే రసికులైన సామాజికుల వలెనూ; -

పదేపదే అంగహారాలను చేస్తుంటారు.

వ్యాఖ్య :- పాదుకాకింకరులకు ప్రకృతి మండలమందే భగవత్సాధర్మ్యమైన ఫలం వివక్షితం.

భగవత్పాదుకలను నిత్యం సేవిస్తూ ఉండాలని ఇంతవరకు తెలిసింది. క్రమంగా పాదుకలను సేవించే అనుభవం ఎలా ఉంటుందో ఈ శ్లోకం వివరిస్తుంది.

శ్రీరంగం భూలోకవైకుంఠమే "వైకుణ్ఠం రఙ్గమన్దిరమ్" శ్రీవైకుంఠం శుద్ధ సత్త్వమయం.

"రజస్తమోభ్యా మస్పృష్టం ద్రవ్యం (మనః) సత్త్వమిహోచ్యతే"

రజస్తమోగుణస్పర్శ లేశమైనాలేని, కేవలం సత్త్వగుణంకల ద్రవ్యానికి "శుద్ధసత్త్వం" అని పేరు.

"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్"- "క్షయం తమస్యరజసః పరాకే" "అధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం".

భగవంతునికి ఆవాసస్థానమైన పరమపదం శుద్ధసత్త్వమయమని వేదాంత శాస్త్రప్రమాణం.

భగవంతుని దివ్యమంగళ విగ్రహం (దేహం) ప్రాకృతిక పదార్థాలకంటె అత్యంత విలక్షణమైనది.

"క్షణే క్షణే యన్నవతా ముపైతి తదేవరూపం రమణీయతా యాః"

ఆరూప రమణీయత, నిరంతరం దర్శించే నిత్యసూరులకూ, ముక్తాత్మలకూ ఎంత అనుభవించినా, ఇంకా అనుభవించాలనే ఆశనురేకెత్తిస్తూ, తృప్తినీయనిది. "ఆరావముదం"-"అపర్యాప్తామృతం" అని అబ్బురంగా వ్యవహరింపబడుతూ, ఆహ్లాదకరమైన తేజఃపుంజమై విరాజిల్లేది. శ్రియఃపతి లోకాపకారం కోసం పర, వ్యూహ, విభవాంతర్యామ్యర్చా వతారాలెత్తి, ఎనలేని ఎత్తులతో ఎరుక పడకుండా విభ్రాజితుడైన విరాట్ పురుషుడు.

"నిన్రవాఱు మిరున్దవాఱుమ్ కిడన్దవాఱుమ్నినైప్పరియన" (తి.వా.మొ.5-10-6) దివ్యసూరులభావనకే అందనిరీతిగా, ఆయా దివ్యక్షేత్రాలలో నిలుచుండి, కూర్చుండి, పరుండి, ఆశ్రితసులభమై అర్చింపబడే స్ఫూర్తికలది అర్చామూర్తి. ప్రణవానికి ప్రథమ వ్యాహృతిగా మంత్రపూజితయైన భూదేవి వాల్లభ్యాన్ని మరువలేక, పాలకడలిలో ఉండే ఆకారం వికారం కాకుండా, ప్రథమ పుత్రుడైన పరమేష్ఠిద్వారా - సద్వారకంగా - దయచేసిన శేషశాయి "పంకజబంధుబింబస్థాయి, త్రైలోక్య మంగళదాయి, శ్రీరంగశాయి."

"నాగణైమిశైనమ్బిరాన్ శరణే శరణ్ నమక్కెన్ఱు". "తన్నుడై పూదఙ్గళేయాయ్, కిడన్దు మిరున్దు మెళున్దుమ్ గీతమ్ పలపలపాడి నడన్దుమ్ పరన్దుమ్ కునిత్తుమ్ నాడకమ్శెయ్గిన్రనవే" (తి.వా.మొ.5-2-4) "పవనాశనుని మీద పవ్వళించిన స్వామి చరణమే మాకెప్డు శరణ మనుచు, పలువురు పాటలు పాడుచునాడుచు ఆనందమును

నిత్య మనుభవింత్రు" అన్నారు శ్రీపరాంకుశులు.

"వాన్ తిగళుమ్శోలై మదిళ్ అరఙ్గర్" 'గగనాన్ని చుంబించేతోటలూ, సప్తప్రాకారాలూ కలిగిన రంగమందు పవళించిన దేవుడు; అన్నారు శ్రీపరాశరభట్టర్. ఇంతటి మహిమకలది 'రంగం' ఈ శబ్దాన్ని తమిళభాషలో 'అరంగం' అంటారు. అరంగమంటె రెండు నదులనడుమ ఉన్న ద్వీపం అని అర్థం. ఉభయకావేరుల మధ్య ఉన్న దివ్యక్షేత్రం "శ్రీరంగం".

"క్షీరాబ్ధేర్మండలాద్భానోః యోగినాం హృదయాదపి।
రతింగతో హరిస్తస్మాద్రంగ మిత్యభిధీయతే॥"

పాలకడలి కంటెనూ, సూర్యమండలం కంటెనూ, యోగుల హృదయం కంటెనూ భగవానుడానందం పొందిన క్షేత్రం, కాబట్టి 'రంగ' మని పేరు.

1. "రంగతి (స్వయం భక్తం ప్రతి గచ్ఛతి) ఇతి రంగః" భక్తుల దగ్గరికి తానే పోతాడనే 'రంగ' శబ్దవ్యుత్పత్తివల్ల, ఆశ్రితుల విషయమై భగవంతునికి గల సౌలభ్యగుణం ప్రకటితం.

2. "రంగ్యతే (గమ్యతే భక్తైః ప్రాప్యత్వేన, ప్రాపకత్వేనచ) ఇతి "రంగః." భక్తుల చేత ఉపాయంగానూ, ఉపేయంగానూ ఆరాధింపబడేవాడు, అనే వ్యుత్పత్తి వల్ల భగవంతుని అసాధారణ స్వరూపం వివరింపబడింది. నిత్యులూ, ముక్తులూ, ముముక్షువులూ ప్రాప్యంగా పొందే క్షేత్రమే రంగం.

3. రజ్యంతే (సామాజికాః) ఇతి "రంగం". నటపరివృఢుడైన శ్రీరంగనాథుడు సామాజికులను రంజింపజేసే 'రంగస్థల' మనికూడా వ్యుత్పత్తి కలదు.

శ్రీరంగమాహాత్మ్యంలో 'శ్రీరంగం' పేరు 'నర్మరంగ' మని ఉంది. "పెణ్ణాళన్ పేణు మూర్ పేరుమరంగమే" (నాచ్చియార్ తిరుమొళి. 11-9) స్త్రీజనోద్ధరణచేసి ఆడిపాడిన స్థలమూ, ఊరూ, దైవం పేరూ శ్రీరంగమే అన్నది గోదాదేవి. 'అరంగం' అంటే "పెరియపిరాట్టియార్క్కునృత్తస్థానమ్"-శ్రీదేవికి నాట్యరంగమన్నారు. (పెరియావాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్యానం)

1. శ్రీరంగనాథుడు పాదుకలను ధరించి గజంలాగా, వృషభంలాగా, శార్దూలంలాగా,సింహంలాగా, చతుర్గతులతో ఒయ్యారంగా సంచరించే మహానటుడు. పాదుకాభక్తులు జ్ఞానవైరాగ్యాలతో స్వామి నటనానైపుణ్యాన్ని సేవిస్తూ, స్వామి అడుగులవేసిన పద్ధతిగానే అడుగులువేస్తూ స్వామిలాగాతామూ ఆనందిస్తుంటారు. 'ఋ-గతి ప్రాపణయోః' అనే ధాతువువల్ల 'అర్పిత' పదానికి 'గత్యర్థం'. "నారాయణైక నిష్ఠాయే సాత్త్వికాస్తాన్ నిబోధత" అన్నట్లు భగవద్భక్తులు సత్త్వగుణంకలవారని శాస్త్రం.

"నిరంజనః పరమం సామ్యముపైతి". "భోగలింగసామ్యాచ్చ". (బ్ర.సూ) అనే వేదాన్తశాస్త్రవాక్యాలవల్ల, పరమపదంలో కలిగే ఆనందం భగవంతునికీ, నిత్య, ముక్తాత్మలకూ సమానమే, అని తెలుస్తున్నది. ఈ ఆనందానుభవమే మోక్షం. "మమసాధర్మ్యమాగతాః" (గీత. 14-2) ఊర్ధ్వంగచ్ఛంతి సత్త్వస్థాః" (గీత-14-18) సాత్త్వికులు భగవంతునితో

సమానరూప, గుణాలను కలిగియుంటారనీ, వారు ముక్తిని పొందుతారని శ్రీభగవానువాచ, కాబట్టి పాదుకోపాసకులకు శ్రీరంగనాథునితో, ఇక్కడ, సామ్యం చెప్పబడింది.

2. లోకంలో నటశేఖరులు నాట్యరంగస్థలమందు నాట్యశాస్త్ర పద్ధతిగా పాత్రచిత్రణము పోషించడానికి ఆయారూపాలను (వేషాలను) దాల్చి, ఆభావాలనే ప్రకటించే అభినయంచేస్తూ నటిస్తారు. నటులు సహజ చిత్తవృత్తులను మరగుపరచుకొని, పాత్రోచితమైన వర్తననూ, భావాలనూ సాత్త్వికంగా అనుభవిస్తూ సరసంగా ప్రదర్శిస్తారు, అనడం భంగ్యంతరం.

"నిర్వృత్తే త్వంగసత్త్వాభ్యాం ద్వేత్రిష్వాంగిక సాత్త్వికే" (అమరం) అంగైః నిర్వృత్తం=ఆంగికం, సత్త్వేన నిర్వృత్తం=సాత్త్వికం. హస్తపాదాలు, కనుబొమలు మొదలైన అంగాలచేత నిర్వర్తింపబడేది ఆంగికం. సత్త్వమనే మనోవృత్తి చేత ఏర్పడే స్వేదాశ్రురోమాంచాది క్రియలకు సాత్త్వికమని పేరు.

'వికారో మానసోభావః'-మనోవికారమే భావం.

"భావఃస్వభావేఽభిప్రాయే చేష్టా సత్త్వాత్మజన్మసు। క్రీడాలీలా పదార్థేషు" (విశ్వని.)

భావయతి (జ్ఞాపయతి హృదయగతం) ఇతి 'భావః'-మనసులో ఉన్నదాన్ని ప్రకటిస్తే 'భావం' అనబడుతుంది.

"నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమ విక్రియా", వికారంలేని చిత్త మందు మొదట కలిగిన వికారమే భావం.

"సత్త్వైకమూలత్వాత్ సాత్త్వికప్రథా" సత్త్వం వల్ల పుట్టినవేసాత్త్విక భావాలు.

ఇలాగా, పాదుకాసేవను అనుభవించే భావుకులకు, రసోత్పాదకమైన భావాలను సూచించే అభినయాన్ని ప్రదర్శించే నటులతో సామ్యం ప్రోక్తం.

3. "రంగో రణఖలే రాగే నృత్తే రంగంత్రపుణ్యపి" (వి.ని)

నాట్యరంగస్థలమందు నర్తించే నటులకౌశలాన్ని చూచే సామాజికుల యందు వాసనాబలంచేత రసం సాధారణీకరణం చెందుతుంది. నటుల చిత్తవృత్తి విశేషమంతా సామాజికులూ అనుభవిస్తారు. అంటే ప్రేక్షకులు పాదుకావిషయంగా అర్పించబడిన సేవాభావంచేత చిత్తద్రుతికలిగి, కన్నీరు కార్చడం, పులకలు అంకురించడం, అంజలిపట్టడం, ప్రణామం చేయడం, ఆడడం, పాడడం మొదలైన చేష్టలతో రసికశిఖామణులుగా భాసిస్తారు. "అంగహారోఽంగ విక్షేపః" (అమరం) Dance.

పాదుకాభక్తులు తన్మయులైనందున, రసికులైన సామాజికులతో సమానులనీ చెప్పబడింది. వాస్తవంగా, దేశికుల వారు రంగేశుని పాదుకాప్రాప్తి వల్ల ఆనందాన్ని పొందారు. "శ్రావకాణాము దేవస్య తద్భావనటవర్తకాః" అన్నట్లు, పాదుకానుభవ జనితానందం గల శ్రీరంగనాథునితోనూ, నటశేఖరులతోనూ, సామాజికులతోనూ సాధర్మ్యం పొందాలనీ ఆశించడం దేశికుల సాత్త్విక నిష్ఠకు సముచితమే కదా!

శ్లేషమూలకమైన ఉపమాలంకారం. వసంతతిలకావృత్తం.

*990. యేనస్థితా శిరసి మేవిధినాఽధునాత్వం*
*తేనైవదేవి! నియతం మమసాంపరాయే।*
*లక్షీకరిష్యసి పదావని! రంగనాథం*
*లక్ష్మీపదాంబురుహ యావక పంకలక్ష్యమ్॥-20.*

**అర్థం:-** హే దేవి! పదావని=ఓ పాదుకాదేవీ! త్వం=నీవు; అధునా=ఇప్పుడు; యేన=ఏ; విధినా=భాగ్యం చేత; మే=నా యొక్క; శిరసి=తల యందు; స్థితా=ఉన్నావో; తేన, ఏవ=ఆభాగ్యం చేతనే; లక్ష్మీ-లక్ష్యం। లక్ష్మీ పద+అంబురుహ= శ్రీదేవి యొక్క పద్మసదృశమైన పాదాలయందలి; యావకపంక=లత్తుకద్రవం (పారాణి) చేత; లక్ష్యం=గుర్తింపదగిన; రంగనాథం=శ్రీరంగనాథుణ్ని; మమ=నా యొక్క; సాంపరాయే=అంతిమదశయందు; నియతం=నిశ్చయంగా; లక్షీకరిష్యసి=ప్రత్యక్షంగా చూపించగలవు.

**తా॥** ఓపాదుకాదేవీ! నీవు ఏభాగ్యంచేత నా శిరస్సున ఉన్నావో; ఆభాగ్యంచేతనే లక్ష్మీపాదపద్మాలయందలి పారాణిచే గుర్తించబడిన శ్రీరంగనాథుణ్ని నా మరణదశలో కచ్చితంగా నాకు సాక్షాత్కరింపచేయ గలవు.

**వ్యాఖ్య :-** పాదుకను భక్తుల శిరస్సున చేర్చేవిధి, భగవంతుణ్ని చేర్చక విరమించదు, అని కవి అధ్యవసాయం.

పాదుకను భక్తితో సేవించడం, శిరసావహించడం 'విధి' అనకతప్పదు. 'విధి' అంటే పూర్వజన్మల్లో చేసిన సుకృతదుష్కృతాల ఫలం. అదే ఈ జన్మలో జరుగుతున్న కార్యం. విధినే భాగ్యం, అదృష్టం అంటారు.

"దైవందిష్టం భాగధేయం భాగ్యం, స్త్రీ నియతిర్విధిః" (అమరం) 'యావః' అంటే పాదాలకు పూసే పదార్థం-లాక్షారసం, పారాణి. "లాక్షారాక్షాజతుక్లీబేయావోఽలక్తోద్రుమామయః" (అమరం) 'సంపరాయ' (సాంపరాయ) శబ్దానికి ఆపద, యుద్ధం, భవిష్యత్కాలమని నానార్థాలున్నాయి. 'మరణం' పెద్ద ఆపత్తేకదా!

"సంపరాయఃస్మృతో యుద్ధే విపదుత్తరకాలయోః" (అజయనిఘం)

"అథాపది; యుద్ధాయత్యోః సంపరాయః" (అమరం)

'విధి' అంటే దైవం, అనే అర్థమూ ఉందికదా! పాదుకాదేవ్యనుగ్రహం వల్ల దేశికులవారికి శ్రీరంగనాథుని కైంకర్యం చేసే ఫలం ఈ జన్మలో, ఈ లోకంలో లభించింది. పరలోకంలో కూడా స్వామికి కైంకర్యం చేసే ఫలం పొందాలంటే, మరణసమయంలో దైవదర్శనం కావాలి. అది తనకు లభించగలదని పాదుకాదేవితో ప్రార్థించాడు దేశికులు.

అయితే మరణ సమయంలో వచ్చిన వారిని గుర్తించడమూ కష్టమే. ఇంద్రియాలశైథిల్యం వల్ల తాను గుర్తించలేడు. భగవంతుని సంచారం పాదుకాధీనమైనందువల్ల, రంగనాథుణ్ణి తెచ్చి చూపిస్తుంది పాదుకాదేవి.

ఆశ్రితులను రక్షించడానికి "అవ్విడం శ్రీరంగనాచ్చియార్‌క్కునృత్తస్థానం". ఆ స్థలం శ్రీరంగనాయకికి నాట్యస్థలం-అని ఆమోదించి శ్రీరంగమందు వెలసియున్నాడు రంగనాథుడు. మరి ఆ శ్రీదేవి ఈ రంగస్థలానికి వచ్చిన కారణమేమిటి? అంటే శ్రీపరాశరభట్టర్ వారు "ఉదధి పరమవ్యోమ్నోర్విస్మృత్యచ మాదృశ రక్షణ క్షమమితిధియా భూయః శ్రీరంగధామని మోదసే ("శ్రీగుణరత్నకోశం"56) అని స్తుతించారు.

శ్రీదేవి, పుట్టినిల్లని క్షీరాబ్ధిని, మెట్టినిల్లని వైకుంఠాన్ని అభిమానంతో, గౌరవంతో పోషిస్తున్నది. ఆ రెండింటినీ మరచిన రీతిగా మనలాంటి అకించనులను రక్షించే బుద్ధితో ఈ లోకంలో శ్రీరంగనగరాన్ని నివాసస్థలంగా ఏర్పరచుకొన్నది.

"మాతాచకమలాదేవీ పితాదేవో జనార్దనః", అన్నట్లు శ్రీశ్రియఃపతుల సంతానమేకదా మనం. "అధరీకృత సర్వస్నేహేన గురుణా అపత్యప్రేమ్ణా" అని బాణకవి చెప్పినట్లు, వాస్తవంగా అన్నింటిని మించినది పుత్రప్రేమ. కాబట్టి శ్రీరంగమందు చైతన్యస్తన్యదాయియై, బహుభంగుల నర్తిస్తూ తనసంతానాన్ని పోషిస్తున్నది లక్ష్మీదేవి. 'దేవీ' కాబట్టి (దేవయతి=క్రీడయతి) పుత్రులైన భక్తుల దోషాలు హితకాముడై శిక్షించే తండ్రికంట బడకుండా కాంతుని ఆడిస్తుంది, (దీవ్యతీతిదేవీ) తానూ అనేక భంగిమలతో నాట్యం చేస్తుంది. "విష్ణువక్షఃస్థలస్థితా" అనే ప్రామాణిక వాక్యం వల్లనూ లక్ష్మినాట్యమాడడానికి తగినంత వైశాల్యంగల వక్షఃస్థలం కలవాడు శ్రీమహావిష్ణువని తెలస్తున్నదికదా! అంతే కాదు. లక్ష్మిభగవత్తత్త్వాన్ని ప్రతిపాదిస్తుంది.

బ్రహ్మరుద్ర విష్ణువులకు సమానత్వాన్ని చూపే సూక్తులు వేదంలో ఉన్నాయి. 'మొదట బ్రహ్మ ఒక్కడే ఉండెను'- "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే". 'రుద్రుడొక్కడే విశ్వాధికుడు'- "విశ్వాధికోరుద్రో మహర్షిః". నారాయణుడొక్కడే మొదట ఉండెను. "ఏకోహవైనారాయణ అసీత్".

అయితే, ఈ త్రిమూర్తులలో పరతత్త్వమెవరు? అని సందేహం కల్గుతుంది కదా! "హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ" అని పురుషసూక్తం. "లక్ష్మీపతియే పరబ్రహ్మ" సర్వకారణంగా ప్రసిద్ధమన్నది.

"వేదాంతాస్తత్త్వచింతాం మురభిదురసియత్పాద చిహ్నైస్తరంతి" (శ్రీగుణరత్నకోశం 4) లక్ష్మీదేవి పాదచిహ్నాలు వక్షఃస్థలమందుకలవాడు పరమాత్ముడు, అని ఉపనిషత్తులు పరతత్త్వ సందేహాన్ని నివృత్తి చేసుకొన్న వన్నారు శ్రీ పరాశరభట్టర్.

లక్ష్మీదేవి పాదాలకున్న లత్తుకద్రవ చిహ్నాలు కలవాడే పరబ్రహ్మ "శ్రీమత్యాయతనే లక్ష్మీపదలాక్షైక లక్షణమ్" (శ్రీరంగరాజస్తవం, పూ.శ.9) లత్తుక గుర్తు కలిగిన పరమాత్మరూపవస్తువు సంపదతో నిండిన శ్రీరంగమందున్నదన్నారు. శ్రీ.ప.భట్టర్. "సర్వలక్షణ లక్షణ్యః" అనే వి.స.నామాన్ని "సాక్షాల్లక్ష్మీసతతాలింగన సూచకైః సర్వైఃలక్షణైః లక్షణే సాధురితి సర్వలక్షణలక్షణ్యః" అని వీరే వ్యాఖ్యానించారుకదా! పరతత్త్వ నిర్ణయంచే సేది లక్ష్మీతత్త్వమే. నిజంగా, తండ్రియెవడో తల్లి మాత్రమే తెల్పుతుంది. "ఏతద్వైసత్యకామ పరంచైవాపరంచ బ్రహ్మ యదోంకారః తస్మా ద్విద్వానే తేనైవాయతనే నైకతర మన్వేతి" (5-2) పరబ్రహ్మ యొక్క ఆయతనం ఓంకారమని ప్రశ్నోపనిషత్తు

బోధిస్తుంది. "శ్రీమత్యాయతనే విష్ణోః శిశ్యే నరవరాత్మజ" (రామాయణం. అయో. 6-4) అనే శ్లోకం స్మరణీయం.

ప్రణవాత్మకమైన శ్రీరంగ విమానమందు శేషశాయికదా రంగనాథుడు. "లక్షీకరిష్యసి"- ("డు కృఞ్ కరణే" ఇత్యస్మాద్ధాతోః, క్రియార్థాయాంక్రియాయా మసత్యాం సత్యాంచ భవిష్యతిల్రుటి మధ్యమ పురుషైక వచనాంతః) పరమపదించే భవిష్యత్కాలమందు పరమపదనాథుణ్ని చూపించగల సామర్థ్యం కూడా పాదుకాదేవికే కలదు. కాబట్టి, వేదాంతదేశికులు "లక్షీకరిష్యసి పదావని! రంగనాథం, లక్ష్మీపదాంబురుహయావక పంకలక్ష్యమ్". అన్నారు.

ఐహికానుభవకైంకర్యాన్ని ఇంతవరకు చెప్పి, ఇక ముందు పరమపద భోగవిలాసాది నిష్పాదనంకూడా పాదుకాధీనమే, అని దబ్బరం లేకుండా ఆచార్యులు నిబ్బరంగా విన్నవించారు.

కావ్యలింగాలంకారం. వసంతతిలకావృత్తం.

*991. హరిచరణ సరోజే భక్తిభాజాం జనానా*
*మనుకరణ విశేషై రాత్మనైవోపహాస్యమ్।*
*పరిణమయదయార్ద్రా పాదుకే! తాదృశంమాం*
*భరత పరిషదంతర్వర్తిభిఃప్రేక్షణీయమ్॥-21.*

**అర్థం:-** హే పాదుకే=ఓపాదుకాదేవీ! హరిచరణసరోజే=భగవంతుని యొక్క పద్మసదృశ్యమైన పాద (ద్వయ)మందు; భక్తిభాజాం=భక్తి కలిగిన; జనానాం=జనుల యొక్క; అనుకరణ విశేషైః=చేష్టలను చూచి చేసినచేష్టలచేత; ఆత్మనా, ఏవ=నాచేతనే; ఉపహాస్యం=హాసాస్పదమైన, హేళన చేసుకోదగిన; తాదృశం=అలాంటివాడనైన, దుష్కర్మదూషితుడనైన; మాం=నన్ను; దయా+ఆర్ద్రా=దయచేత ఆర్ద్రవై; భరత పరిషత్+అంతః+వర్తిభిః=భరతుని గోష్ఠిలో చేరియున్న వారిచేత; ప్ర+ఈక్షణీయం=కటాక్షింప దగినవాణ్నిగా; పరిణమయ=చేయుము.

**తా॥** ఓ పాదుకాదేవీ! శ్రీహరి పాదపద్మాలను సేవించే భక్తులను అనుకరించడం వల్ల నన్నునేనే ఎగతాళి జేసుకోదగిన, మహాపాపినైన నన్ను, నీవు కృపామయివై, భరతుని గోష్ఠిలో ఉండే (పాదుకా) భక్తులచేత కటాక్షింప దగిన వాణ్నిగా చేయుము.

వ్యాఖ్య :- కోసలదేశవాసుల వలె పాదుకోపాసకుడు ముక్తపురుషుడయ్యే వర్ణన.

శ్రీరంగనాథస్వామిని అవసానకాలమందు ప్రత్యక్షంగాచూపించుమన్న విన్నపాన్నివిన్న పాదుకాదేవి, "'ఏమోయ్! దానికి తగిన యోగ్యత నీకు ఉండాలి కదా"! అన్నది.

"ఓ దేవీ! ఆయోగ్యతను కూడా నీవే కృప జేయాలి" అన్నారు దేశికులు

"హరిగ్ం హరంత మనుయంతిదేవాః" (శ్రుతి.)

విశ్వాన్ని తన అధీనంలో ఉంచుకొన్న హరిని దేవతలు అనుసరిస్తుంటారు, అన్నది వేదవాణి.

"బ్రహ్మాణమీశం రుద్రంచ యమమం వరుణమేవచ।
ప్రసహ్య హరతే యస్మాత్తస్మాత్ హరిరిహోచ్యతే॥"

బ్రహ్మరుద్రేంద్ర యమవరుణాదులను తన వశమందు ఉంచుకొనే శ్రీమహావిష్ణువే 'హరి'యని చెప్పబడుతున్నాడు.

సర్వాధికుడైన హరియొక్క పాదసరోజాలు శైత్యసౌందర్య సౌగంధ్యసౌకుమార్య శోభాతిశయ మహిమకలవి. " కట్టురైక్కిల్ తామరైనిన్ కణ్పాదమ్కైఅవ్వా" స్వామి నేత్రపాదహస్తాలను తామరపూవులతో పోల్చి చెప్పడం భక్తులు అనుభవిస్తూ పొద్దు పుచ్చుకోవడానికే కాని వాటికి ఉపమానార్హత లేదన్నారు. నమ్మాళ్వార్లు (తి.వా.మొ.3-1-2)

"యత్ బృందా వనపండితం దధిరవైర్యత్తాండవం శిక్షితమ్
యల్లక్ష్మీకరసౌఖ్యసాక్షి జలజప్రస్పర్ధిమానర్ధియత్।
యద్భక్తే ష్వజల స్థలజ్ఞ మపి యద్దూత్య ప్రసంగోత్సుకం
తద్విష్ణోః పరమం పదం వహతునః శ్రీరంగిణో మంగళమ్॥" (124)

అని శ్రీపరాశరభట్టర్‌వారు శ్రీరంగరాజస్తవం (పూ.శ) చేశారు. "బృందావన సంచారసమర్థమైనది, పెరుగుచిలుకు సవ్వడులచేత నేర్పబడిన తాండవ నాట్యంకలది, లక్ష్మీదేవి చేతికి కల్గే సుఖానికి సాక్షియైనది, సరోజాలతో స్పర్థించేసౌందర్యాతిశయం కలది, భక్తుల విషయమై ఎత్తుపల్లాలను (గుణదోషాలను) గమనింపనిది, దౌత్యసందర్భమందు ఆసక్తి కలిగినదైన శ్రీరంగనాథుని పరమైన పాదం మనకు యోగక్షేమాలను కలిగించుగాక" అని తాత్పర్యం.

"విష్ణోర్యత్పరమంపదం" అని భగవంతుని పాదాన్ని శ్రుతివాక్యంతో అన్వయించి, షడ్గుణాలతో శోభిస్తున్నదన్నారు కదా! ఇందు 'జలజప్రస్పర్థిమాన+బుద్ధి' విశేషణపదం గమనీయం. తామరపూవూ, భగవత్పాదమూ, రెండు పోటీపడ్డాయి. నీళ్ళల్లో మాత్రమే తామరపూవు శోభిస్తున్నది. భగవత్పాదం, జలంలోనే కాక స్థలం (నేల) మీదకూడా సౌందర్య, సౌరభ, సౌకుమార్యాదుల శోభతో అతిశయించడం వల్ల తామరపూవును జయించింది. కాబట్టి winners తో పాటు Runners నూ చెప్పడం న్యాయమేకదా!

ఇట్టి మాహాత్మ్యం గల హరిచరణ సరోజమందు ఆళ్వార్లూ, ఆచార్యులూ, వారిని ఆశ్రయించిన జనులూ అనన్యభక్తికల వారైనారనడంలో ఆశ్చర్యమేమి? అలాంటి భక్తులు భగవత్పాదసేవను చేస్తుంటే, వారిని జూచి సామాన్యులూ భక్తిలేకున్నా, వారివలె నటిస్తూ, భక్తం మన్యులైయుండి, తర్వాత భగవదనుగ్రహంవల్ల, యధార్థం తెలుసుకొని తమను తామే నిందించుకొంటారు.

"విప్రనారాయణ" అనే నామాంతరం గల "తొండరడిప్పొడి" (భక్తాంఘ్రిరేణువు) అనే ఆళ్వార్లు "తిరుమాలై" అనుసంధానం చేశారు.

"ఉళ్ళత్తేయుఱైయుంమాలై యుళ్ళువారుణర్వొన్జిల్లా
కళ్ళత్తేనానుంతొండాయ్ త్తొండుక్కే కోలం పూండు।

ఉళ్ళువారుళ్ళతైల్లాముడనిరున్దరితి యెన్డు
వెళ్గిప్పో యెన్నుళ్ళేనాన్ విలవఱచ్చిఱిత్తిట్టేనే॥" (తిరుమాలై-34)

"హృదయంలోనే భగవంతుడున్నాడని తెలియక, భక్తులందరు ఆదరించే రీతిగా వారి వలె వేషభాషలను ధరించాను. నేనుచేసే పాపకృత్యాలన్నీ ఎవ్వరూ చూడలేరనీ సదాచార్యునిలాగా పరోపదేశవాక్యాలు పలికాను. ఇతరులను మోసగించిన, నా దొంగనటనను చూచిన మహానుభావులు, పెద్దలు "భగవంతుడు సర్వవ్యాపి, సర్వజ్ఞుడు; నీ హృదయంలోనూ సాక్షిగా ఉండి, నీవుచేసే వంచన, కపట కృత్యాలను గమనిస్తున్నాడని మందలించగా, యథార్థం తెలిసిందని సిగ్గుతో చాటుకుపోయి నాలో నేనే ప్రక్కలు విరగబడినట్లునవ్వాను" అని తాత్పర్యం.

జ్ఞానవైరాగ్య సంపన్నులైన ప్రపన్నులు కూడా తమ నికృష్టతనూ, అనర్హతనూ ప్రకటించుకొంటారు. తాముజ్ఞాన శూన్యులనీ, భగవంతుడు దోషశూన్యుడనీ, పల్లాన్ని పూడ్చడానికి ఆ మిట్టను సర్దితే సరిపోతుందని ప్రార్థిస్తారు. దేశికులు తమకుఫలం లభించడానికి తగిన యోగ్యతను పాదుకాదేవియే ప్రసాదించాలన్నారు. పరమపదంలో ఉన్నవారందరు భగవత్సేవా పరాయణులే. కాబట్టి, తనకు భగవంతుణ్ణి సాక్షాత్కరింప జేయడమో, తనను భగవంతడు (చూచి) కటాక్షించడమో చాలదంటారు.

"గత్వాతు సరయూతోయం స్థావరాణి చరాణిచ।
ప్రాప్యతత్తోయ విక్లేదం దేవలోక ముపాగమన్॥" (రామా. ఉత్తరకాండ. 110 స. 26 శ్లో.)

శ్రీరామచంద్రస్వామి కృపవల్ల అయోధ్యలోని ప్రజలూ, పశుపక్ష్యాదులూ, గరుకమొదలు వృక్షాది స్థావరాలూ సరయూనదీ జలంలో మునిగి దివ్యలోకాన్ని పొందాయి.

'భరత పరిషత్'- అయోధ్యానగర పౌరులు భరతునిలాగా పాదుకను ఆరాధించడం వల్ల, వైకుంఠలోనూ పాదుకాదేవిని ఉపాసిస్తున్న భక్తివర్గమని అర్థం. పరమపదంలోని భరతగోష్ఠిలో ఉన్న పాదుకాదే వ్యుపాసకులు "ఇతడు మన లాగా పాదుకా భక్తులలో ఒకడు" అని తనను స్వీకరించే యోగ్యతను దయార్ద్రచిత్తయైన పాదుకాదేవి కల్పించాలని దేశికుల విజ్ఞప్తి.

పర్యాయోక్త్యలంకారం మాలినీవృత్తం.

*992. దురిత మపనయంతీ దూరతః పాదుకే! త్వం*
*దనుజ మథన లీలాందేవతా మానయంతీ!*
*అనితర శరణానా మగ్రిమస్యాస్యజంతో*
*రవశకరణ వృత్తే రగ్రతః సన్నిధేయాః॥-22*

**అర్థం:-** హే పాదుకే=ఓ పాదుకాదేవీ! త్వం=నీవు; దురితం=పాపాన్ని; దూరతః=దూరంగా; అపనయంతీ=తొలగిస్తూ, దనుజమథనలీలాం=అసుర సంహారమే క్రీడగాగల; దేవతాం=దైవమైన శ్రీరంగనాథుణ్ణి; అనితర శరణానాం=వేరే గతి లేని వాళ్ళల్లో; అగ్రిమస్య=మొదటి వాడనైన; అవశ కరణ వృత్తేః=స్వాధీనంలో లేని ఇంద్రియ వ్యాపారం

గల; అస్య=ఈ; జంతోః=ప్రాణి యొక్క; అగ్రతః=ఎదురుగా (ముందుకు); ఆనయంతీ=తీసుకొని వస్తూ; సన్నిధేయాః=సన్నిధానం చేయుము.

**తా॥** ఓ పాదుకాదేవీ! నీవు నా పాపరాశిని దూరంగా విసరి అంటకుండా చేస్తూ రాక్షస సంహారమే ఆటగా గల శ్రీరంగనాథుణ్ని తీసుకొని వస్తూ, నీవు తప్పవేరే రక్షకులు లేని వాళ్ళల్లో అగ్రేసరుడనైన, ఇంద్రియవ్యాపారం స్వాధీనంలోలేని నా ముందు చేర్చుము.

వ్యాఖ్య :- ముక్తైశ్వర్య లాభం కోసం మరణకాలంలో పాదుకాదేవి దనుజారిని దగ్గరికితెచ్చి చూపించాలని విజ్ఞప్తి.

ముక్త పురుషులలో తనకొక స్థానం కలించాలంటే పాదుకాదేవి పరమపురుషుణ్ని తన దేహావసాన సమయంలో తెచ్చి తనకు సాక్షాత్కరింపచేయాలని కవివేడుక. పాదుకానుగ్రహం వల్ల 'పాదుకాసహస్రం' అనే స్తోత్రం చేయడంచేత పాదుకాదేవి అధిక కృపకలిగి, శ్రీరంగనాథునికి తాను జీవించునంతకాలం కైంకర్యంచేసే అవకాశం కల్పిస్తున్నది.

ఇక, మరణకాలంలో సర్వేంద్రియాలు సడలి పోతున్నప్పుడు 'అహంస్మరామి మద్భక్తం'-'నా భక్తుణ్ని మరువను' అన్న శ్రీరంగనాథుడు తన దగ్గరికి వచ్చి ప్రత్యక్షమయ్యేలాగా పాదుకయే చేయాలి. భగవంతుని దర్శనం అంత్యకాలంలో ఎందుకు కావాలి?.

విరోధులను వధించడమే లీలగా ఉండే భగవంతుని దర్శనం వల్ల మోక్షఫలప్రాప్తికి ప్రతిబంధకంగా ఉన్న సర్వపాపాలు ధ్వంసమవుతాయి. పునర్జన్మఉండదు. కాబట్టి, జ్ఞానక్రియా భజనరహితులై "భగవంతుడే రక్షకుడు; వేరేగతిలేనే లేదు" అని గోప్తృత్వాన్ని వరించే వాళ్ళల్లో ముందు నిలిచిన వాడు- అత్యంత అకించనుడు- అవసానదశలో ప్రయత్నించలేడు, ప్రార్థించజాలడు.

ఇంద్రియాలు చక్కగా పనిచేస్తున్నప్పుడే సర్వధర్మాలను ఫలాపేక్ష లేకుండా ఆచరిస్తూ "నోత్తనోన్బిలేన్" 'నధర్మనిష్ఠోఽస్మి' "అహమస్మ్యపరాధానామాలయః" అని అగతికత్వాన్నీ, ఆకించన్యాన్నీ అనుసంధానం చేయడం జ్ఞానాధికుల లక్షణం కదా!

పర్యాయోక్త్యలంకారం. మాలినీవృత్తం.

*993.* *చరమనిగమగీతే సప్తతంతౌ సమాప్తే*
*నిజసదన సమీపే ప్రాపయిష్యన్ విహారమ్,*
*జ్వలన మివ భవత్యోః సమ్యగారోపయేన్మాం*
*ప్రథమ వరణవశ్యః పాదుకే! రంగనాథః॥-23.*

**అర్థం:-** హే పాదుకే=ఓ పాదుకలారా! ప్రథమ వరణవశ్యః=మొదట ఒక్కసారి చేసిన ప్రపత్తికి అభిముఖుడైన/ మొదట వరింపబడిన ఆధ్వర్యుడైన; రంగనాథః=శ్రీరంగనాథస్వామి; చరమ నిగమగీతే=వేదాంత శాస్త్రమందు

(ఉపనిషత్తునందు) చెప్పబడిన; సప్తతంతౌ=జీవనరూపమైన యాగం; సమాప్తే=ముగిసినప్పుడు (మరణరూపమైన అవభృథం కలదైనప్పుడు); నిజసదన సమీపే=తన ఇంటికి దగ్గర।

అగ్నిహోత్ర గృహానికి సమీపాన; విహారం=విహరించే స్థలానికి/వేదికకు; ప్రాపయిష్యన్=చేర్చగోరినవాడై; మాం=నన్ను; జ్వలనం, ఇవ=వైతానాగ్నిని వలె; భవత్యోః=మీ (రెండింటి) మీద, (అరణులనే రెండకఱ్ఱల మీద) సమ్యక్=బాగా (నిస్సంశయంగా); ఆరోపయేత్=ఎక్కించుకోవాలి.

**తా॥** ఓపాదుకలారా! మొదట వరింపబడిన అధ్వర్యుడు వేదాంతశాస్త్రోక్తమైన యజ్ఞం సమాప్తికాగానే తన అగ్నిహోత్ర గృహానికి దగ్గరనున్న హోమవేదిక యందు చేర్చడానికి వైతానాగ్నిని ఉత్తరారణి, అధరారణి, అనే రెండు కఱ్ఱలమీద ఆరూఢంచేసి తీసుకొని పోయేలాగా, ఒక్కసారి ప్రపత్తిచేసి నప్పుడే అభిముఖుడైన శ్రీరంగనాథుడు నా జీవితం ముగిసినప్పుడు తన వైకుంఠమందలి మణిమయ మంటపానికి సమీప ప్రదేశమందు నేను స్వేచ్ఛగా సంచరించడానికి నన్ను మీమీద ఎక్కించుకొని తీసుకొనిపోవలెను.

వ్యాఖ్య :- పాదుకాదేవి భగవంతునితో పాటువచ్చి తనను పరమపదానికి తీసుకొనిపోవాలని కవి ప్రార్థన.

యజ్ఞంచేసే వ్యక్తి (యజమానుడు) యజ్ఞాన్ని వేదోక్తంగా చేయించడానికి మొదట అధ్వర్యుణ్ని ప్రార్థిస్తాడు. "వృతోऽస్మి" అని అంగీకరించిన అధ్వర్యుడు ఉత్తరారణి, అధరారణి అనే రెండు కఱ్ఱల మథనంతో అగ్నిహోత్రుణ్ని ప్రజ్వలింపజేసి నియమిత స్థానంలో అగ్నిని రక్షిస్తాడు. యాగారంభ ముహూర్తాన అధ్వర్యుడు ఆహవనీయాగ్నిని యజ్ఞశాలకు తీసుకొని పోయి హోమకుండమందు ప్రతిష్ఠిస్తాడు.

సప్తఛందస్సులతో ప్రక్రియ విస్తరింపబడుతుంది. కాబట్టి యజ్ఞానికి 'సప్తతంతు' వని పేరు. "సప్తతంతుర్మఖః క్రతుః" (అమరం)

దీక్షతో నిర్విఘ్నంగా సప్తతంతువును నిర్వహించి, చివరకు న్యూనాతిరిక్త దోషపరిహారం కోసం జరిపే మహోత్సవాన్ని "అవభృథం" అంటారు.

యజ్ఞం సమాప్తం-అవభృథం-కాగానే అధ్వర్యుడు అగ్నిని "అయంతేయోనిర్ ఋత్వియః" అనే వేదమంత్రాన్ని అనుసంధిస్తూ, అగ్ని జనకమైన రెండు (అరణులు అనే)కఱ్ఱలమీద ఎత్తుకొని పోయి అగ్నిహోత్ర రక్షాగృహమందు వేదిక మీద స్థాపించడం వైదిక విధానం

"అంతః సంభృత సప్తతం త్వవ భృథా దాదేహపాతోద యాత్"-"ముకుంద స్త్రయ్యంతప్రథిత మహిమాసోऽయమనఘాన్, ప్రపన్నానుద్ధృత్య స్వపదమనపాయంగమయతి" (10-89,90)

"న్యాస విద్యోపాసకుడు మనస్సులో అనుష్ఠించే యజ్ఞం అవభృథ రూపమైన మరణందాకా సాగుతుంది" "వేదాంతమందు ప్రసిద్ధమహిమ కలిగిన మోక్షదాత-ముకుందుడు-నిర్మలులైన ప్రపన్నులను పునరావృత్తి లేని

తన స్థానానికి-వైకుంఠానికి-చేర్చుకొంటాడు" అని 'సంకల్పసూర్యోదయం' (నాటకం)లో 'విష్ణుభక్తి' అనే ఒక పాత్ర వివరిస్తుంది.

"తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మాయజమానఃశ్రద్ధాపత్నీ"-

బ్రహ్మవేత్త ఆత్మహవిస్సమర్పణ యజ్ఞం చేస్తాడు. అందులో జీవుడే యజమానుడు. శ్రద్ధారూపచిత్తవృత్తియే పత్ని. శరీరమే ఇధ్మం. వక్షఃస్థలమే వేది. రోమాలే దర్భలు. మోక్షకామమే ఆజ్యం-సర్వం బ్రహ్మమయం అనే జ్ఞానమే దక్షిణ. ప్రాణధారణకాలమే దీక్షాసమయం. ఇలాగా-

"ఏతత్ సత్రంయన్మరణం తదవభృథః"- జీవనం ఒక యజ్ఞం, మరణమే అవభృథం.

"తస్మాత్ బ్రహ్మణో మహిమాన మాప్నోతి"-బ్రహ్మవిద్యోపాసకుడు అర్చిరాది మార్గంగా పరబ్రహ్మను పొందే విధానం "తైత్తిరీయక నారాయణీయోపనిషత్తు"లో విశదీకరింపబడింది.

ఉపనిషత్తు భగవంతుణ్ని అధ్వర్యునిగా వరించే విషయాన్ని చెప్పకున్నా, ఈ శ్లోకంలో ఉపమావైచిత్రి కల్పింపబడింది.

"సకృదేవప్రపన్నాయ" అని వాల్మీకి చెప్పినట్లూ, ఒక్కసారి శరణాగతి చేసినమహాత్మునికి, శ్రీమన్నారాయణుడు ప్రపన్నుని యొక్క రక్షణభారాన్ని వహించే అభయమిస్తాడు.

యజ్ఞాన్ని యథావిధిగా చేయించడానికి వరింపబడిన అధ్వర్యుడే సకృత్ ప్రపన్న జనసంరక్షణ దీక్షితుడైన శ్రీరంగనాథుడు. అగ్నిహోత్రుని లాంటిది ఆత్మ. నిజసదన సమీపంలో విహారం అంటే, ముక్తపురుషుడు పరమపదనాథునికి కైంకర్యంచేస్తూ "జక్షత్ క్రీడన్ రమమాణః" అని శ్రుతి చెప్పినట్లూ, ఆనందంతో ఆడుతూ, పాడుతూ స్వేచ్ఛగా ఆలోకంలో విహరించడం-సంచరించడం.

అక్కడ తన కైంకర్యంకోసం ఉపయోగపడే అగ్నిహోత్రుని వంటి జీవాత్మను పరమాత్ముడు, అరణులను పోలిన రెండు పాదుకల మీద ఆరోపించి, స్వస్థానమైన వైకుంఠమందు చేర్చుకోవాలని వేదాంత దేశికుల విజ్ఞాపన.

మాలినీవృత్తం.

*994. పునరుదరనివాసచ్ఛేదనం సహ్యసింధోః*
*పులిన మధివసేయం పుణ్య మాబ్రహ్మలాభాత్।*
*పరిణమతి శరీరే పాదుకే! యత్రపుంసాం*
*త్వ మసి నిగమగీతా శాశ్వతం మౌళిరత్నమ్॥ -24.*

**అర్థం** :- హే పాదుకే= ఓ పాదుకాదేవీ! పునః=మళ్ళీ;ఉదరనివాస+ఛేదనం=గర్భవాసావస్థను-జన్మను-ఛేదించే; సహ్యసింధోః=కావేరీ నది యొక్క; పుణ్యం=పవిత్రమైన, మనోజ్ఞమైన; పులినం=ఇసుకతిన్నెయైన శ్రీరంగమందు; ఆ బ్రహ్మలాభాత్=పరబ్రహ్మప్రాప్తి కలిగే దాకా; అధివసేయం=నివసిస్తాను. యత్ర=ఏ పులినమందు (శ్రీరంగక్షేత్రమందు)

పుంసాం=జనుల యొక్క; శరీరే=దేహం; పరిణమతి=మార్పుచెందగా, (ఈ స్థూలశరీరం విడిచి, సూక్ష్మశరీరం దాల్చినప్పుడూ) నిగమగీతా=వేదాలచేత కీర్తింపబడిన; త్వం=నీవు; శాశ్వతం=శాశ్వతమైన; మౌళిరత్నం=శిరోభూషణంగా; అసి=ఉంటావో.

**తా॥** ఓ పాదుకాదేవీ! పునర్జన్మను లేకుండా చేసే కావేరీ సైకతప్రదేశమైన శ్రీరంగక్షేత్రమందు దేహత్యాగం చేసిన వారికి మోక్షం లభిస్తుంది. ముక్తపురుషుల శిరస్సుపైన వేదాలచే కీర్తింపబడిన నీవు శాశ్వతమైన ఆభరణంగా ఉంటావు.

వ్యాఖ్య :- శ్రీరంగంలో మరణించే వారికి నిత్యం పాదుకాకైంకర్యం చేసే లాభం కలుగుతుందని వర్ణితం.

పాదుకా సంచారప్రదేశం కావేరీ పులినం. అంటే, శ్రీరంగమనే దివ్యక్షేత్రం . అక్కడ నివసించే జనులకు మళ్ళీ గర్భవాసావస్థ ఉండదు. శ్రీరంగ మందు ప్రాకృత శరీరాన్ని విడిచిన వెంటనే అర్చిరాదిమార్గంలో పయనించే సూక్ష్మశరీరానికీ, పరమపదంలో పొందే అప్రాకృత శరీరానికీ, పాదుకాదేవి శిరోభూషణమై సర్వదాప్రకాశిస్తుంది. కాబట్టి, పాదుకాసేవ శాశ్వతంగా లభించడం కోసం, తనువును త్యజించేదాకా సర్వకర్మపాశాలను తెగగోసే శ్రీరంగవాసాన్ని అపేక్షిస్తూ కవికేసరి ప్రార్థిస్తున్నాడు. కావ్యలింగాలంకారం. మాలినీవత్తం.

*995. బహువిధ పురుషార్థగ్రామసీమాంతరేఖాం*
*హరిచరణ సరోజన్యాస ధన్యా మనన్యః।*
*భరత సమయసిద్ధాం పాదుకే! భావయం స్త్వాం*
*శతమిహ శరదస్తే శ్రావయేయం సమృద్ధిమ్॥-25.*

**అర్థం:-** హేపాదుకే=ఓ పాదుకాదేవి! బహువిధ పురుషార్థగ్రామసీమ+అంత రేఖాం=పలురకాలైన, జీవులు కోరే ధర్మాది ఫలాల సముదాయానికి పరమావధిగా ఉన్న; హరిచరణసరోజన్యాసధన్యాం=భగవత్పాదకమలాల యందుండడం చేత ధన్యవైన; త్వాం=నిన్ను; అనన్యః=ఇతర విషయాల మీద తగులం లేనివాడనై; భావయన్=ధ్యానంచేస్తూ; ఇహ=ఈ శ్రీరంగమందు; శతం=నూఱు, శరదః=ఏండ్లు, తే=నీ యొక్క; సమృద్ధిం=వైభవాన్ని;- బహువిధ పురుష+అర్థ, గ్రామ, సీమాంతరేఖాం=అనేక విధాలుగా ఉన్న, జనులు, సంపదలు, గ్రామాలు, పొలిమేరల యందలి వనపంక్తులుగల; హరిచరణ సరోజన్యాస ధన్యాం=త్రివిక్రముని పాదారవిందాల నిక్షేపంచేత భాగ్యం కలిగియున్న; ఇహ=ఈ భూమండలానికి (జనులకు); శ్రావయేయం=వినిపిస్తాను.

**తా॥** ఓ పాదుకాదేవీ! వివిధ పురుషార్థాల సముదాయానికి ఉత్కృష్టఫలరూపమైన, భగవచ్చరణారవిందాలచేరికతో ధన్యవైన, భరతుని ప్రపత్తిచేత పొందబడిన నిన్ను ఇతర విషయాసక్తుడను కాని నేను ధ్యానిస్తూ, ఈ శ్రీరంగమందే నూరేండ్లు నిండేదాకా నీ మహిమను;-అనేక జనులు, సంపదలు, గ్రామాలు, సీమాంతమందు క్రిక్కిరిసిన వనాలు గల, త్రివిక్రముని చరణకమలాల నిక్షేపభాగ్యం గల ఈ భూమండలానికి వినిపిస్తాను.

వ్యాఖ్య :- ఆయువు ముగిసేదాకా పాదుకామహిమను ప్రచారంచేసే వేడుక.

భగవత్పాదుక కంటె తర్వాత ప్రాప్యమన్నది మరొక్కటి లేదు. ధర్మార్థకామమోక్షములనే చతుర్విధ పురుషార్థాలలో భగవత్పాద పద్మసంబంధంచేత పరమపురుషార్థ రూపయైశోభించే ధన్యురాలు పాదుకాదేవి. ధనమంటే పుణ్యం. (ధనం అస్యాఃఅస్తి ఇతి=ధన్యా) "ధనగణం లబ్ధా" (అష్టా.4.484) 'ధన' శబ్దానికి 'యత్' ప్రత్యయం వల్ల 'ధన్యా' అనే రూపమేర్పడింది. "సుకృతీ పుణ్యవాన్ ధన్యః" (అమరం) "యత్తత్ప్రియం తదిహపుణ్యమపుణ్యమన్యత్" ఆపుణ్యమేమిటి? అంటే, భగవంతునికి తృప్తి కలిగించే కైంకర్యమే. భగవత్కైం కర్యమేధనం, గొప్పసంపద అన్నారు, ఆచార్యులు. కైంకర్యలక్ష్మిని కలగిన వారందఱు ధన్యులే కదా! "నమ్మాల్పోత్తప్పుత్తెతరుమ్ పుణ్ణియన్" భక్తులచే స్తుతింపబడి పురుషార్థ ప్రదాతయైన పుణ్యాత్ముడు భగవానుడే, అని శ్రీ గోదాదేవిసూక్తి "పుణ్యానామపి పుణ్యోఽసౌ" అన్నట్లు సాక్షాత్తు పుణ్యమే భగవానుడు. ఆ భగవంతుని సంచారం తన అధీనంలోనే ఉండడం వల్ల పాదుకాదేవి ధన్యురాలు.

శరణాగతి చేసి పాదుకలను పొంది, అనన్యభక్తితో భరతుడు ఆరాధించడం వల్ల పాదుకావైభవం ప్రపంచానికి తెలిసిందికదా! పాదుకా విశేషణాల సామ్యంవల్ల భూమి మహిమకూడా ధ్వనించడం సమాసోక్తి లక్షణం.

అనేక జనులతోనూ, సంపదలతోనూ, పల్లెలు పట్టణాలతోనూ, సీమాంతమందలి సాంద్రవనాలతోనూ శోభించే భూమి, త్రివిక్రమావతారంలో "ఇదం విష్ణుర్వి చక్రమే త్రేధానిదధేపదమ్" అని శ్రుతిబోధించేరీతిగా, భగవత్పాదక్రమం చేత ఎత్తు పల్లాలభేదం లేకుండా అంతట ఆక్రమింపబడిన భాగ్యం కలది కదా!

ఉత్కృష్ట ఫలరూపయైన పాదుకాదేవిని ఉపాసిస్తూ, శ్రీరంగక్షేత్రంలో నివసిస్తూ, నూరేండ్లు నిండేదాకా సమస్త భూమండలమంతటా పాదుకామాహాత్మ్యాన్ని ప్రచారం చేయడమూ పరమపురుషార్థమే. వాస్తవంగా వేదాంతదేశికులు శతవర్షజీవులుకదా! అక్కడక్కడ సంచరిస్తూ "పాదుకాసహస్ర" ప్రచారంచేసినా, శ్రీరంగధాముని దివ్యసీమలోనే నూరేండ్లు నిండాలని దేశికుల ఆశయం.

శీర్యతే (వయఃప్రాణినాం) ఇతి=శరత్. ప్రాణులవయస్సును జీర్ణింపచేసే కాలమానం సంవత్సరం అని అర్థం. "సంవత్సరోవత్సరోఽబ్దోహాయనోఽస్త్రీ శరత్సమాః" (అమరం)

"శ్రీరంగే శరదఃశతం తతఇతః పశ్యేమ లక్ష్మీసఖమ్" (పూ.శ74) పాదపీఠం మొదలుకొని కిరీటం వరకు శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహాన్ని వందసంవత్సరాలు శ్రీరంగంలోనూ, అక్కడ ఇక్కడ, అంతట నిత్యం సేవించాలని శ్రీపరాశరభట్టర్ "శ్రీరంగరాజస్తవం" చేశారు. "పశ్యేమశరదఃశతమ్" అన్నది వేదవాణి.

శ్రీరంగనాథుని "పాదుకాసహస్రం" వినడమూ, వినిపించడమూ ముక్తిదాయకమే. ప్రేయోఽలంకారం. మాలినీవృత్తం.

**996.** *తిలకయసి శిరోమేశౌరి పాదావని! త్వం*
*భజసి మనసి నిత్యం భూమికాం భావనాఖ్యామ్।*
*వచసిచవిభవైః స్వైర్వ్యక్తి మిత్థం ప్రయాతా*
*తదిహ పరిణతం మే తాదృశం భాగధేయమ్॥-26*

**అర్థం:-** హే శౌరి పాదావని=శ్రీకృష్ణుని పాదుకా! త్వం=నీవు; మే=నా యొక్క; శిరః=శిరస్సును; తిలకయసి=తిలక యుక్తంగా చేస్తున్నావు. మనసి=చిత్తమందు; నిత్యం=ఎల్లప్పుడు; భావనా+ఆఖ్యాం=ధ్యానం అనే పేరుగల; భూమికాం= రూపాన్ని; భజసి=పొందుతున్నావు. స్వైః=స్వీయమైన; విభవైః=విభూతులతో; వచసి=వాక్కునందు; ఇత్థం=ఈ విధంగా (పాదుకాసహస్రస్తోత్రరూపంగా); వ్యక్తిం=ప్రకాశాన్ని; ప్రయాతా, చ=పొందినావు కూడా. తత్=అందువల్ల; ఇహ=ఇక్కడ (శ్రీరంగమందు పాదుకావిషయమై) మే=నాకు; తాదృశం=పూర్ణప్రపదనరూపమైన; భాగధేయం=భాగ్యం; పరిణతం=ఫలోన్ముఖమయింది.

**తా॥** ఓ శౌరి పాదుకా! నీవు నా శిరస్సును అలంకరిస్తున్నావు. మనస్సులో అనుభవప్రకర్షచేత కలిగిన దృఢ సంస్కారమనే రూపంతో వెలసియున్నావు. నీ గుణవిభూతులతో కూడా వాక్కునందు ఈ స్తోత్ర (రూప)ంగా ప్రకటితమయ్యావు. కాబట్టి, నీ విషయమై ఇక్కడనే పరమప్రాప్యమైన భాగ్యం ఫలించింది.

వ్యాఖ్య :- పాదుకా సంబంధంవల్ల కరణత్రయం సఫలమయిందని వర్ణితం.

నిత్యం పాదుకలను కిరీటంగా ధరించడం వల్ల శిరఃప్రధానమైనదేహానికీ; సర్వదా ధ్యానమగ్నమైనందువల్ల మనస్సుకూ; గుణవిభూతులతో, వేయిశ్లోకాలతో-పాదుకామూర్తిని స్తుతించడం వల్ల వాక్కునకూ పరమప్రాప్యమైన-పూర్ణప్రపదన రూపమైన-ఫలం లభిస్తున్నదన్నారు.

వాఙ్మనఃకాయాలను త్రికరణాలంటారు. ఈకరణత్రయం ఋజువుగా ప్రవర్తిస్తే (ఋజువే) ఆర్జవమనే గుణం శోభిస్తుంది.

"వచస్యేకం మనస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్" అన్నారు విజ్ఞులు. ప్రపత్తిచేసే విధానం ఇలా ఉంటుంది.

"వాచానమ ఇతి ప్రోచ్యవపుషా మనసాచయత్.

తన్నమః పూర్ణముద్దిష్టం" అన్నట్లు.

నాలుక చేత 'నమః' అని పలుకాలి. దేహాన్ని కట్టెలాగా-ఉరమూ, శిరమూ నేలనుతాకే రీతిగా-పడవేయాలి. ధ్యేయమూర్తిని మనస్సులో అనుభవిస్తుండాలి. ఇది పూర్ణప్రణామ లక్షణం.

"సంకల్పచింతామణయః ప్రణామాః"

సంసారమందు విరక్తినీ, స్వామి యందు రక్తినీ కలిగించడమేకాక, సర్వపాపాలను ధ్వంసంచేసే సర్వేశ్వరుని కృపను వర్షింపచేసేది ప్రణామమేకదా! పాదుకావిషయమై కరణత్రయం వల్ల పూర్ణప్రపదన రూపమైన ఫలం

లభిస్తుంది. వసిష్ఠ వాల్మీకి భరతాదులూ, పరమ పదంలోని నిత్య, ముక్తాత్మలూ పొందిన, పొందుతున్న భాగ్యంతో సమానమైన భాగ్యాన్ని శ్రీరంగమందే పొందుతున్న ఆనందాన్ని దేశికులు వెల్లడించారు. అనుమానాలంకారం. మాలినీవృత్తం.

*997. అజనిషి చిరమాదౌ హంత! దేహేంద్రియాది*
*స్తదను తదధిక స్సన్నీశ్వరోఽహంబభూవ।*
*అథ భగవతఏవాభూవ మర్థాదిదానీం*
*తవ పునరహమాసం పాదుకే! ధన్యజన్మా॥-27.*

**అర్థం:-** హే పాదుకే=ఓపాదుకాదేవీ! ఆదౌ=మొదట; చిరం=చాలాకాలం; దేహ+ఇంద్రియ+అదిః=దేహం, ఇంద్రియాలు మొదలైనవి కలవాడనై; అహం=నేను; అజనిషి=(బుద్ధి) కలిగిఉంటిని. హంత=అయ్యో!తదను=ఆ తర్వాత; తత్+అధికఃసన్=దేహేంద్రియప్రాణాల కంటే వేరుగాఉన్న వాడనై; ఈశ్వరః=స్వతంత్రపురుషుడనై; బభూవ= ఉంటిని. అథ=తర్వాత భగవతః; ఏవ=భగవంతునికే; అభూవం=ఉంటిని. ఇదానీం, పునః=ఇప్పుడు మాత్రం; ధన్యజన్మా=ధన్యమైన జన్మకలిగిన; అహం=నేను; అర్థాత్=యథార్థంగా; తవ=నీకే; (నీవాడనై); ఆసం=ఉంటిని.

**అర్థం:-** ఓపాదుకాదేవీ! మొదట చాలకాలందాకా దేహేంద్రియాదులే 'ఆత్మ' అనే భ్రాంతి కలిగి ఉన్నాను. తర్వాత దేహేంద్రియ ప్రాణులకంటె వేరైన ఆత్మయే పరమాత్మ అనే బుద్ధి నాకు ఉండింది. పిమ్మట భగవంతునికే దాసుడను అనుకొన్నాను. ఇప్పుడు మాత్రం నీకు దాసుడనయ్యాను. కాబట్టి, నా జన్మధన్యమయింది.

వ్యాఖ్యం :- భగవద్భాగవత దాస్యమే పరమప్రాప్యమని వర్ణితం.

సంసారం అనాది. మనఃప్రభృతీంద్రియాలతో కూడిన దేహమే ఆత్మఅనే బుద్ధికలిగి ఉండడం చార్వాక లక్షణం. జ్ఞానమే ఆత్మఅనడం బౌద్ధుల తత్వం. వేదశాస్త్రజ్ఞానం కలిగిన తర్వాత దేహమే ఆత్మ, జ్ఞానమే ఆత్మ అనే భ్రాంతి పోయింది.

"ఈశ్వరోఽహ మహంభోగీ" నేనే ఈశ్వరుడను. అంటే, "జీవుడే దేవుడు" అనే బుద్ధితో స్వతంత్రంగా ప్రవర్తించడం అద్వైత లక్షణం. (హన్త) అయ్యో! ఇలా ప్రవర్తించడం విచారకరమని ప్రకటితం

భగవత్కృపాధీనుడైన సదాచార్యుణ్ని సమాశ్రయించడం వల్ల వేదాంత శాస్త్రజ్ఞానం కలిగిన తర్వాత 'జీవుడు దేవునికే దాసుడు' అనే జ్ఞానం కలుగుతుంది.

"దాసభూతాః స్వతః సర్వేహ్యాత్మానః పరమాత్మనః"

తచ్ఛేషిత్వమే-అంటే, నాకు సేవ్యుడు భగవంతుడే అన్న భావమే-కాక, 'తదీయశేషిత్వం'- భగవంతుని భక్తులూ సేవ్యులే; భాగవతోత్తములకు కూడా నేను దాసుడను-అన్నభావం జీవులకు కల్గడం విశిష్టాద్వైత సంప్రదాయ పరిజ్ఞానం.

"న్యగ్రోధ బీజేవటవత్, ప్రణవే శబ్దజాలవత్।
సిద్ధే తదీయ శేషిత్వే, సర్వార్థాః సంభవంతి హి॥"

చిన్న మఱ్ఱివిత్తులో వేరు. కాండం, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పండ్లు కలిగియుండే-మహావృక్షమయ్యే-శక్తి అంతర్భవించి ఉంటుందికదా! అలాగే ఓం కారంలో శబ్దరాశి అంతా ఇమిడి ఉంటుంది. అదేరీతిగా, 'తదీయులు' అంటే భగవత్సంబంధులైన భక్తులు 'నేను సేవింపదగిన స్వాములు' అనే భావన సిద్ధిస్తే, ఈ భావనలో సకల పురుషార్థాలు ఇమిడి ఉన్నాయి.

భగవంతుడు దాసులను నిగ్రహించనూ కలడు. భాగవతోత్తములు మాత్రం అనుగ్రహైకశీలురుకదా!

భగవంతుని యొక్క దాసుని స్వరూపం భాగవతదాస్య పర్యంతం శోభించడమే తిరుమంత్ర సారార్థం. కాబట్టి భగవత్పాదుకాదాస్యం వల్ల తన జన్మ ధన్యమయిందని దేశికులు ఆనందించారు.

పూర్వ పూర్వధర్మ పరిత్యాగం చేత ధర్మాంతరసంబంధాన్ని వర్ణించడం వల్ల, పర్యాయాలంకారం. ఉత్తరోత్తరంగా ఉత్కర్షను వర్ణించడం వల్ల, సారాలంకారం. ఏకవాచకానుప్రవేశం వల్ల, పర్యాయ, సారాల సంకరాలంకారం, మాలినీవృత్తం.

***998.*** *త్వయ్యాయత్తౌ భగవతి! శిలాభస్మనోః ప్రాణదానా*
*దాస్త్రీబాలం ప్రథిత విభవౌ పాదపద్మౌమురారేః।*
*తామేవాహం శిరసినిహితా మద్యపశ్యామి దైవా*
*దాత్మాధారాం జనని! భవతీ మాత్మలాభప్రసూతిమ్॥-28*

**అర్థం:-** హే భగవతి! జనని=కల్యాణ గుణపూర్ణవైన ఓ అమ్మా! శిలాభస్మనోః=రాతికి, బూడిదకు; ప్రాణదానాత్=ప్రాణాన్ని ధారవోసి నందువల్ల; ఆ స్త్రీ బాలం=స్త్రీలు మొదల్కొని బాలుర వరకు; ప్రథిత విభవౌ=ప్రసిద్ధమహిమగల; మురారేః=భగవంతుని యొక్క; పాదపద్మౌ=పద్మ సదృశ పాదాలు; త్వయి= నీయందు; ఆయత్తౌ=అధీనమయ్యాయి. ఆత్మ+ఆధారాం=నీకు నీవే ఆధారవైయున్న; ఆత్మలాభప్రసూతిం=స్వస్వరూపం పొందడానికి-మోక్షానికి కారణమైన; తాం=అప్రసిద్ధమైన; భవతీం, ఏవ=నిన్నే; అహం=నేను; దైవాత్=భాగ్యం వల్ల; అద్య=ఇప్పుడు; శిరసి=(నా) తలపైన; నిహితాం=ఉంచబడినదానిగా; పశ్యామి=చూస్తున్నాను.

**తా॥** ఓ జననీ!భగవతీ! పాదుకా! రాయియైన అహల్యకూ, భస్మీభూతుడైన పరీక్షిన్మహారాజుకూ జీవనమీయడం వల్ల, పడతులు మొదల్కొని పసిపిల్లల వరకు ప్రసిద్ధమైన మహిమ కలిగిన భగవచ్చరణ కమలాలు నీకు వశమై ప్రవర్తించేవి. భగవత్పాద పద్మాలకే ఆధారంగా ఉంటూ, వేరే ఆధారంలేని, ఆత్మస్వరూపావిర్భావానికి హేతువైన, జీవునియత్నం చేత పొందలేని నిన్ను ఇప్పుడు నా శిరోభూషణంగా సేవించడం అదృష్టం.

వ్యాఖ్య:- వ్యపగతప్రాణాత్మ సంజీవని పాదుక, శిరస్సునలంకరించడం మహా భాగ్యమని ప్రశంసితం.

జడపదార్థాలకు (చైతన్యం కల్పించే) జీవనదానం చేసిన మహిమ పాదుకాదేవిది, అని ఎలా తెలిసింది?

ఒకరి అధీనంలో ఉండే వస్తువు యొక్క మహాత్మ్యాన్ని బట్టి, ఆ వ్యక్తి మాహాత్మ్యం తెలియడంలో ఆశ్చర్యమేముంది? శ్రీరామునిపాదధూళి సోకిన శిల, అహల్యగామారి గౌతమ మహర్షికి యథాపూర్వం ధర్మపత్ని అయింది. అభిమన్యుని పత్నియైన ఉత్తర గర్భంలో ఉన్న పిండానికి అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రం తగిలితే, అదిభస్మమైంది. ఉత్తరమొరవిన్న శ్రీకృష్ణుడు ఆభస్మాన్ని బాలునిగా మార్చాడు. ఆబాలుడే పరీక్షిత్తు.

"పరాఽస్యశక్తి ర్వివిధైవశ్రూయతే, స్వాభావికీజ్ఞాన బలక్రియాచ" (శ్వే.ఉప.) అనే శ్రుతిరీత్యా, భగవంతునికి జ్ఞానశక్త్యాది గుణాలన్నీ స్వాభావికాలే కదా! కాబట్టి ఆయన సంకల్పించిన కార్యాన్ని నిరాఘాటంగా నిర్వర్తిస్తాడు. ఈ జీవనదానం పరమపదనాథుడు చేసిందికాదు. మాయామానుష విగ్రహుడైన శ్రీరాముడూ, లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడూ చేసిన అతిమానుష దివ్య-చేష్టలు కాబట్టి సజాతీయుడై వచ్చి చేసిన భగవంతుని మహిమ ఆస్త్రీబాలం ప్రసిద్ధమయింది. అయితే, ఇది పాదుకా మహిమ అనడం ఎందువల్ల?

"స్రగ్వస్త్రాభరణైర్యుక్తం స్వానురూపైరనూపమైః।
చిన్మయైః స్వప్రకాశైశ్చ స్వాన్యోన్యరుచిరంజకైః" (పారమేశ్వరసంహిత 10-6)

'భగవంతుడు ధరించే కట్టుపుట్టాలూ, పూలమాలికలూ, పాదరక్షలూ, ఆభరణాలూ, అన్ని జ్ఞానానందమయమైన, స్వయం ప్రకాశం కలిగిన జీవకోటిలో చేరినవే' అని శాస్త్రం వక్కాణించింది.

భూమండలంలో సంచరింపగోరే భగవంతుని పాదపద్మాలను తనమీద వహించి, సర్వదా రక్షిస్తూ, అవసరమనుకొన్న చోటికి భగవంతుణ్ని తీసుకొనిపోయి. అచేతన పదార్థాలకు కూడా ఆత్మస్వరూపాన్ని ఆవిర్భవింపజేసే మాహాత్మ్యం కలది పాదుకాదేవి.

ఆశ్రితులయందు ఎన్ని దోషాలున్నా, వాటిని భోగ్యమైన ఉపహారంగా స్వీకరించే వాత్సల్యగుణ పూర్తి కలగిన పాదుకాదేవి వాస్తవంగా 'జనని'యే

మన ప్రయత్నం చేత భగవత్పాద పద్మాల వద్దకు చేరలేము. 'స్వామీ! రక్షించు' మని ప్రార్థించే సాపరాధులకు శిక్షారూపమైన దుఃఖాన్ని అనుభవింప జేస్తున్న భగవంతుణ్ని తన పురుషకారంతో ప్రసన్నుని చేసి, భగవంతుని సహజకృపా ప్రవాహాన్ని ఆశ్రితులమీద ప్రసరింపజేసి, వారి ఆత్మలాభానికి- మోక్షానికి-కూడా కారణభూతురాలు పాదుకాదేవి. ఆత్మలాభప్రసూతిమ్ :- శ్రీమద్వేదాన్త దేశికుల వారు ప్రతిజ్ఞ చేసిన రీతిగా 'పాదుకా సహస్ర' గ్రంథాన్ని పూర్తిచేసి పరిషత్తులో వినిపించగా శ్రీరంగనాథుడానందించాడు. భగవదనుగ్రహాన్ని ప్రదర్శించడానికి దేశికుల శిరస్సున పరివట్టంకట్టి, శ్రీ శఠారిని ప్రసాదించి గౌరవించడం వల్ల 'మేము పాదుకాదాసుల' మనే ఆత్మస్వరూప జ్ఞానానికి కారణమయింది పాదుకాదేవి. శేషత్వమే ఆత్మస్వరూపం కదా!

ప్రాప్యమైన పాదుక అప్రయత్నంగా లభించడం వల్ల సమాధ్యలంకారం మందాక్రాంతా వృత్తం.

*999. కథంకారం లక్ష్మీకరకమల యోగ్యం నిజపదం*
*నిదధ్యాద్రంగేశః కులిశ కఠినేఽస్మిన్మనసినః।*
*నచేదేవం మధ్యే విశతి దయయాదేవి! భవతీ*
*నిజాక్రాంతిక్షుణ్ణస్మరశరశిఖా కంటక తతిః॥-29*

**అర్థం:-** హేదేవి=ఓ పాదుకాదేవీ! నిజాక్రాంతి-తతిః। నిజ=స్వీయ; ఆక్రాంతి=ఆక్రమణచేత; క్షుణ్ణ=పొడిగా చేయబడిన; స్మరశర=మన్మథుని బాణాల యొక్క; శిఖా=మొనలు అనే; కంటక=ముండ్ల యొక్క; తతిః= సముదాయం గల, భవతీ=నీవు; దయయా=కృపతో; మధ్యే=నడుమ; ఏవం=ఇట్లు (అనుభవిస్తున్న విధంగా); న, విశతి, చేత్=చేరకపోతే; రంగేశః=శ్రీరంగ ప్రభువు; లక్ష్మీకరకమల యోగ్యం=లక్ష్మియొక్క తామరపూలలాంటి చేతులచే (స్పృశింప) తగినట్టి; నిజపదం=తన పాదాన్ని; కులిశకఠినే=వజ్రాయుధంలాగా కఠినమైన; అస్మిన్=ఈ; నః=మా యొక్క; మనసి=మనస్సు నందు; కథంకారం=ఏవిధంగా; నిదధ్యాత్=ఉంచేవాడవుతాడు? ఏవిధంగానో ఉంచేవాడే అవుతాడు.

**తా॥** ఓ పాదుకాదేవీ! మన్మథబాణాగ్రాలనే ముండ్లమీద అడుగుపెట్టివాటిని పొడిపొడిగాచేసే నీవు, దయతో ఇలాగా నా మనస్సుకూ, భగవచ్చరణాలకూ మధ్య ప్రవేశించకపోతే శ్రీరంగనాథుడు లక్ష్మీదేవి యొక్క కరకమలాలచే స్పృశింపయోగ్యమైన తనపాదాలను వజ్రాయుధంలాగా మొరటైన ఈ నామనస్సునందు ఎలా మోపేవాడు?

వ్యాఖ్య :- పాదుకానుగ్రహం వల్ల భగవంతుడు మనస్సులో నిలిచే వర్ణన.

లక్ష్మీదేవి తామరపూవులాగా చాలాకోమలమైన శరీరం కలది

"పాదారుంతుదమేవ పంకజరజశ్చేటీభృశాలోకితైః
అంగమ్లాని రథాంబ! సాహసవిధౌలీలారవిందగ్రహః।" (శ్రీగుణరత్నకోశం-42)

'పద్మవాసినియైన లక్ష్మీదేవి పాదాలకు పద్మపరాగం సోకుతుంటే ఎంతో బాధకలుగుతుంది. ఆమె శరీరం చెలికత్తెల చూపుల చేత వాడిపోతుంది. ఎప్పుడైనా విలాసంగా కమలపుష్పాన్ని చేతితోపట్టుకొంటే, అది సాహసకార్యమే' అన్నారు శ్రీ పరాశరభట్టర్

"తామరలన్న నీ వలపుదారికి దారియుతెన్నులేదు, పొం
దామర యామెమోము, తెలిదామరయాయమకన్నుదోయి, చెం
దామర యామెకేలుగవ, తామరలన్ మఱలన్ జయించుకాం
తామరవాహినీ వికచ తామరసంబులు నామెకన్ జిగుల్"

అని సీతాదేవిని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు (కవి సమ్రాట్) వర్ణించారు.

"కరసరసిజైర్లాలితం రంగభర్తుః పాదాంభోజమ్" (భగవద్ధ్యానసోపానం.2)

లక్ష్మీదేవి తన పాణి పద్మాలచేత శ్రీరంగనాథుని పాదపద్మాలను సుతిమెత్తగా నిమురుతూ ఒత్తుతుంది" అన్నారు వేదాన్త దేశికులు.

"కమనీయ రూపరేఖా, రమణీయత జాలనొప్పరమణీమణి య

క్కమలాలయ తన మృదుకర కమలంబుల విభుని పాదకమలములొత్తున్" (భక్తపోతన భాగ-2 స్కం.232)

"మలర్మగళ్ కైవరుట్ మలర్ పొనిల్కిలన్లన" (ఆళ్వార్ల శ్రీసూక్తి)

సుమవాసిని లలితంగా పాదసంవాహనంచేసినా, భగవత్పాదారవిందాలు కందిపోతుంటాయట.

భగవంతుని చరణకమలాలు ఇంత మృదువైనవని తెలిసి, పాదుకాదేవి వాటిని చాలా జాగ్రత్తగా కాపాడుతుంటుంది.

పాదుకల క్రింద (అడుగున) బడిన ముండ్లు ముఖభంగంతో తలెత్తుకోలేవు. ఈ కంటకాల (ముండ్ల) కంటె కడువాడి, వేడికలవి మన్మథుని బాణాగ్రాలు. మన్మథుని బాణాలన్నీ-అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం (5)- అతి సుకుమార కుసుమాలు. అయినా, ఈ పూలబాణాల మొనలు కసుక్కున మనస్సులోకి నాటుకపోయి కాయాన్ని గాయం చేస్తాయి. చిత్తం చెత్త అవుతంది. రాగాది విషయాలను స్మరించినా కొద్దీ, అంగాలన్నీ అనంగమయమవుతాయి.

కులీన్శ్యతి ఇతి=కులిశం. పర్వతాల రెక్కలను ఛేదించిన వజ్రాయుధం. కులిశంలాగా కర్కశమైన మనస్సు భగవద్విషయానికి దుర్భేద్యమవుతుంది.

ఇంత కఠినాతికఠినమైన మనఃపదం అంతమృదులాతిమృదులమైన భగవత్పాదాలకు ఆస్పద మవుతుందా? కాదు.

"రాగాదిదూషితే చిత్తే నాస్పదీ మధుసూదనః"

రాగం, ద్వేషం, అవిద్య, అస్మిత, అభినివేశం అనే క్లేశపంచకయుక్తమైన మనస్సునందు భగవంతుడు నివసించడానికి ఇష్టపడడని శాస్త్రం.

మరి, సర్వభూతనివాసుడు కాబట్టి 'వాసుదేవుడు' అనే పేరుందికదా? అంటే, నిజమే. భగవంతుడు సర్వాంతర్యామి. అయినా,

"భగవచ్చరణ ద్వంద్వే భక్తిర్యేషాంనవిద్యతే।
తేషాం హృదిస్థితో దేవః, కంటకాగ్రఇవస్థితః॥

భగవత్పాద పద్మాలను భజించని వ్యక్తుల మనస్సున భగవంతుడు కసుక్కున కుచ్చుకపోయి బాధించే

ముండ్లకొసలమీద నిలుచున్నట్లు ఉంటాడని బ్రహ్మాండ పురాణసూక్తి. ఇష్టంగాకాక అతికష్టంగా ఉంటాడనే కదా! కాబట్టి, స్మరశరశిఖలు అనే కంటకతతిని తుత్తునియలు, నుగ్గు నుగ్గు చేసే పాదుక, ఇటు కఠినమైన మనస్సుకూ, అటుమృదులమైన భగవత్పాదానికీ నడుమ చేరి, శ్రీరంగప్రభువుకు అంగరంగ భోగవైభవాన్ని సమకూరుస్తుంది. చిత్తవృత్తిని ప్రవృత్తి నుంచి నివృత్తికి మరలించి జీవకోటిని తరింపజేసే దయామయి పాదుకాదేవి.

పాదుక మధ్యన లేకుంటే భగవత్పదప్రాప్తి అసంభవమనడం సంభావనాలంకారం. ఇలాగా ఉక్తి వైచిత్రితో ఉపాయ పూర్తి రూపమైన ఫలాన్ని సుశ్లోకించడం కవికేసరికేసరి. శిఖరిణీవృత్తం.

*1000. క్రీడాలౌల్యం కిమపిసమయే పాదుకే! వర్జయంతీ*
*నిర్వేశం స్వం దిశసి భవతీనాథయోః శ్రీధరణ్యోః।*
*మామప్యేవం జనయ మధుజిత్పాదయోరంతరంగం*
*రంగం యాఽసౌ జనయసి గుణైర్భారతీనృత్త రంగమ్ ॥-30.*

**అర్థం:-** హే పాదుకే=ఓ పాదుకాదేవీ! సమయే=శ్రీభూదేవుల వంతు ఉన్న కాలాన; కిం, అపి=అనిర్వాచ్యమైన; క్రీడాలౌల్యం=ఉల్లాసంగా సంచరించే ఆసక్తిని; వర్జయంతీ=విడిచి పెట్టుకొంటూ; భవతీనాథయోః=నీవేదైవంగా కలిగిన; శ్రీధరణ్యోః=లక్ష్మీభూదేవులకు (ఇద్దరికి); స్వం=స్వీయ; నిర్వేశం=సుఖాన్ని; దిశసి=ఇస్తున్నావు. ఏవం=ఈ రీతిగా; మాం, అపి=నన్నుకూడా; మధుజిత్, పాదయోః=మధుసూదనుని పాదాలకు; అంతరంగం=దగ్గరి పరిచారకునిగా; జనయ=చేయుము, యా=ఏ; అసౌ=ఈ నీవు; రంగం=శ్రీరంగస్థలాన్ని; గుణైః=నీ గుణాల చేత; భారతీ నృత్తరంగం=సరస్వతీ నాట్యస్థలంగా; జనయసి=కల్పిస్తున్నావు.

**అర్థం:-** ఓ పాదుకాదేవీ! సముచిత సమయంలో ఇష్టమైన సంచారంచేసే ఆశను వదలుకొని నిన్నే (శేషి) దైవంగా భావించే శ్రీదేవికీ, భూదేవికీ నీ సౌఖ్యాన్ని కల్పిస్తున్నావు. ఈ విధంగానే నన్ను కూడా భగవచ్చరణాలకు సన్నిధి పరిచారకునిగా చేయుము. నీవు శ్రీరంగక్షేత్రాన్ని నీ వాత్సల్యాదిగుణాలచేత సరస్వతి నర్తించే రంగస్థలంగా చేస్తున్నావు.

వ్యాఖ్య :- పాదుకాదేవి యొక్క పరమౌదార్యాది గుణాలను కీర్తించే శ్లోకం.

పాదుకాదేవికి భగవత్పాద పద్మాలకు పరిచర్యచేసే యోగ్యత పుష్కలంగా ఉంది. భగవానుని సంకల్పానికి అనుగుణంగా సంచరించడం వల్ల పాదుకకు కలిగే ఆనందంకన్నా భగవంతునికి కలిగే ఆనందమే అప్రమేయం. శ్రీరంగనాథుని సంచారం వల్ల శ్రీదేవికీ, భూదేవికీ పతిపాదసేవ చేసే భాగ్యం లభించే సమయం చాలా తక్కువ అవతుంది. పాదుకాదేవియే తమకు ఆపాదసేవను ప్రసాదించే దైవమని నమ్ముతున్న శ్రీభూసతీమణుల కోసం, క్రీడాలౌల్యాన్ని త్యజించి. తనభోగసామ్యాన్ని వారికి అనుగ్రహిస్తుంది. శ్రీ భూసతులకు కల్పించినట్లే, సర్వాత్మనా దాసుడైన తనకు కూడా పాదుకా భోగసామ్యాన్ని కల్పించాలని దేశికులు పాదుకాదేవిని ప్రార్థించారు.

"మామప్యేవం జనయ మధుజిత్పాదయోరంతరంగం"

శ్రీ భూసతులకువలె, పాదుకాదేవ్యనుగ్రహం వల్ల భగవత్పాదసేవ చేసే యోగ్యత, అంటే ముక్తిరూపజన్మ-మోక్షం-తమకు లభిస్తుందనే అధ్యవసాయం కలవారు శ్రీ వేంకటనాథ గురుదేవులు.

నమ్మేవాడు జీవుడు. నమ్మబడేవాడు దేవుడు. ఎలాంటి దురవస్థలోనైనా ఆత్మకు రక్షకుడైన వాడు పరమాత్మడే. "నమ్బనైజ్ఞాలమ్ పడైత్త వనై"(తి.వా.మొళి. 3-7-8) విశ్వసృష్టిచేయువాడు విశ్వసనీయుడు అనే నమ్మాళ్వార్ల శ్రీసూక్తిని-

"నమ్బనై-నమ్బప్పడుమవనై. ఏదేనుమ్ దుర్దశైయిలుమ్ ఆత్మావుక్కుత్తఞ్జమానవనై" అని ఆచార్యులు వివరించారు కదా!

స్వార్థనిరపేక్షతో, ప్రాప్యప్రాపకాలు భగవంతుడే అని ఆయన మీద భారం ఉంచి, ఆయన పాదసన్నిధికిచేరి నిశ్చింతగా ఉండేవారే పరమప్రపన్నులు. అలాంటి పరమభక్త గణాన్ని చూచి "సమేప్రియః" "సమేయుక్తతమః" అని భగవానుడు ఎంతో అభిమానంతో ఆదరిస్తాడు.

"ఉనక్కేనామాల్ శెయ్వోమ్" (నీకోసమే మేంసేవచేస్తాం) అన్నారు శ్రీ ఆండాళమ్మవారు. "తనక్కేయాగ ఎనైక్కొళ్ళుమీదే" (నీకైంకర్యం కోసమే నన్ను నియమించుకొనుము) అన్నారు. నమ్మాళ్వార్లు.

పారతంత్ర్యనిష్ఠా గరిష్ఠులైనా సర్వం భగవదిచ్ఛకు విడిచి ఊరకుండరు. ప్రాప్యరుచి వారిని ఇలాగే ప్రార్థింపజేస్తుంది. కాబట్టి "మధుజిత్పాదయో రంతరంగం" అని ప్రాప్యమైన కైంకర్య ఫలం చెప్పబడింది. అంటే, శరణాగతి తత్వాన్ని ప్రతిపాదించే ద్వయమంత్రంలోని ఉత్తరవాక్యం వివరింపబడింది.

ఈ శ్లోకంతో సహస్ర సంఖ్య పూర్తిఅయింది.

శ్రీరంగక్షేత్రంలో భగవత్పాద విషయంగానూ, పాదుకా విషయంగానూ బహువిధప్రబంధాలను నిర్మించే నైపుణ్యం కలిగిన విద్వత్కవులు అనేకులున్నారు. ఈ విద్వద్గోష్ఠిలో పాదుకాస్వరూప రూపౌదార్యాది కల్యాణ గుణ విభూతులను ప్రకాశింపజేసే ఈ అద్భుతస్తోత్రాన్ని, సరస్వతీదేవి శ్రీరంగాన్ని నాట్యరంగంగా చేసుకొని వివిధ భంగిమలతో నర్తించినట్లు, పాదుకాదేవియే (ఆచార్య) తన ముఖంగా అవతరింపజేసిందన్నారు. వీటి కన్నిటికి శిఖరాయమానంగా పరమపురుషార్థాన్ని-పెరియపెరుమాళ్ తిరువడిగళ్ళ కైంకర్య రూపఫలాన్ని-పాదుకాదేవి కృపజేయగలదని అమోఘవిశ్వాసంతో విజ్ఞాపన చేశారు దేశికులు

"వ్యవసాయాదృతే బ్రహ్మ నా సాదయతితత్పరమ్" అన్నట్లు భగవత్ప్రాప్తికి ఆనుకూల్యసూచకమైన మహావిశ్వాస రూపమైన వ్యవసాయం అంటే స్థిర సంకల్పమే అమోఘసాధనం.

"త్వమే వో పాయభూతోమే భవేతి ప్రార్థనామతిః శరణా గతిః" అని కదా శరణాగతి లక్షణం. "స్వంనిర్వేశందిశసి-మామప్యేవంజనయ "అని శరణా గతిరూపసాధనమూ తెల్పబడింది. ఇలాగా ఈ శ్లోకం ద్వయమంత్రంలోని పూర్వోత్తర వాక్యాల అర్థమైన శరణాగతినీ, ఫలాన్నీ సమగ్రంగా వివరిస్తుంది.

స్వార్థత్యాగం, పరార్థప్రాపకం అనుసంధింపబడింది. ఇదొక అంతరంగతరంగం. శ్రీరంగం భగవంతుని క్రీడారంగం. శ్రీభూపిరాట్టుల భోగరంగం. భారతికి నృత్తరంగం. ఇందులో ఖ్యాతిలాభాది ఫలాంతరనైరాశ్యమూ వ్యంజితం.

ఉపమారూపకాలంకారాల సంసృష్టి. మందాక్రాంతావృత్తం.

*1001. ఇతిరంగధురీణ పాదుకే! త్వం*
*స్తుతి లక్ష్యేణ సహస్రశో విమృష్టా।*
*సఫలం మమజన్మతావదేత*
*ద్యదిహా శాస్య మతఃపరంకిమేతత్॥-31.*

**అర్థం:-** హేరంగధురీణ పాదుకే=ఓ శ్రీరంగనాథపాదుకా! త్వం=నీవు; ఇతి=ఈ రీతిగా; స్తుతి లక్ష్యేణ=స్తోత్రమనే వ్యాజంతో; సహస్రశః=వేయిసార్లు; విమృష్టా=కీర్తింపబడినావు. మమ=నా యొక్క; ఏతత్=ఈ; జన్మ=పుట్టుక; సఫలం, తావత్=సార్థకమే. ఇహ=ఈ జన్మలో; ఆశాస్యం=కోరదగింది; యత్=ఏదో; ఏతత్=ఇది; అతఃపరం=ఇంతకంటె వేరే; కిం=ఏది? (నకిం అపి=ఏదీలేదు)

**తా॥** ఓ రంగ ధురీణపాదుకా! ఈ విధంగా స్తోత్రమనే నెపంతో నిన్ను వేయిసార్లు కీర్తించడంవల్ల నా జన్మ సఫలమే అయింది. ఈ జన్మలో ఇంతకన్న వేరే కోరదగింది ఏమున్నది? ఏదీ లేదు అని తాత్పర్యం.

వ్యాఖ్య :- వేయి విధాలుగా పాదుకాదేవిని స్తుతించడమే జన్మసాఫల్యం.

రచింపబడిన ఇతర ప్రబంధాలకన్న ఔత్కృష్ట్యం, ఈ ప్రబంధానికి లేకున్నా కొరతలేదు. ఈ స్తోత్రరచనా వ్యాజంతో పాదుకామహిమను పలురకాలుగా ప్రశంసించడమే పరమ ప్రయోజనం. నిజంగా, పాదుకా కటాక్షపాత్రమైన జన్మకు పాదుకా ప్రభావాన్ని ప్రశంసించడం కన్న మించిన ప్రాప్యమేముంది?

"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే" (శ్రుతి)
నిత్యసూరులు కూడా వైకుంఠుణ్ని నిత్యం స్తోత్రంచేస్తూ, ప్రకాశిస్తూంటారు కదా!

"మమ ఏతత్ జన్మ సఫలంతావత్"- నా ఈజన్మసార్థకమే. "తావత్" పదానికి అవధారణార్థమూ చెప్పవచ్చును.

"యావత్తావచ్చసాకల్యేఽవధౌమానేఽవధారణే" (అమరం) వేరే ప్రార్థనీయం లేదని సమర్థించడం వల్ల, **వాక్యార్థ** హేతుక కావ్యలింగాలంకారం. వృత్తం ఔపచ్ఛందసికం.

*1002. మాతః! స్వరూపమివ రంగపతేర్నివిష్టం*
*వాచామసీమని పదావని!వైభవంతే।*
*మోహా దభిష్టుతవతో మమమందబుద్ధే*
*ర్బాలస్య సాహసమిదం దయయాసహేథాః॥-32.*

**అర్థం:-** హేమాతః=ఓ తల్లీ! పదావని=పాదుకాదేవీ! రంగపతేః=శ్రీ రంగరాజుయొక్క; స్వరూపం, ఇవ=స్వరూపం వలె; వాచాం=వాక్కులకు; అసీమని=అందని విషయమందు; నివిష్టం=ప్రవేశించిన; తే=నీ యొక్క; వైభవం=మహిమను; మోహాత్=అజ్ఞానం వల్ల; అభి+స్తుతవతః=స్తుతించిన; మందబుద్ధేః=అల్పబుద్ధిగల; బాలస్య=అజ్ఞుడనైన; మమ=నా యొక్క; ఇదం=ఈ; సాహసం=ఆలోచింపక చేసిన పనిని; దయయా=కృపచేత; సహేథాః=క్షమింపుము.

**తా:-** ఓ తల్లీ! పాదుకాదేవీ! శ్రీరంగనాథుని స్వరూపంలాగా వాక్కుల కందని, అపరిచ్ఛేద్య విషయమందు చేరిన నీ మహిమను అజ్ఞానం వల్ల స్తుతించిన అల్పబుద్ధిగల; అజ్ఞుడనైన నా యొక్క ఈ స్తుతిరూపమైన సాహసకృత్యాన్ని దయతో క్షమింపుము.

**వ్యాఖ్య :-** ఉపచార వ్యాజంతో చేసిన అపచారాన్ని క్షమించాలని పాదుకాదేవిని కవి ప్రార్థించే శ్లోకం.

శ్రీరంగనాథుని స్వరూప మెట్టిదో పాదుకా స్వరూపంకూడా గుణవిభూత్యాది విశిష్టమైనదే, ఈదేవి మహిమ కూడా మాటలకూ, మనస్సుకూ అందనిది; ఇప్పుడు, ఇక్కడ, ఇలాగా ఉంటుందని వర్ణింపనలవికానిది కదా! పాదుకాస్తోత్ర రచన వల్ల తన జన్మసఫలమైనది, వేరేకోరదగినదేమీ లేదని అనుసంధించగానే, దేశికులకు అవాఙ్మా నసగోచరమైన పాదుకామహిమ, తన బుద్ధిమాంద్యమూ స్మృతికి వచ్చినవి.

అజ్ఞాని తనఅల్పబుద్ధికి తోచినట్లు, అపరిమిత మాహాత్మ్యాన్ని స్తుతించడం సాహసకార్యమే అవుతుందన్నారు.

"అమ్మానాళిప్పిరా నవనెవ్విడత్తాన్? యానార్" (తి.వా.మొ. 5-1-7)

అని నమ్మాళ్వారన్నట్లు "ఉత్తమోత్తముడైన స్వామి ఎక్కడ? నేనెక్కడ? అనే భావమూ దేశికుల మనస్సున తగిలింది.

"ఉన్నైప్పుగళ్వెల్లామ్ పెరుమ్బాలుమ్ పట్టురైయాయ్ పుత్కొన్దేకాట్టుమాల్ పరంజోతీ" (తి.వా.మొ. 3-1-2) "ఓ పరంజ్యోతీ! నిన్ను స్తుతించడమంతా మనస్సుకు తోచినదే చెప్పడమైనందువల్ల అదిదోషాన్నే చూపుతుంది" అన్నారు కదా ఆళ్వార్లు.

"సోఅంగవేద, యదివానవేద" తన మహిమ తనకు తెలియునో, తెలియదో' అన్నంతగొప్పవాడు శ్రియఃపతి అన్నది వేదం. "తనక్కుమ్ తన్ తన్మైయఱివరియాన్' తన జ్ఞానానికే తాను అందనివాడు సర్వేశ్వరుడు" అన్నారు ఆళ్వార్లు.

సంసారగంధమేమాత్రమెరుగని నిత్యసూరులు ఆశపడేభగవత్సేవను నిత్య సంసారినైన నేను ఆశపడడం సాహసకార్యమే, "ధిగశుచి మవినీతం నిర్దయం మామలజ్జం, పరమ పురుష! యోహం యోగివర్యాగ్రగణ్యైః" అంటూతమను తామే నిందించుకొన్నారు శ్రీయామునాచార్యులు (స్తోత్రరత్నం 47)

"వాచో విడంబిత మిదం మమనీచవాచః,
క్షాంతిస్తుతే సవిషయా మమదుర్వచోభిః" (శ్రీవైకుంఠస్తవం-10)

" నీచవాక్కులు నా యీస్తుతి పురాణపురుషుల స్తుతికి హాస్యాస్పదమైన అనుకరణమే. నా దుర్వచనం నీక్షమాగుణానికి విషయమవుతుంది. బరువైన క్షమాగుణం దుర్వచనాన్ని అణచివేస్తుంది, క్షమిస్తుంది" అన్నారు శ్రీవత్సాంక మిశ్రులు.

"మణియనార్ కిడందవాత్తైమనత్తినాల్ నినైక్కలామే" (తిరుమాలై-21)

ఇంద్రనీలమణి లాగా ఉన్న శ్రీరంగనాథుడు శయనించియున్న సౌందర్యాన్ని ధ్యానించడానికిగానీ, కీర్తించడానికి గానీ నేనెంతటివాణ్ణి " అన్నారు శ్రీ విప్రనారాయణులు

"శ్రీరంగరాజ కమలా పదలాలితత్వం

యద్వాऽపరాధ్యతి మమస్తుతి సాహసేऽస్మిన్" (శ్రీరంగరాజస్తవం-17)

"లక్ష్మీశ్రీరంగనాథులచే లాలింపబడిన వాడనవడమే ఈ నా స్తుతి సాహస విషయమై అపరాధానికి కారణ మవుతున్నది" అన్నారు శ్రీపరాశభట్టరు. రాజపుత్రుడు కాబట్టి, శ్రీ పరాశరభట్టర్ వారికి అపరాధభయం లేదట.

ఇలాగా, తత్వజ్ఞానం కలిగి భక్తి పరిపాకం పొందినవారు కూడా ఒకప్పుడు, భగవన్మహిమను స్తుతించడానికి తాము అనర్హులని అనుసంధించారు. వాఙ్మానసాతీతమైన శ్రీరంగనాథపాదుకా మహిమను అత్యల్పమైన తమ వాక్కులతో సహస్రశః స్తుతించడం వల్ల అనుగ్రహాన్ని పొందడానికి బదులు ఆగ్రహానికి గురికావడం సంభవిస్తుందనుకొన్నారు దేశికులు. సాహసంతో చేసిన అపరాధాలనెన్నింటినో 'అపరాధగణైః అపూర్ణకుక్షిః" అన్నట్లు ఆహారంగా స్వీకరించినా కడుపునిండని ఆదయాదేవియే తననుకాపాడుతుందని విశ్వసించారు. కాబట్టి తెలియక చేసినస్తుతిరూపసాహస కృత్యాన్ని 'దయ' అనే మహాగుణంతో క్షమించ వలసిందని దేశికులు పాదుకాదేవిని ప్రార్థించారు. ఇది విద్వత్కవులైన ప్రపన్నుల సంప్రదాయం.

ప్రేయోऽలంకారం "స్వరూపమివ" అన్నచోట ఉపమాలంకారం.

పాదుకానుగ్రహం కోసం (క్షమించుమని) ప్రార్థిస్తూ, దానికి విరుద్ధమైన కోపప్రసక్తిని వర్ణించడం వల్ల విషమాలంకారం. వసంతతిలకావృత్తం.

*1003. యేనామ భక్తి నియతాః కవయోమదన్యే*
*మాతః! స్తువంతి మధుసూదన పాదుకే! త్వామ్।*
*లప్స్యే గుణాంశ వినివేశిత మానసానాం*
*తేషామహం సబహుమాన విలోకితాని॥-33.*

**అర్థం:-** హేమాతః, మధుసూదన పాదుకే= ఓ జననీ! మధుసూదనుని పాదుకా! భక్తి నియతాః=భక్తి చేత **కట్టుబడిన**; మత్+అన్యే=నాకంటె వైరైన; యే. నామ, కవయః=ఏ కవులైతే; త్వాం=నిన్ను; స్తువంతి=స్తుతిస్తున్నారో; **గుణ+అంశ**, వినివేశిత, మానసానాం=గుణాల భాగమందు ప్రవేశించిన మనస్సు (గుణ పక్షపాతం) కలిగిన; **తేషాం=వారి** యొక్క; సబహుమాన విలోకితాని=గౌరవంతో కూడిన కటాక్ష వీక్షణాలను; అహం=నేను; లప్స్యే=పొందగలను.

తా॥ ఓ తల్లీ! మధుసూదన పాదుకా! భక్తి నిష్ఠులైన, నాకంటె వేరేకవులెవరైతే నిన్ను స్తుతిస్తున్నారో, గుణాలున్న చోటనే మనసు పెట్టే వారి సాదర కటాక్ష సంవీక్షణాలను నేను పొందగలను.

వ్యాఖ్య :- పాదుక(ల)ను స్తుతించే ప్రతిభటకవులకూ ఈ కృతి శ్లాఘనీయమే, అని కవి ఆశంస.

ఈ శ్లోకంలో అనన్యభక్తులైన కొందరుకవులు కూడా 'పాదుకాస్తోత్రం' చేసినట్లు దేశికులు స్పష్టపరచారు. తాను రచించిన ఈ 'పాదుకాసహస్ర' మనే స్తోత్రప్రబంధాన్ని తనలాగా పాదుకాస్తుతిని రచించిన ఆ విద్వత్కవులు చూచి గుణదోషాలను ప్రకటిస్తారని విశ్వసించారు. పండితులకు దోషజ్ఞులని పేరు. శాస్త్రజ్ఞులైన విమర్శకులు పక్షపాత రహితులై కావ్యాన్ని పరిశీలించి అందలి గుణాలనూ, దోషాలనూ ప్రకటించడం వారి వివేచనాశక్తికి తార్కాణం. కావ్యనిర్మాణమందలి శ్రమకూడా వారికి బాగా తెలిసి ఉంటుంది.

"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్।
నహివంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్॥"

అధీతి, బోధ, ఆచరణ, ప్రచారాలనే విద్యకు గలనాలుగు దశలను నిర్వహించే విద్వాంసుడు పడేశ్రమ (మరొక) విద్వాంసునికే తెలుస్తుంది. మాతృదశను అనుభవించే గొప్ప ప్రసూతిబాధ గొడ్రాలుకు తెలియదుకదా! అని ఆర్యోక్తి.

భక్తితో పాదుకాస్తుతి చేసే-ప్రత్యర్థులైన-కవులు కూడా గుణగ్రహణ పారీణులై "వీరిస్తోత్రప్రబంధం గుణోత్తరం" అంటూ ప్రశంసిస్తారనీ, ఆదరపూర్వకమైన వారి కటాక్షం తన మీద ప్రసరిస్తుందనీ దేశికులు సవినయ ప్రకటన చేశారు. "గుణాః పూజాస్థానం" కదా!

పరమభాగవతోత్తములైన కవీశ్వరులు తనను సాదరంగా కటాక్షించడమే గొప్పఫలం. గుణగ్రాహ్యత్వం సబహుమానవిలోకన హేతువు అవడం వల్ల ఇది పదార్థహేతుక కావ్యలింగాలంకారం. వసన్తతిలక.

*1004. సంఘర్షయంతి హృదయా న్యసతాం గుణాంశే*
*సంతస్తు సంతమపి నప్రథయంతి దోషమ్।*
*తద్రంగనాథ చరణావని! తేస్తుతీనా*
*మేకా పరం సదసతో రిహసాక్షిణీ త్వమ్॥-34.*

**అర్థం:-** హే రంగనాథ చరణావని=ఓ రంగనాథ పాదుకా! అసతాం=ఆసుర ప్రవృత్తి కలవారి యొక్క; హృదయాని=హృదయాలు; గుణ+అంశే=గుణభాగమందు; సంఘర్షయంతి=ఘర్షణ పడుతాయి. (దోషాలను ప్రకటిస్తాయి.) సంతః, తు=మహాపురుషులు మాత్రం; సంతం,అపి=ఉన్నదాన్ని కూడా; దోషం=దోషాన్ని; న, ప్రథయంతి=వెల్లడించరు. తత్=ఇలాగా సందేహం ఉండడంవల్ల; ఇహ=ఇక్కడ; తే=నీయొక్క; స్తుతీనాం=స్తుతుల యొక్క; సత్+అసతోః=గుణదోషాలకు; త్వం=నీవు; ఏకా,పరం=ఒక్కతెవే; సాక్షిణీ=సాక్షీభూతవు.

తా॥ ఓ రంగరాజపాదుకా! దుష్టుల హృదయాలు గుణాల విషయంలో దోషాలను ప్రకటించడానికి సిద్ధపడుతాయి.

శిష్టులు మాత్రం ఉన్నదోషాలనూ ప్రకటించరు. ఇలాగా సందేహం ఉన్నందువల్ల , నీస్తుతుల గుణదోషాలకు నీవే అద్వితీయ సాక్షిణివి.

వ్యాఖ్య :- స్తోత్రమందలి గుణదోషతారతమ్యానికి పాదుకయే సాక్షిణి, అని విజ్ఞప్తి

గుణగ్రాహ్యులైన పాదుకా భక్తుల చల్లని కటాక్షం దేశికులతో పాటు కవన ప్రవృత్తి గల వ్యక్తులందరి యందూ ప్రసరిస్తుంది. ఇందులో విశేషమేముంది? కావ్యతారతమ్య విమర్శపట్ల "భాగవతాపచారం మనకెందుకు?" అని మౌనంగా ఉంటారు మధ్యస్థులు. అయినా, గుణాలను అధికంగా వెల్లడించడమే విశేషమని అందరికీ తెలిసిందే.

ఆసురస్వభావం కలిగిన కొందరు ప్రబంధాన్ని గంభీరంగా-లోతుకుదిగి విమర్శిస్తూ గుణాలనే దోషాలుగా చెప్పడానికి ఉద్యుక్తులవుతారు. ఇక సాత్త్విక స్వభావం గల వ్యక్తులు ఉన్నదోషాలను కూడా వెల్లడించరు. ఇలాంటి విమర్శ వల్ల ప్రయోజనమేమి?

కాబట్టి, పాదుకాదేవియే గుణదోషాలను పరీక్షించి, దోషాంశాన్ని ఉపేక్షించి, గుణాంశాన్ని-స్వీకరించాలని దేశికులు విన్నవించారు. ఎందుకు? అంటే, కొందఱు ఆదరించడమూ, మరికొందఱు అనాదరించడమూ ఈ స్థితి-స్తోత్రప్రబంధ నిర్మాతకు సందిగ్ధావస్థను కలిగిస్తుంది. పరులచేత సదసద్విభాగం దుఃశకం-గుణదోషావిష్కారం అసంభవం.

ఈ ప్రబంధనిర్మాణానికి తనను నియమించిన పాదుకాదేవియే, ప్రబంధ నిర్మాణం తర్వాత అందులోని గుణదోషాలను ఆవిష్కరించడం కోసం, సర్వసాక్షిణిగా ఉండాలనే కవిరాట్టు కృతజ్ఞ సమ్రాట్టు. పాదుకా సంతోషంకన్న మించిన ఫలాన్ని అపేక్షించడం లేదు కాబట్టి, తారతమ్య పరీక్షకోసం ప్రతీక్షించడమూ ఉండదు.

పాదుకాదేవి కంటె వేరేసాక్ష్యాన్ని కోరకపోవడానికి పూర్వార్థంలోని రెండు మాటలే కారణమవడం వల్ల, ఇది వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారం. వసన్తతిలకావృత్తం.

*1005. ఇత్థం త్వమేవ నిజకేళి వశాదకార్షీ*
*రిక్ష్వాకు నాథపదపంకజయోరనన్యా।*
*స్వీయంపదావని! మయాసుమహచ్చరిత్రం*
*సీతేవ దేవి! సహజేన కవీశ్వరేణ ॥-35.*

**అర్థం:-** హేదేవి! పదావని=ఓ పాదుకాదేవీ! ఇక్ష్వాకునాథ పదపంక జయోః=శ్రీరంగనాథుని/శ్రీరాముని పాదకమలాల యందు; అనన్యా=మరొకటి లేకుండా ఆశ్రయించిన; త్వం, ఏవ=నీవే; మయా=నాచేత; సహజేన=తోబుట్టువైన; కవి+ఈశ్వరేణ=కవిశ్రేష్ఠుడైన వాల్మీకి చేత; సీతా; ఇవ=జానకీ దేవివలె, స్వీయం=ఆత్మీయమైన; సుమహత్=గొప్ప మాహాత్మ్యంగల; చరిత్రం=చరితాన్ని, పాదుకాస్తోత్రకావ్యాన్ని/శ్రీమద్రామాయణ కావ్యాన్ని; నిజకేళివశాత్=స్వలీలావశంగా (స్వచ్ఛందంగా); ఇత్థం=ఈ విధంగా-శ్లోకసహస్రరూపంగా; అకార్షీః=చేశావు.

తా॥ ఓ పాదుకాదేవీ! శ్రీరాముని పాదారవిందాలను తప్పవేరొకటిని ఆశ్రయించనట్టి సీతాదేవి తనతో బుట్టువైన వాల్మీకి ద్వారా తన మహిమగల చరిత్ర అనే శ్రీమద్రామాయణ కావ్యాన్ని నిర్మించింది. అలాగే, శ్రీరంగనాథుని పాదపద్మాలను అనన్యంగా ఆశ్రయించిన నీవే నా ద్వారా నీ మాహాత్మ్యమున్న చరిత్ర అనే "పాదుకాసహస్ర" ప్రబంధాన్ని స్వచ్ఛందంగా నిర్మించావు.

వ్యాఖ్య :- ఈ స్తోత్ర రచన పట్ల స్వకర్తృత్వత్యాగాన్ని దేశికులు అనుసంధించిన శ్లోకం.

సీతాదేవి భూపుత్రిక. భూమికి అవయవమైన పుట్టనుంచి ఉద్భవించిన వాల్మీకి కూడా భూసుతడే. ఏకోదరులే కాబట్టి సీతమ్మకు వాల్మీకి సహజుడే-తోబుట్టువే. అనంతుడు తనకు సేవచేయడానికి సృజించిన జీవాత్మ(ల) స్వరూపమే ఆదిశేషుడు-పాదుక-ఆచార్యపురుషులు. అనంతసూరి పుత్రుడు శ్రీ వేంకటనాథ దేశికులు. (శేషపద్ధతిలో మొదటి-751 శ్లోకం గమనీయం). శేషత్వమే ఆత్మకు స్వరూపం కదా! కాబట్టి పాదుకాదేవికి దేశికులు తోబుట్టువు.

"అనన్యారాఘవేణాహంభాస్కరేణ ప్రభాయథా" (రామాయణం) (సూర్యునికీ, ఆయన తేజస్సుకూ భేదం లేనట్లే శ్రీరామునికీ, సీతమ్మకూభేదం లేదు) అన్నట్లూ, ఇక్ష్వాకుకులనాథుడైన శ్రీరామచంద్రస్వామి పాదాలనే హృదయంలో నిల్పుకొని ధ్యానించిన సీతాదేవి అనన్య.

"ఇక్ష్వాకూణాంకులధనం"అన్నట్లూ, ఇక్ష్వాకులకులధనమైన శ్రీరంగనాథుని పాదాలనే రక్షిస్తూ సేవించే పాదుకాదేవి అనన్య-ఇక్ష్వాకునాథ పాదానన్యత్వం సీతాపాదుకా సతీమతల్లులకు సాధారణం. సహజకవిత్వం అంటే వశ్యవాక్వాది అక్లిష్టకవిత్వం.

"అనారాధ్యకాళీం, అనాస్వాద్యగౌలీమ్, వినామంత్రతంత్రైర్వినా యత్నతశ్చ" అన్నట్లూ కాళిని పూజింపక, గౌలిని (రసాయనం) ఆస్వాదించక, మంత్రతంత్రాలను అనుష్ఠించక, ఏ ప్రయత్నం చేయక, స్వాభావికమైన కవిత్వమే సహజకవిత్వమని ప్రసిద్ధం.

"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్"
శ్రీమద్రామాయణ కావ్యమంతా మహనీయమైన సీతాచరితమే.

"శ్రీమద్రామాయణమపిపరం ప్రాణితి త్వచ్చరిత్రే" (శ్రీగుణరత్నకోశం) "సీతాచరిత్రయందే శ్రీమద్రామాయణమూ ఎక్కువగా బతుకుతున్నది, అన్నారు శ్రీపరాశరభట్టరు.

సుమహత్ :- సీతాచరితమూ, పాదుకాస్తోత్రమూ గొప్పమహిమకలవి. మిక్కిలి శ్రేయోదాయకమైనవి. వేదవతియైన లక్ష్మీదేవియే రావణ వధకోసం శ్రీరాముణ్ని అవతరింపజేసి, తానుసీతగా అవతరించింది. వాల్మీకి ఆశ్రమానికి-తోబుట్టువు ఇంటికి-వచ్చి ఇర్వురు కుమారులను ప్రసవించింది. ఆశ్రమంలోనే సీతమ్మ శ్రీరాముని పాదపద్మాలను ధ్యానిస్తుండగా, తమకూ, కుశలవులకూ, లోకానికీ ప్రేయఃశ్రేయస్సులు కలుగునట్లు వాల్మీకి కవికోకిల గానంతో శ్రీమద్రామాయణం ఆవిర్భవించింది.

పాదుకాదేవి సర్వశేషియైన శ్రీరంగనాథుని పాదాలనాశ్రయించిలీలగా సంచరిస్తుండగా, తనలాగా శేషత్వమే సహజ స్వరూపంగల శ్రీవేదాన్త దేశికుల ద్వారా విశ్వశ్రేయస్సు కోసం 'పాదుకా సహస్రం' ఆవిర్భవించింది.

"యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్।
యత్త పస్యసి కౌంతేయ! తత్కురుష్వమదర్పణమ్॥-(9-27)

మనం చేసే కర్మలనన్నిటినీ భగవంతునికి సమర్పించాలని గీతాచార్యుడు ఉపదేశించాడు.

"సంగంత్యక్త్వా ఫలంచైవ సత్యాగః సాత్త్వికోమతః" (భ.గీ.18-9)

స్వయంప్రయోజనంగా అవశ్యకర్తవ్యాలని తలచి, చేసే కర్మలయందు మమతనూ, ఫలాపేక్షనూ పరిత్యజించి, వాటిని ఆచరించడం సాత్త్వికత్యాగం.

"పరాత్తు తచ్ఛ్రుతేః"- అనే బ్రహ్మసూత్రం, జీవుడు స్వేచ్ఛతో ఏమిచేయలేడు. అంతర్యామిగా ఉన్న పరమాత్ముడే తన సంకల్పబలంతో ప్రతికార్యాన్ని ప్రవర్తింప జేస్తాడు, అని ఉపపాదిస్తుంది.

'నేను స్వతంత్రుడనుకాను, సర్వేశ్వరుడే కర్త' అని అనుసంధించడం వల్ల 'కర్తృత్త్వత్యాగం' సిద్ధిస్తుంది.

"తత్సర్వం దేవదేవస్య చరణావుపతిష్ఠతే". సమర్పింపబడినదంతా భగవత్పాదాలయందే చేరుతుంది అని శాస్త్రం.

ఉపమాలంకారం. వసంతతిలకావృత్తం.

*1006. పృథుక వదన శంఖ స్పర్శనీత్యాకదాచి*
*చ్ఛిరసి వినిహితాయాః స్వేనభూమ్నాతవైవ।*
*స్తుతిరియముపజాతా మన్ముఖేనే త్యధీయుః*
*పరిచరణపరాస్తే పాదుకేఽపాస్తదోషాః॥-36.*

**అర్థం:-** హే పాదుకే=ఓ పాదుకా! అపాస్తదోషాః=తొలగబడిన దోషాలు గల; తే=నీయొక్క; పరిచరణపరాః=దాస్యరసికులు; పృథుక వదన శంఖ స్పర్శనీత్యా=బాలుని యొక్క ముఖమందు శంఖంతాకిన న్యాయంగా; కదాచిత్=ఒకప్పుడు; శిరసి=తలమీద; వినిహితాయాః=ఉంచబడిన; తవ=నీయొక్క; స్వేన=సొంతమైన; భూమ్నా, ఏవ=మహిమచేతనే; ఇయం=ఈ; స్తుతిః=స్తోత్రం; మత్+ముఖేన =నా ద్వారా; ఉపజాతా=ఉద్భవించింది; ఇతి=అని; అధీయుః=స్మరింతురుగాక.

**తా॥** ఓ పాదుకాదేవీ! రాగద్వేషాలు లేని నీకైంకర్యపరులైన మహాత్ములు, బాలకుడైన ధ్రువుని ముఖాన భగవంతుడు శంఖస్పర్శచేసిన రీతిగా, ఒకప్పుడు నా శిరస్సున నీ స్పర్శకలగడం వల్ల నీ స్వంత మహిమచేతనే ఈ స్తోత్రం నా ముఖంగా వెలువడిందని స్మరింతురుగాత.

వ్యాఖ్య :-పాదుకాప్రేరణచేతనే ఈస్తోత్రమేర్పడిందని నిదర్శితం.

సీతాదేవి వాల్మీకి ఆశ్రమంలో నివసించడం వల్ల సీతాచరితం (రామాయణం) ఆవిర్భవించడానికి మూలకారణ మనడం వాస్తవమే. కానీ, పాదుకా చరిత్ర గల ఈ స్తోత్రరచన పాదుకాప్రేరణకు అధీనమయిందని ఎలా తెలిసేది? అని పాశ్చాత్యులకు-రాబోయే తరాలవారికి-కలిగే జిజ్ఞాసకు ఇది సమాధానం.

విద్యాభ్యాసమే లేని ధ్రువుడనే బాలుడు (ఉత్తానపాదుని తనయుడు) ఘోరతపస్సు చేయడం వల్ల వరాన్ని ప్రసాదించడానికి భగవంతుడు సాక్షాత్కరించాడు. తనలోపలచూచిన భగవంతుణ్ని బయట, తన ఎదుట చూచేసరికి ఎలాస్తుతించాలో తెల్యలేదు.

"స్తోతుం త్వామహమిచ్ఛామి తత్రప్రజ్ఞాం ప్రయచ్ఛమే (1.12.48)

'నిన్ను స్తుతించే యోగ్యతను అనుగ్రహించుమని ధ్రువుడు భగవంతుణ్ని ప్రార్థించాడు.

"శంఖం ప్రాంతేన గోవిందస్తం పస్పర్శకతాంజలిమ్ ।
ఉత్తానపాదతనయం ద్విజవర్యం జగత్పతిః॥" (1-12-49)

జగత్పతియైన గోవిందుడు పాంచజన్యమనే శంఖాగ్రభాగంచేత

బద్ధాంజలి యైనధ్రువుణ్ని స్పృశించాడని శ్రీవిష్ణు పురాణసూక్తి. ఎక్కడ స్పృశించాడో శ్రీ పరాశరుడుతెల్పలేదు. కానీ శ్రీపారాశర్యుడు స్పష్టపరచాడు.

"కృతాంజలింబ్రహ్మమయేన కంబునా
పస్పర్శ బాలం కృపయా కపోలే" (భాగ.4స్కం.9అ.4.)

అతద్విదుడై-దైవాన్ని ఏమని, ఎలాస్తుతించాలో తెలియక-కేల్మోడ్చిన బాలుణ్ని భగవానుడు కరుణించి. వేదమయమైన శంఖంచేత కపోలమందు స్పర్శించాడు.

"పృథుకౌ చిపిటార్భకౌ" (అమరం) అటుకులు, బాలుడు అని పృథుక శబ్దానికి రెండర్థాలు (పృథు కాయతి ఇతి=పృథుకః) బాగా మొరపెట్టేవాడు (బాలుడు) అని వ్యుత్పత్త్యర్థం.

ఆర్తుడైన ధ్రువుని కపోలమందు తగిలిన శంఖస్పర్శ జ్ఞానాన్ని కలిగించడం చేత ధ్రువుడు భగవంతుణ్ని స్వకపోలకల్పిత కవిత్వంతో అనర్గళంగా స్తోత్రంచేశాడు.

అలాగే, కదాచిత్-పాదుకాదేవి స్తోత్రరచనకు అనుమతించదలచి పాదుకా-శఠారి-స్పర్శ దేశికుల శిరస్సున ఏర్పడినప్పుడు-స్తుతింపదగిన జ్ఞానం లభించింది. దేశికులు అనర్ఘమైన కైతతో 'పాదుకాస్తోత్రప్రబంధాన్ని నిర్మించారు.

తొలుత, శ్రీరంగనాథుడు అర్చకముఖంగా దేశికుల శిరస్సున శఠకోపాన్ని బహుమానంగా కృపచేసి 'పాదుకాసహస్రాన్ని ప్రణయించండి' అని అభ్యనుజ్ఞ చేసినాడని సంప్రదాయం.

ధ్రువుడుస్తుతించే యోగ్యతకు శంఖస్పర్శకారణమైనట్లే, దేశికులు పాదుకా మహిమను స్తుతించే శక్తికి పాదుకా స్పర్శయే కారణం.

పరంపరగా భావితరాలవారైన భక్తులకు, పాదుకాదేవి దేశికుల శిరఃస్పర్శచేసి ఆయన ముఖంగా వేయిశ్లోకాలు గల తనస్తోత్రాన్ని ప్రబంధింపజేసిందని తెలియాలి. అర్చకులు ఇలాగా పాదుకా ప్రభావాన్ని భక్తులకు తెలియజేయాలి.

పాంచజన్యం కన్నా పాదుకా మహిమమిన్న.

శంఖస్పర్శతో శంఖస్తోత్రమేర్పడలేదుకదా! ధ్రువుని చేత తనసోత్రం చేయించుకొన్నాడు భగవానుడు. పాదుకా స్పర్శతో 'పాదుకాసోత్రమే' ఏర్పడింది. పాదుక 'శఠారి' యేకదా! సహస్రశాఖలు గల వేద సంహితను దర్శించిన శ్రీ శఠకోపదివ్యసూరి స్తోత్రమే (సహస్రగీతియే) ఇది.

హేత్వలంకారం. మాలినీవృత్తం.

*1007. యదిస్ఫీతాభక్తిః ప్రణయముఖవాణీ పరిపణం*
*పదత్రాణస్తోత్రం హృది బిభృథ రంగక్షితి భృతః।*
*నిరున్మాదో యద్వా నిరవధిసుధా నిర్ఝరముచో*
*వచోభంగీరేతా నకథమనురుంధే సహృదయః॥-37.*

**అర్థం:-** (హేజనాః=ఓ జనులారా!) స్ఫీతా=పూర్ణమైన; భక్తిః=ప్రేమ; యది=ఉంటే; ప్రణయముఖ, వాణీ, పరిపణం=విశ్వాసజనకమైన వేద శాస్త్రాలకు మూలధనమైన; రంగక్షితభృతః= శ్రీరంగరాజు యొక్క; పదత్రాణస్తోత్రం=పాదుకాస్తోత్రాన్ని; హృది=చిత్తమందు; బిభృథ=ధరించండి. యత్.వా=కాకపోతే (అథవా). నిరున్మాదః=బుద్ధిభ్రంశం లేని; సహృదయః=రసిక విద్వాంసుడు; నిరవధి సుధా నిర్ఝర ముచః=అపరిమితంగా అమృతధారలను వర్షించే; ఏతాః=ఈ; వచోభంగీః=వాగ్రీతులను; కథం=ఎలా; న, అనురుంధే=అనుసంధించడు? అనుసంధిస్తాడు.

**తా॥** భాగవతోత్తములారా! పూర్ణభక్తి కలవారే అయితే, మీరు రసభరితమైన వేదశాస్త్రాలకు ప్రాతినిధ్యం వహించే శ్రీరంగనాథ పాదుకా స్తోత్రాన్ని హృదయంతో గ్రహించండి, ఇలా చెప్పకున్నా, బుద్ధిభ్రష్టుడు కానట్టి సహృదయుడు అపరిమితంగా రసామృతప్రవాహాలు పొంగిపొర్లే ఈ వాగ్రీతులను ఎందుకు ఆదరించడు? సాదరంగా అనుసంధిస్తాడని తాత్పర్యం.

వాఖ్య :- పాదుకాస్తోత్ర పఠనం అభ్యుదయావహం, అని ఉపదిష్టం.

భారతీయ సంస్కృతికి మూలకందమైనది, మానవజాతికి విశ్వాసజనకమైన వేదాలకు మూలధనమైనది, వేదవేద్యమైన పాదుకాదేవిని ప్రతిపాదించేది, పూర్ణభక్తితో భగవంతుణ్ని స్తుతించడానికి కారణమైనది ఈ పాదుకాస్తోత్రం.

పాదుకాదేవియందు భక్తిలేని ప్రజలకు పాదుకాస్తోత్రం పట్ల ఆస్థ, ఆదరణ ఉండదు. వారు ఉదాసీనులై

ఉండడం సహజం. వారికి ఏమి చెప్పనక్కరలేదు.

ఈ స్తోత్రాన్ని పూర్ణమైన శ్రద్ధాభక్తులతో పదేపదే పఠించి, కంఠస్థం చేసే వారికి, సరససౌందర్య గంభీరార్థం గల సూక్తులను మనస్సులో స్మరించే వారికి వివేకమూ, విశ్వజనీనమైన ప్రేమ వృద్ధిపొందడమే కాక, పాదుకానుగ్రహం వల్ల పరమపురుషార్థమూ లభిస్తుంది-అన్నారు.

'ఈ స్తోత్రం ఇలాంటిది' అంటూచాటుకోవడమెందుకు? లోకంలో రసికులూ, అరసికులూ ఉన్నారు. రాసిక్యం లేని వారికేమి చెప్పినా ఫలం ఉండదు. రసికశిఖామణులైన సహృదయులు మాత్రం నిత్యప్రత్యగ్ర భావస్ఫోరకమైన, రసగర్భ సందర్భ సౌందర్య విభ్రాజితమైన ఈ స్తోత్రాన్ని తామే స్వయంగా గ్రహించి ఆదరిస్తారు; అనుసంధిస్తారు.

రసికులే అయినా, కొందరు పాదుకాభక్తి రసామృతప్రవాహానికి ఏతమెత్తిన కవితార్కికకేసరి, నిగమాంతదేశికుల ఈ కృతిని ఆదరించకపోతే, పారాయణం చేయకపోతే, వారు ఉన్మాదులు-పైత్యం పుట్టి, మతిచలించిన వారే-అయిఉంటారు. ఉన్మాదులకు చెప్పడం నిష్ప్రయోజనం.

తెలిసిన వారికి, తామే భోగ్యంగా ఆచార్యరుచి పరిగృహీతమని గ్రహిస్తారు కాబట్టి, చెప్పడం అనవసరం. ఇక తెలిసీ తెలియని నరుణ్ని 'బ్రహ్మాఽపి నరంజయతి' అన్నట్లు, ఎవ్వడూ తరింపజేయనేరడనడం ప్రసిద్ధం.

వేద వేదాన్తాది తత్త్వశాస్త్రవిషయాలను ఆచార్యులచేత ఉపదేశం పొందిన తర్వాతనే అనుసంథానం చేసే యోగ్యత కలుగతుంది. కానీ, పాదుకాస్తోత్రాన్ని భక్తి పూర్ణులైన మాన్యులూ, సామాన్యులూ, ఆబాలగోపాలం, స్త్రీ పురుషులందరు, ఉపదేశం పొందకయే, పఠించగలరని దేశికులు సహృదయులై ఆదేశించారు.

'చదువండి' అని పూర్వార్థంలో చెప్పి, ఉత్తరార్థంలో బుద్ధిమంతుడు ఎందుకు చదువడు? అనడం వల్ల ఇది ఆక్షేపాలంకారం. శిఖరిణీవృత్తం.

***1008.*** ***జయతి యతిరాజ సూక్తి***
***ర్జయతి ముకుందస్య పాదుకా యుగళీ।***
***తదుభయ ధనా స్త్రి వేదీ***
***మవంధ్యయంతో జయంతి భువి సంతః॥-38.***

**అర్థం:-** భువి=భూలోకమందు; యతిరాజసూక్తిః=యతీంద్రులైన భగవద్రామానుజుల శ్రీ భాష్యాది (గ్రంథం) సూక్తి; జయతి=సర్వోత్కృష్టంగా ప్రకాశిస్తుంది. ముకుందస్య=మోక్షదాతయైన శ్రీరంగనాథునియొక్క; పాదుకాయుగళీ=పాద రక్షలజత; జయతి=వైభవంగా ప్రకాశిస్తుంది. తత్+ఉభయధనాః=ఆ రెండుధనంగా కలిగిన; త్రివేదీం=వేదత్రయాన్ని; అవంధ్యయంతః=సఫలం చేస్తున్న; సంతః=సజ్జనులు; జయంతి=మహిమచే ప్రకాశిస్తారు.

**తా॥** భూమండలంలో శ్రీమద్రామానుజ యతీంద్రుల శ్రీభాష్యాది సూక్తి ప్రమాణోత్కర్షతో ప్రకాశిస్తుంది. మోక్షప్రదుడైన

